# చతుర ప్రపంచం

## వజ్రాల చరిత్ర

ప్రపంచంలో ఆడవాళ్లని అధికంగా ఆకర్షించేది బంగారం కాదు, వజ్రాలు. హాలీవుడ్ నటి ఎలిజబెత్ టేలర్ దగ్గర ఎక్కువ సంఖ్యలో వజ్రాలున్నాయి. మెడనుంచి, ముక్కుమీంచి, చెవులనుంచి తళతళ మెరిసే వజ్రాలు, వాటిని ధరించిన ఆడవారు చూపరులను బాగా ఆకర్షిస్తారంటే అతిశయోక్తి కాదు.

ఇంతా చేసి బొగ్గు దేనితో తయారైందో అదే కార్బన్‌తో డైమండ్స్ కూడా తయారవుతాయి. భూమికి 200 కిలోమీటర్ల లోతులో, 1200 డిగ్రీల సెల్సియస్ టెంపరేచర్‌తో, భూమి ఒత్తిడిశక్తి కాంబినేషన్‌తో వజ్రాలు తయారవుతాయి. అగ్నిపర్వతం పేలినప్పుడు ఇవి భూమిపైకి వస్తూవుంటాయి. ఒక కేరెట్ వజ్రం సంపాదించడానికి వందలకొద్దీ టన్నుల మట్టిని తవ్వితీసి జల్లెడ పట్టాల్సి ఉంటుంది.




ప్రపంచంలో ఆస్ట్రేలియా దేశం ఎక్కువ వజ్రాలు తవ్వితీసి మార్కెట్ చేస్తోంది. కానీ...అవి తక్కువ క్వాలిటీకి చెందినవి కాబట్టి వాటి విలువ తక్కువ. అవి పారిశ్రామిక యంత్రాలలో వాడడానికుపయోగిస్తారు. ఆభరణాలలో వినియోగించే వజ్రాలు అధికంగా ఆఫ్రికా ఖండంలో దొరుకుతాయి. బోట్స్‌వానా, సౌత్‌ఆఫ్రికా, అంగోలా, నమీబియా మొదటి నాలుగు స్థానాల్లో ఉన్నాయి.

డిబార్స్ అనే సంస్థ ప్రపంచంలోని డైమండ్ వ్యాపారం చేసే అతి పెద్ద సంస్థ. వీటి ధరలు నిర్ణయించేది ఆ కంపెనీయే అంటే అతిశయోక్తి కాదు. దానికి సౌత్‌ఆఫ్రికాలో సొంత వజ్రాల గనులున్నాయి. 70 శాతం డైమండ్స్ ఈ కంపెనీ ద్వారా సరఫరా అవుతున్నాయి. రష్యా, ఆస్ట్రేలియా, ఇండియా లాంటి కొన్ని దేశాలు డిబార్స్ తో సంబంధం లేకుండా తమ వజ్రాలను మార్కెట్ చేస్తున్నాయి. ఇండియాలో మధ్యప్రదేశ్‌లోని పన్నా అనేచోట డైమండ్ మైన్స్ ఉన్నాయి. ప్రపంచంలోని 125 దేశాలు వజ్రాల వ్యాపారంలో ఉన్నాయి.

వజ్రాలను గ్రేట్ చేసి, పాలిషింగ్ చేశాక వాటి విలువ 4,5 రెట్లు పెరుగుతుంది. న్యూయార్క్, పంట్‌వెర్ప్ (నెదర్‌లాండ్స్),

టెల్ అవివ్ (ఇజ్రాయిల్)లలో ఈ కటింగ్ వ్యాపారం అధికం. ప్రపంచంలోని 90 శాతం డైమండ్‌కటింగ్ పంట్‌వెర్ప్‌లోనే జరుగుతుంది. న్యూయార్క్‌లోని జ్యూయిష్ కుటుంబాలే వజ్రాల వ్యాపారంలో రాణిస్తున్నాయి.

ఈ వ్యాపారంలో తమాషా.... కొనేవాడు 'డైమండ్ బాగాలేదు' అన్నాడంటే దాన్ని కొనడానికి సిద్ధంగా ఉన్నాడని అర్థం. తను బాగుందంటే ధర ఎక్కువ చెప్తారని వజ్రంలో ఏదో లోపం ఉందనే కొనేవాడు చెపుతాడు. ఈ చిట్కా వందల ఏళ్లనుంచీ పాటిస్తున్నారు వ్యాపారస్థులు.

---

## ఒంటెల హాస్పిటల్

యునైటెడ్ అరబ్ ఎమిరేట్స్ లోని దుబాయ్ రాజకుమారుడు జనరల్ షేక్ మహమ్మద్ బీన్ రషీద్‌కి ఒంటెలంటే ప్రాణం. చిన్నప్పటినుంచీ వాటితో ఆడుకునేవాడు. కేవలం ఒంటెలకోసం ఓ హాస్పిటల్ కట్టించాడతను. దానికి ఏటా ఒకకోటీ ముప్పై లక్షల రూపాయలు చందా ఇస్తాడు. ఆయన పెంచే వందలకొద్దీ ఒంటెలతోపాటు ఇతర ప్రాంతాలకు చెందిన ఒంటెలు కూడా ఆ హాస్పిటల్‌కి చికిత్సకి వెళుతూ ఉంటాయి.

ఇతని పెంపుడు ఒంటెలు 13 నిముషాల్లో 8 కి.మీలు పరుగెత్తగలవు. ఆ సమయంలో వాటికి దెబ్బలు తప్పవు. అలాంటప్పుడు ఈ హాస్పిటల్‌కి అవి తీసుకు రాబడతాయి.




ఇందులో కేవలం ఒంటెలకోసం రూపొందించిన ఎక్స్-రే యంత్రాలు, వాటికి ఫిజియోథెరపీ ఇచ్చేందుకు తొట్టెలు మొదలయిన సౌకర్యాలున్నాయి. అంతేకాదు, గడ్డకట్టిన పిండాలని కూడా ఈ హాస్పిటల్‌లో దాస్తారు. అవికూడా ఒంటెల్లోని మేలుజాతికి చెందిన పిండాలే. వాటిని అవసరాన్ని బట్టి ఆడ ఒంటెల గర్భాశయాల్లోకి ప్రవేశపెడతారు.

ఒంటెల పరుగుపందాలు చాలాకాలంగా అరబ్ షేక్స్‌కి ప్రియమైన ఆట. అందులో మేలురకం ఒంటెలే పాల్గొంటాయి. అందుకే రోజూ వాటికి పరుగులో శిక్షణ ఇస్తూవుంటారు. గెలుపొందే అర్హత గల ఒకో ఒంటె ఖరీదు 3 కోట్ల రూపాయలదాకా పలుకుతుంది. రేసు గుర్రాలకన్నా రేసు ఒంటెల ఖరీదు ఎన్నోరెట్లు అధికం. అందుకు ప్రధాన కారణం వారికి అందుబాటులో ఉన్న పెట్రో డాలర్స్.

దుబాయ్‌లో ఉన్న ఈ ఒక్క హాస్పిటలే ప్రపంచంలో ఒంటెలకోసం నిర్మించిన ఏకైన చికిత్సాలయం.

# ఆఖరిమాటలు

ఏక్సిడెంట్‌లో మరణించడం అనేది నేటి యంత్రయుగంలో తప్పడంలేదు. 'అమెరికన్ ఫిజీషియన్స్ అసోసియేషన్' ఇటీవల అమెరికాలో ఏక్సిడెంట్స్‌లో మరణించిన కొందరి ఆఖరిమాటలని సేకరించారు. కొద్దిగా హాస్యంగా ఉన్నా వింటానికి కుతూహలంగా అనిపిస్తాయి. ప్రస్తుతం ఇంటర్‌నెట్ ద్వారా ఇవి సర్క్యులేట్ అవుతున్నాయి. ఏక్సిడెంట్‌లో మరణించబోయే ముందు కొందరి ఆఖరివాక్యాలివి.

ఇది ఫైర్‌ప్రూఫ్

ఈ బటన్ నొక్కితే ఏమవుతుంది?

ఇది కేవలం ర్యాష్ మాత్రమే. డాక్టరుదగ్గరకు వెళ్లక్కర్లేదు.

ఎలక్ట్రిసిటీ ఆ వైర్‌లోంచి పాసవ్వడంలేదనుకుంటాను.

లేదు నా రెండు బూటులేసులనీ ఎవరూ కలిపి కట్టలేదు.

ఈ తోడేలుపిల్ల తల్లి ఎక్కడుందో?




ఎలుకల మందు కేవలం ఎలుకలకే హాని చేస్తుంది.

ఇది ఆస్తమా మందే అనుకుంటాను.

మంచికుక్క.

ఇది నేను కళ్లు మూసుకుని చేయగలను.

ఈ గ్రెనైడ్ పాతికేళ్లక్రితంది. పేలదు.

ఈ తుపాకీలో గుళ్లున్నాయా?

ఫరవాలేదు. లక్షల్లో ఒక్కసారే అలా జరుగుతుంది.

మెయిన్‌స్విచ్ ఖచ్చితంగా ఆఫ్‌లో ఉందా?

ప్రింటింగ్‌ప్రెస్‌లో చెయ్యి ఇలా పెడితే అక్కడ ఇరుక్కుం...

పదినిముషాల్లో అక్కడ ఉంటాం.

ఆలశ్యం చేస్తే తలుపులు మూసేస్తారు.

ఏ ఎలక్ట్రిక్‌వైర్‌ని కట్ చేయాలి?

చాలా తేలిక. టీ.వీలో చాలాసార్లు చూశాను.

నా పర్సా? చస్తే ఇవ్వను. ఎందుకివ్వాలి?

చేతులు నెమ్మదిగా పైకెత్తు.

ఇది బాగా చేయడం నాకొచ్చు

రేపు బ్రేక్‌వైర్ బాగుచేయించాలి.

ఈ విస్కీ మనిద్దరికీ ఎక్కువనుకుంటాను.

ఎర్రలైటుందికానీ మనం కదిలేలోగా పచ్చలైటుగా మారుతోంది.



# చతురక తలు

## పాపం-పుణ్యం

ఓ ఆటోస్టాండ్‌లో ఆగిఉన్న ఆటో దగ్గరకి వెళ్లాడో రామదాసు. తను రామాలయానికి వెళ్లాలని చెప్పాడు.

"అటురాను. ఇటు చర్చివైపైతే వస్తాను." చెప్పాడు ఆటోవాడు.

"చూడు బాబూ! దాదాపు ఐదారువందలమంది నేను చెప్పే రామాయణం వినాలని అక్కడ కాచుకు కూర్చున్నారు. బస్సులు స్ట్రైక్ కాబట్టి ఆటోకోసం వచ్చాను. అటొస్తే నీక్కాస్త పుణ్యం వస్తుంది."

ఏకళనున్నాడో కానీ ఆటోవాడు ఒప్పుకున్నాడు. అయితే మీటర్‌మీద పదిరూపాయలు ఎక్స్‌ట్రా ఇవ్వాలన్నాడు. విధిలేక రామదాసు అందుకు ఒప్పుకున్నాడు. ఆయనెక్కిన ఆటో రామాలయం వైపు బయలుదేరింది. ఆటోడ్రైవరు యువకుడేమో ఆటో వేగంగా నడపసాగాడు.

"కాస్తంత నెమ్మదిగా నడుపు బాబూ" ఆటోడ్రైవరు ఆటో నడిపేతీరు చూసి భయంగా హెచ్చరించాడు రామదాసు.

"నాకిలా తోలడమే వచ్చు" చెప్పాడు ఆటోవాడు నిర్లక్ష్యంగా. రామదాసు శ్రీరాముడిమీద భారం వేశాడు.



ఓ లారీని ఓవర్‌టేక్ చేస్తూండగా ఆటో దానిముందు చక్రాలకింద పడి ఏమైందో తెలిసేలోపలే ఆటోడ్రైవరు,రామదాసు యమలోకంలో చిత్రగుప్తుడిముందు నిలబడ్డారు.

ముందు ఆటోడ్రైవరి చిట్టా తెరిచి, అందులోని వివరాలు చదివి చెప్పాడు ఆటోవాడికి చిత్రగుప్తుడు.

"నువ్వు స్వర్గలోకానికి వెళ్లచ్చు చాలా పుణ్యం సంపాదించావు"





తర్వాత చిత్రగుప్తుడు రామదాసు చిట్టా తెరిచి చూశాడు. తనుకూడా స్వర్గానికి ఖచ్చితంగా వెళ్తా నన్న ధీమాతో ఉన్న రామదాసుకి చెప్పాడు చిత్ర గుప్తుడు.

"నువ్వు సంపాదించిన పుణ్యం నిల్. చాలా పాపం మూటకట్టుకుని వచ్చావు కాబట్టి నరకానికి వెళ్లకతప్పదు."

యమభటులు రామదాసుని పట్టుకోగానే చెప్పాడాయన.

"లేదుసార్! ఎక్కడో పొరపాటు జరిగిపో యింది. మరోసారి అకౌంట్ చూడండి"

చిత్రగుప్తుడు ఆయన తృప్తికోసం మరోసారి చూసి చెప్పాడు తను పొరపడలేదని. "ఓ క్షణం! మీటరుమీద అదనంగా ఇస్తే గానీ రానని గొడవ చేసి, నిజాయితీగా ప్రవర్తించని ఆటోడ్రైవరుకి స్వర్గమా? రోజూ రామభక్తులకి రామాయణ హరికథాకాలక్షేపం సాగించిన నాకు నరకమా? ఇదన్యాయం. అతను చేసిన పుణ్యం ఏమిటి? నేను చేసిన పాపం ఏమిటి? వివరించండి"

రామదాసు డిమాండ్ విని చిన్నగా మంద హాసం చేసి చెప్పాడు చిత్రగుప్తుడు.

"మేం చూసేది ఫలితాలు. నువ్వు రామాయణ కథా కాలక్షేపం చేస్తుండగా వినే వాళ్లంతా నిద్ర పోయేవారు. ఈ ఆటో డ్రైవరు ఆటో నడుపుతుం డగా అందులోని ప్రయాణీకులంతా దేముణ్ణి ప్రార్థించేవారు".

**-పృథ్వీరాజ్**

---

# కత్తెర

కామేశ్వర్రావు గొప్ప రచయిత.
అది కామేశ్వర్రావు అభిప్రాయం.



అతను రాయని ప్రక్రియ లేదు. నవల, నాటకం, కథ, గల్పిక, కవిత, వ్యాసం... ఒకటనే మిటి అటు ప్రాచీన సాహిత్యం నుండి ఇటు మోడ్రన్ పొయిట్రీ వరకూ ముట్టని సబ్జెక్టు లేదు.

అదృష్టమేమిటంటే అందులోని ఒక్కక్షరం ముక్క కూడా ఇంతవరకూ అచ్చవలేదు. కామేశ్వ రరావు కార్యశూరుడు. ఎలాగైనా అచ్చులో తన పేరు చూసుకోవాలని దీక్ష పట్టి వున్నాడు. అత గాడి అచ్చుముచ్చట ముత్యంగా మూడు సార్లు తీరిందిప్పటికి. ఓటర్ల లిస్టులో ఒకసారి అతని

పేరు అచ్చయింది. పెళ్లి శుభలేఖలో వరుడిగా ఒకసారి వచ్చింది. ఈ మధ్య అదేదో బ్యాంకు వాళ్లు బంగారం మీద లోను తీసుకుని కట్టనివా ళ్లకి నోటీసిచ్చే లిస్టులో కూడా కామేశ్వర్రావు పేరు కొట్టొచ్చినట్టచ్చయ్యింది. అయితే అలాంటి పేర్లేవీ అతనికి తృప్తి కలిగించేవి కాదు. అతనికి కావా ల్సింది అచ్చంగా తను రాసిన రచన అచ్చయి దాని క్రింద అతని పేరు అచ్చవటం. అందుకోసం కామేశ్వర్రావు దాడిచేయని పత్రిక ఆంధ్రదేశంలో లేదు. బాలమిత్ర దగ్గరనుంచి, భారతి వరకూ అప్పట్లో ఒక పట్టు పట్టేడు. అతగాడి దెబ్బకు తట్టుకోలేక కొన్ని పత్రికలు మూతబడిన మాట కూడా నిజం. దిన, వార, పక్ష, మాస, త్రైమాసిక పత్రికలవరకూ అతను రచనలను పంపని పత్రిక లేదు. అదేంటో అందరూ కలిసి ఏకాభిప్రాయాని కొచ్చినట్టున్నారు... అతని రచనలన్నీ తిరుగుట పాలో తిరిగొచ్చేవి. అతని వీధి పోస్ట్‌మాన్ అతని టపా మోయలేకే టపా కట్టేశాడని వినికిడి.

కొత్త పత్రికొకటి మొదలవబోతోందని ప్రకటన వచ్చింది. వెంటనే కామేశ్వర్రావు ఒక కిలో బరు వున్న నవలను రాసిపారేసి పత్రికకి పంపేశాడు. దానితోపాటు ఒక లెటరు... "ఆంధ్రసాహిత్యాన్ని కాచి వడబోసి ఒక నవలారాజాన్ని రాయటం జరి గింది. దీన్ని తమ పత్రికలో ప్రచురించ ప్రార్థన. స్థలాభావం కారణమైతే కత్తిరించుకునే స్వేచ్ఛ మీకిస్తున్నాను." అంటూ.

వారం రోజుల్లో కామేశ్వర్రావింటికి పోస్ట్‌మాన్ కావడితో బరువు తెచ్చి పారేసి పోయాడు. విప్పి చూస్తే తను పంపిన నవల. దానితోపాటే చిన్ని పార్శిలు. అదీ విప్పితే ఒక ఉత్తరం. ఎడిటర్‌గారి దగ్గరనుండి.... "మీ నవలను పరిశీలించటం జరి గింది. కత్తిరించే స్వేచ్ఛ నిచ్చినందుకు కృతజ్ఞ తలు. సమయాభావం చేత మేమా పని చేయలే కపోతున్నాం. మీరే ఆ పని చేసుకోవచ్చు. వీలుగా వుండేందుకు ఒక కత్తెర బహుమతిగా పంపుతున్నాం. ఇట్లు... సంపాదకుడు."

**-కర్లపాలెం హనుమంతరావు**

---

## గోరుచుట్టు మీద

పద్దెనిమిది పెర్సెంట్ వడ్డీ, ఏడు పెర్సెంట్ ఇన్‌సెన్‌టివ్, ఆకర్షణీయమైన గిఫ్ట్.... అనే ప్రకట నలతో అనేక ఫిక్సెడ్ డిపాజిట్ కంపెనీలు ప్రజ లని ఆకర్షించడం మొదలెట్టాయి.

అలా ప్రజలని వైకుంఠం ఫైనాన్స్ కంపెనీ అమి తంగా ఆకట్టుకోవడంతో అందులోనే వారు లక్షల కొద్దీ డిపాజిట్ చేశారు. వెంటనే గిఫ్టుగా త్రీఫోల్డ్ అంబరిల్లాలు, ఏడున్నర పెర్సెంట్ ఇన్‌సెన్‌టివ్, ఫిక్సెడ్‌డిపాజిట్ రసీదు, అడ్వాన్స్‌డ్ ఇంట్రెస్ట్ వారంట్లు అందుకున్నారు.

ఆ ఇంట్రెస్ట్ వారంట్లు చెల్లడంతో ఏడాది గడిచే సరికి వైకుంఠం ఫైనాన్స్ కంపెనీ మీద ప్రజలకి నమ్మకం పెరగడంతో అందరూ తమ ఎఫ్.డి లని రెన్యూ చేసుకున్నారు. ఈసారి క్యాసరోల్స్ గిఫ్ట్సుగా అందుకున్నారు

అయితే ముచ్చటగా మూడు నెలలు తిరిగేసరికి అందరి ఇంట్రెస్ట్ వారెంట్లు బ్యాంకులనుంచి ఇళ్లకి తిరిగి వచ్చేశాయి. అందరూ కంపెనీ ఆఫీసుదగ్గ రకు ఆదరాబాదరా వెళ్లారు. అక్కడ ఏ ఫైనాన్స్‌కం పెనీ బోర్డూ లేదు.

హాహాకారాలు, ఆర్తనాదాలు తగ్గాక "పోలీసు కమీషనరు దగ్గరకు వెళ్లి రిపోర్ట్ ఇద్దాం." అన్నారు ఇంకొకరు. అలా రకరకాల 'తరుణోపాయాలు' వెల్ల డయ్యాయి.

ఇంతలో సగం తల నెరిసిన ఒకరు "వాటి వలన ప్రయోజనం ఉండదు. మనం వెంటనే సంఘం ఏర్పరచాలి. అందరి దగ్గరా సభ్యత్వ రుసుము స్వీకరించాలి. న్యాయవాదిని పెట్టుకుని చట్టబద్ధంగా పోరాడాలి" అని చిన్న ఉపన్యాసం ఇచ్చారు. తన పేరు సుబ్బారావు అని చెప్పారు.

అందరూ "సరే" అన్నారు.

"అయితే ప్రెసిడెంట్‌గా ఎవరు ఉంటారు?" అన్నారు ఒకరు.

"సూచన ఇచ్చిన సుబ్బారావు గారే ప్రెసిడెంట్" అన్నారు ఇంకొకరు.




"యస్" అన్నారు అందరూ.

అలా అక్కడికక్కడే వైకుంఠం ఫైనాన్స్ కంపెనీ డిపాజిటర్ల బాధితుల సంఘం ఏర్పడిపోయింది. 'ఆల్ ఇన్ ఆల్' గా సుబ్బారావుతోనే పనిచేయడం ప్రారంభించింది.

"సభ్యత్వ రుసుం నూరురూపాయలు. రిజిస్ట్రేషన్ రుసుం పది రూపాయలు పెట్టుకుందాము. రశీదు పుస్తకం రేపు ప్రింట్ చేయిద్దాం." అన్నాడు సుబ్బారావు.

అందరూ "సరే" అన్నారు మళ్లీ. ఒక ఇరవై మంది అప్పటికప్పుడే సభ్యులుగా చేరారు.

"ఆఫీసుకి కూడా ఒక రూమ్ తీసుకుందాము." అన్నాడు సుబ్బారావు.

"లేకపోతే ఎలాగ?" అన్నారు అందరూ. ఎలాగయినా వైకుంఠం ఫైనాన్స్ కంపెనీ డైరెక్టర్ల ముక్కు పట్టుకుని అసలు వసూలు చేసుకోవాలన్నారు కొందరు. వడ్డీని వదిలిపెట్టకూడదన్నారు మరికొందరు.

వైకుంఠం ఫైనాన్స్ కంపెనీ డిపాజిటర్ల బాధితుల సంఘానికి సుబ్బారావు ఒక రూమ్ తీసుకుని స్థానిక పత్రికలలో న్యూస్ ఐటమ్ ఇచ్చాడు.

వైకుంఠం బాధితులు చెప్పుకోతగ్గ సంఖ్యలో సభ్యత్వం స్వీకరించారు. రశీదులు తీసుకుని సుబ్బారావుని అభినందించారు.

ఓ రెండునెలలపాటు వారానికో ప్రింటెడ్ పోస్ట్ కార్డ్ మీద సభ్యులందరికీ బాధితులు సంఘం ప్రోగ్రెస్ తెలియజేశాడు సుబ్బారావు. తమది ఒకటిరెండునెలలలో తేలే సమస్య కాదని ఆ ఉత్తరాలలో వివరించారు.

మూడు నెలలు తిరిగాయి. ఈసారి ఎవరికీ ఏ కార్డూ రాలేదు. స్వయంగా వెళ్లి విషయం తెలుసుకుందామని బాధితుల సంఘం ఆఫీసురూమ్‌కి వెళ్లారు సభ్యులు. రూమ్‌కి తాళం వేసి ఉంది. ఆ రూమ్ ఓనర్ ఎడ్రస్ తెలుసుకుని సభ్యులు అక్కడికి చేరుకున్నారు.



"సుబ్బారావుగారు ఎంతమంచివారండీ! మూడు నెలలకే అని చెప్పి రూమ్ అద్దెకు తీసుకున్నారు. మూడు నెలల అద్దె కరెంట్ ఛార్జెస్‌తో సహా కరెక్ట్‌గా చెల్లించారు. నిన్ననే అడ్వాన్స్ డబ్బులు తీసుకుని రూమ్ ఖాళీ చేశారు." అన్నాడు ఆ ఓనర్.

బాధితులు 'సుబ్బారావు బాధితులు' గా అతడి మీద కంప్లెయింట్ ఇవ్వడానికి పోలీస్‌కమిషనరు కార్యాలయంవైపు పరుగెత్తారు.

—తాజీప్రసాద్



# చతుర

సంపుటి: 23

సంచిక: 8

సెప్టెంబర్: 2000


కన్నతల్లికోసం తన జీవితాన్ని త్యాగం చెయ్యడానికయినా సిద్ధమేననీ, పెళ్లి, భర్త, పిల్లలూ... లాంటి వన్నీ వృద్ధురాలైన తన తల్లికీ, తనకీ మధ్య అడ్డుగోడలవుతాయి కనుక తాను అజన్మ బ్రహ్మచారిణిగానే వుండిపోవాలని నిర్ణయించుకుందామె.

అదంతా తెలిసి కూడా ఆమెను ప్రాణసమానంగా ప్రేమించిన డాక్టరు పక్షవాతం వచ్చి మంచాన పడిన ఆమె తల్లితోసహా ఆమెను తన జీవితంలోకి ఆహ్వానించాడు. కాబోయే అత్తగారికోసం తన ఇంటినే హాస్పిటల్‌గా మార్చి సకల సౌకర్యాలనూ ఏర్పాటు చేశాడు.

అయినా ఆమె... ఉత్తముడయిన...

ఆ యువ డాక్టర్‌ని కాదని దూరంగా వెళ్ళిపోయిన కారణం ఏమిటి?

ఆప్తమిత్రురాలి సలహాని కూడా తోసిపుచ్చి వివాహంపట్ల విముఖతచూపించిన ఆ అమ్మాయి అంతర్మథనం ఎలాంటిది? అంతిమంగా జరిగిందేమిటి?

సామాజిక సమస్యకు సాక్షీకరణ **కోలపల్లి ఈశ్వర్** రచన **కూతురు** ఈ నెల చతుర సమగ్ర నవల.



# కూతురు

-కోలపల్లి ఈశ్వర్

తూర్పుదిక్కున ఇంకా సూర్యుడు ఉదయించలేదు.

అయితే సూర్యోదయానికి ముందే విచ్చుకున్న వెలుగులో ప్రపంచానికి అప్పటికే తెల్లవారింది.

పల్లెలో జనం వెలుగుకి ముందే రోడ్డెక్కి పొలాలవైపు సాగుతారు. అదే సిటీలో జనం ఎనిమిదింటి తర్వాతే రోడ్డుమీద కనిపిస్తుంటారు.

హైదరాబాద్ నగరంలోని ఆ బిజీరోడ్ ఇంకా జనంతో నిండలేదు. అప్పుడప్పుడు ఒక వాహనం వెళుతోంది. కనుచూపుమేరలో ఇద్దరు ముగ్గురు మనుషులు మాత్రమే కనిపిస్తున్నారు.

ఓ బిల్డింగ్ మూడో అంతస్తులో కిటికీ దగ్గర నిలబడి రోడ్డుమీదకే చూస్తూవుంది రేవతి.

వర్కింగ్ ఉమెన్స్ హాస్టల్ బిల్డింగ్ అది!

మారుతున్న కాలంలో మారిన యువతుల మనోభావాలకు, స్థితిగతులకు ప్రతిరూపం ఆ నిలయం. స్వంతకాళ్ళమీద నిలబడాలనుకునే స్త్రీలకు అది ఆలయం.

ఒకప్పుడు నాలుగుగోడల మధ్యకే పరిమితం అయిన మహిళ కాలంమారి గడప దాటి వచ్చి ఎన్నో విజయాలను సాధించింది. ఇప్పుడు ఆమె మరింత స్వతంత్రురాలు కావాలని ప్రయత్నిస్తోంది. తన కాళ్ల మీద తను నిలబడడమే కాదు. తన బతుకు తను బతకగలనని నిరూపిస్తోంది. అలాంటి మహిళల మనోభావాలకు అనుగుణంగా ఆశ్రయం కల్పించడానికేనన్నట్లు ఈ వర్కింగ్ ఉమెన్స్ హాస్టల్స్ వెలిశాయి.

ఆచోట ఎన్నెన్నో జీవితాలు, మరెన్నో మనస్తత్వాలు.

వాళ్లల్లో కొంతమంది డిగ్రీ చేతపట్టుకుని నగరానికి వచ్చి తెలిసినవాళ్ళూ, ఆదరించే వాళ్ళూ లేక హాస్టల్స్‌లో చేరుతారు.

నగరంలో అయినవాళ్లున్నా వాళ్ళతో ఉండడానికి ఇష్టపడక హాస్టల్స్‌లో ఉంటుంటారు మరికొందరు.

భర్తలతో విడిపోయి జీవితాంతం వంటరిగానే బతకాలని నిర్ణయించుకుని ఇక్కడ చేరుతారు ఇంకొందరు.

మారుతున్న సమాజంలో స్త్రీల కొరకు అభివృద్ధి చెందిన సౌకర్యం 'వర్కింగ్ ఉమెన్స్ హాస్టల్' అని చెప్పొచ్చు.

'ఇలాంటి వర్కింగ్ ఉమెన్స్ హాస్టల్‌లో తను ఉండవలసివస్తుందని జీవితంలో ఏనాడయినా అనుకుందా?' అనిపించింది రేవతికి.

అనుకోలేదుగానీ అనుకోనివి జరగడమే కదా జీవితం అనుకుని రేవతి తనలోతానే నవ్వుకుంటూ భుజాలెగరేసింది. సరిగ్గా అప్పుడే చాలా దగ్గరగా వినిపించింది "గుడ్ మార్నింగ్ రేవతి" అని. రేవతి తలతిప్పి చూసింది.

కల్పన!

"వెరీ గుడ్‌మార్నింగ్! ఏమిటీరోజు స్పెషాలిటీ? ఆరింటికే నిద్రలేచేశావ్?"

"విశేషమేం లేదులే. ఏదో నిద్రపట్టక పొర్లుతుంటే నువ్వు లేచి ఉండటం కంటపడింది. సరే! ఈ ఒక్కరోజయినా నేను నీలా ఉదయమే లేవాలనుకుని అతికష్టంమీద లేచేశాను" నవ్వింది కల్పన.

కల్పన చామనఛాయలో ఉంటుంది. కాని చాలా అందంగా కనిపిస్తుంది. ఏదో తెలియని ఆకర్షణ ఆమెలో ఉందేమో! ముఖ్యంగా నవ్వినప్పుడు ఆమె అందం రెట్టింపు అవుతుంది.

"వెరీగుడ్! అయితే నీకు ఇప్పుడిప్పుడే మంచి లక్షణాలు వస్తున్నాయన్నమాట" రేవతి కూడా నవ్వింది.

"మంచి అమ్మాయితో స్నేహం చేశాక మంచి లక్షణాలు కొన్నయినా వంటపట్టకుండా ఎలా ఉంటాయి చెప్పు?"

కల్పన తనను ఉద్దేశించి అలా అనడంతో రేవతి కాస్త సిగ్గుపడింది. "నేను బాత్‌రూమ్‌కి వెళ్లొస్తా" కల్పన అటాచ్‌డ్ బాత్‌రూమ్

వైపు నడిచింది.

కిటికీ దగ్గర మళ్ళీ రేవతి ఒక్కతే మిగిలింది. ఈసారి రేవతి రోడ్డువైపు చూడలేదు. తలతిప్పుకుని తనున్న ఆ గదిలోకి చూడసాగింది.

కల్పన నిద్రలేచిందిగాని బిందు, ప్రతిమలు ఇంకా నిద్రపోతూనేవున్నారు. ఆరయినా వాళ్ళకింకా మెలుకువ రాలేదు. పైగా వాళ్ళ నైటీలు మోకాళ్లపైకి జరిగిపోయి వున్నా తెలియనంత గాఢనిద్రలో ఉన్నారు.

చిన్నగది అది. ఆ చిన్నగదిలోనే నలుగురు ఉంటున్నారు. తను, కల్పన, బిందు, ప్రతిమ.

తనది గుంటూరు. కల్పనది హైదరాబాద్ దగ్గర్లోనే ఏదో పల్లె. బిందుది వరంగల్. ప్రతిమది నిజామాబాద్.

ఎక్కడెక్కడివాళ్ళో ఇక్కడ ఇలా కలుసుకోవడం.

తనేమో తల్లి కష్టాలలో పాలు పంచుకోవాలని, వయసు తగ్గి పనిచేయలేనిస్థితిలో ఉన్న ఆమెను తనతో ఉంచుకుని పోషించాలనే ఆశయంతో గుంటూరు వదిలి హైదరాబాద్ వచ్చి ఉద్యోగంలో చేరింది.

కల్పన ఇంట్లో సవతితల్లితో బాధలు పడడం ఇష్టంలేక ఇల్లు వదిలి హాస్టల్ చేరింది.

బిందుది విడాకుల కేసు.

ప్రతిమ ఇంట్లో ఉంటే చదువు సాగడంలేదని హాస్టల్‌లో చేరి ఉద్యోగం చేసుకుంటూనే కంప్యూటర్ క్లాసెస్‌కి అటెండ్ అవుతోంది. ఆ గదిలో వున్న తమ నలుగురిలో బిందు మాత్రమే పెళ్లయిన యువతి.

కల్పన వచ్చింది, "ఏంటీ, ఇంకా ఇక్కడే నిలబడ్డావా? "

"ఉదయాన్నే నిద్రలేవడం అలవాటు. ఇంటి దగ్గరయితే నిద్రలేవగానే ఇల్లు చిమ్మడం, అంట్లు తోమడంలాంటి పనులుండేవి. కాని ఇక్కడ మనం అలాంటివేమీ చేయక్కర్లేదు. కాబట్టి ఉదయాన్నే లేచి ఏంచేయాలో తోచడంలేదు. అందుకే ఇలా కిటికీ దగ్గర టైంపాస్ చేస్తున్నాను రోజూ"

"అయితే మనమోపని చేద్దామే రేవతీ"

"ఏమిటి? "

"ఉదయాన్నే వృధాగా గడపడం ఎందుకు? నాలుగిళ్ళల్లో వాకిళ్లు చిమ్మడం, అంట్లు తోమడంలాంటి పనులు కుదుర్చుకుందాం. దాంతో ఉదయాన్నే మనకు టైంపాసూ, అలాగే డబ్బుకి... డబ్బు ఏమంటావ్? "

కల్పన జోక్‌గా అన్నమాటలకి రేవతి హాయిగా నవ్వింది.

"సర్లే! మనం కిందికెళ్లి టీ తాగుదామా? " కల్పనను అడిగింది రేవతి.

కల్పన తలాడించింది.

ఇద్దరూ గదిలోనుండి బయటకు నడిచి కారిడార్ చివరకు వెళ్ళాక అక్కడనుండి మెట్లు దిగసాగారు.

ఆ మూడంతస్థుల బిల్డింగ్‌లో ఒక్కో అంతస్థులో పదేసి గదులున్నాయి. ఒక్కోగదిలో నలుగురయిదుగురు అమ్మాయిల చొప్పున హాస్టల్‌లో సుమారు నూటయాభై మందివరకూ వున్నారు. వాళ్ళలో ఇరవైఏళ్ల నుండి నలభైఏళ్లవయసు వరకూ వుండేవాళ్లున్నారు. అయితే ముప్ఫయ్ ఏళ్లపైబడిన వారి సంఖ్య పదికి మించదు. మిగలినవాళ్ళంతా ఇరవై, ముప్ఫై మధ్య వయసులో వాళ్లే.

కిందికి దిగుతుంటే అక్కడక్కడా ఎదురుపడిన అమ్మాయిలు వాళ్ళిద్దరినీ చూసి పలకరింపుగా నవ్వుతున్నారు. ఒకరిద్దరు మాత్రం కల్పనతో "హాయ్" అన్నారు.

నిజం చెప్పాలంటే తను చాలా మితభాషి. కల్పన మాత్రం అందరితో చనువుగా మాట్లాడేస్తుంది. వీలు దొరికితే ఎవరో ఒకరి గదిలో దూరేసి బాతాఖానీ కబుర్లలో మునిగిపోతుంది.

ఇద్దరూ గ్రౌండ్‌ఫ్లోర్‌లోకి వచ్చాక గదులకు దూరంగా వున్న అవుట్‌హవుస్‌లాంటి

ఇంటివైపు నడవసాగారు. అది కిచెన్ కం డైనింగ్ రూమ్.

ప్రైవేట్ మేనేజ్‌మెంట్ హాస్టల్ అది.

మనిషికి నెలకు పన్నెండువందల రూపాయల చొప్పున ఫీజు. ఆ పన్నెండువందల రూపాయలకు భోజనంతోపాటు వసతి కూడా.

ఒక ఆడపిల్ల భోజన, వసతి ఖర్చు నెలకి పన్నెండు వందలంటే కాస్త ఎక్కువే. నలుగురు వర్కింగ్ ఉమెన్స్ ఓ గది తీసుకుని వంట వండుకోవడం మొదలుపెడితే తలకు ఆరొందల రూపాయలతో సర్దుకోవచ్చు కాని చాలామంది అలా చేయడానికి ఇష్టపడరు. కారణం సేఫ్టీ! వర్కింగ్ ఉమెన్స్ హాస్టల్‌లో వున్న సేఫ్టీ వాళ్ళకు బయట గది తీసుకుని ఉండడంలో ఉండదు. అందువల్లే వర్కింగ్ ఉమెన్ చాలామంది హాస్టల్‌నే ప్రిఫర్ చేస్తారు.

వాళ్ళిద్దరినీ చూడడంతోనే వంటమనిషి రెండు కప్పుల్లో టీ పోసి అందించింది.

ఎంతయినా ప్రైవేట్ మేనేజ్‌మెంట్ కాబట్టి రుచికి, శుచికి ఢోకా లేదక్కడ.

ఉదయం టీ ఇస్తారు. ఆఫీస్‌కి వెళ్ళే ముందు టిఫిన్. అదీ రోజుకో వెరైటీ. మధ్యాహ్నం లంచ్ బాక్స్‌ల్లో సర్దేసి ఇస్తారు. సాయంత్రం ఆఫీసునుండి రాగానే కాఫీ, నైట్ డిన్నర్.

ఆఫీసుకి వెళ్ళడం, రావడం అంతే! రూమ్‌కి వచ్చాక మరోపని చేయక్కర్లేదు. ఏదో ఆదివారంరోజు కాస్త శ్రమపడి వారానికి సరిపడా బట్టలు ఉతికేసుకుంటే చాలు. మొత్తంమీద తీరికతో కూడుకున్న జీవితం. డబ్బుండాలి. అంతే!

అక్కడ చేరిన కొత్తల్లో అందరూ చాలా సుఖంగా వుందంటారు. అయితే రోజులు గడిచేకొద్దీ వాళ్ళ ముఖాలలో ఆ ఉత్సాహం మటుమాయమవుతుంది. ఆ స్థానంలో ఏదో చిరాకు, మరేదో పోగొట్టుకున్న దిగులు కనిపించడం మొదలవుతుంది.

ఎందుకని అలా? !

జవాబుగా తోచేది ఒక్కటే- మనిషి తినీ పనిచేసీ తీరికగా కూర్చోవడం ఒక్కటే కోరుకోడు. తిండి, తీరికతో కూడుకున్న సుఖం మాత్రమే సరిపోదు. మనిషికి మరేదో కావాలి. అదేమిటి?

అభిమానమా? !

ఆప్యాయతా? !

ప్రేమా? !!

ఏదయినా కావచ్చు మనిషి అలాంటి అనుబంధాలను కోరుకుంటాడు. అందుకోసం తను కొంత కష్టపడడాన్ని కూడా ఇష్టపడతాడు.

రేవతికి 'తల్లి' గుర్తుకొచ్చింది.

చాయ్ తాగడం పూర్తయింది.

వాళ్ళిద్దరూ వెనుతిరిగి రూమ్‌వైపు నడవసాగారు.

రూమ్ చేరాక రేవతి కల్పనతో అంది. "నేనింక స్నానాదికాలు మొదలుపెడతానే"

"అలాగే" అంది కల్పన.

రేవతి తొమ్మిదింటికే ఆఫీసులో ఉండాలి. కల్పన తొమ్మిదిన్నరకు బయల్దేరినా టైమ్ సరిపోతుంది.

మరో రెండు గంటల తర్వాత రేవతి లంచ్‌బాక్స్ తీసుకుని హాస్టల్‌నుండి బయట పడింది.

★ ★ ★

ఆఫీసులు తెరిచేవేళలోనో, వదిలే సమయాలలోనో పదినిముషాలు... కేవలం పది నిమిషాలు బస్టాప్‌లో నిలబడితే చాలు. సిటీలో ఎంతశాతం స్త్రీలు గడపదాటి వచ్చి శ్రమపడుతున్నారో తెలిసిపోతుంది.

ఇంచుమించు మగాళ్లకు సమాన సంఖ్యలోనే వాళ్ళూ కనిపిస్తారు.

ఇంతమంది మహిళలు... వాళ్ళలో ఎక్కువమంది భర్త చాటు భార్యలు... వీళ్ళంతా ఎందుకు ఇంతలా ఉద్యోగాల్ని ఇష్టపడుతున్నారు?

మరోలా చెప్పాలంటే వీళ్ళు మగాళ్ళకన్నా




ఎక్కువగా కష్టపడుతున్నారు.

వేకువఝామునే లేచి వంటపనులు మొదలుపెట్టి, పిల్లలకు స్నానాదికాలు చేయించి, వాళ్ళను కాన్వెంట్ లకు పంపి, భర్తను లేపి అతడికి కావలసినవన్నీ సమకూర్చి చివరగా తామింత తిని తయారై ఆఫీసులకు పరుగెత్తడం!

ఎందుకు వాళ్ళకీ శ్రమ?

చాలీచాలని జీతంతో కష్టపడుతున్న భర్త శ్రమలో పాలుపంచుకోవడమా? !

వచ్చే ఆదాయం సరిపోతున్నా తమస్థితి మరింత పెంచుకోవాలనే తాపత్రయమా?

ఇంట్లో ఊరికే కూర్చుంటే ఏమొస్తుంది అని తీరిక కాలాన్ని సద్వినియోగం చేసుకోవడమా?

కారణం ఏదయినా ఆధునిక మహిళ చాలా కష్టపడుతోంది. అయితే ఉద్యోగం చేస్తూ కష్టపడుతున్నారు. కానీ చాలామంది అలా ఉద్యోగం చేయడానికి చెప్పుకునే కారణాలలో ఏ ఒక్కటీ అసలు కారణం కాదు.

అదో ప్రత్యేకమైన కారణం!

అలాంటి కారణంతో ఉద్యోగం చేసే స్త్రీలు ఈ మహానగరంలో ఎందరు ఉంటారు?

ఏమో!

ఇంతకీ తను ఉద్యోగం చేయడానికి కారణం ఏమిటి?

అమ్మ!

అవును! అమ్మే.

చిన్ననాటినుండి కంటికి రెప్పలా కాపాడి, ఆకలిని కూడా భరించి తనను చదివించి, పెంచి పెద్దచేసిన అమ్మ! ఆమె కష్టం తీర్చి ఈ ముసలి వయసులోనయినా ఆమె కష్టపడకుండా చేయాలనే ఆశయంతోనే తను వూరు వదిలి ఈ నగరానికొచ్చి ఉద్యోగంలో చేరింది.

"వీలయినంత త్వరలో అమ్మను కూడా హైదరాబాద్ కి తీసుకొచ్చేయాలి" అనుకుంది రేవతి మనసులోనే.

అప్పుడే ఆమె వెళ్ళాల్సిన బస్సు రావడంతో ఆలోచనలకు స్వస్తి చెప్పి బస్సువైపు కదిలింది.



కంప్యూటర్ కీబోర్డ్ మీద రేవతి చేతివేళ్లు వేగంగా కదులుతున్నాయి. స్క్రీన్ మీద తెలుగు అక్షరాలు ప్రత్యక్షమవుతూ ముందుకు కదులుతూ తర్వాత పైకి వెళ్తున్నాయి.

ఆమె పనిచేసుకుంటూనే వాల్ క్లాక్ కేసి చూసింది. ఆరుగంటలు కావస్తోంది.

'మరో రెండుపేజీల మేటర్ ఉంది. ఇది అయిపోతే వెళ్ళిపోవచ్చు' అనుకుందామె.

అలా ఆమె అనుకుంటూ ఉన్నప్పుడే పక్కనే ఆఫీస్ బాయ్ గొంతు వినిపించింది "మేడమ్"

ఆమె తల తిప్పి చూసింది.

"మీరు వెళ్ళేముందు సార్ కి కనిపించి వెళ్ళమన్నారు"

"అలాగే"

మరో అయిదు నిముషాలలో ఆమె మేటర్ కంపోజ్ చేయడం పూర్తిచేసింది. ప్రూఫ్ లకోసం ప్రింటర్ కి ఆర్డరిచ్చాక పక్కనే ఉన్న రూమ్ లోకెళ్ళింది.

"సార్"

టేబుల్ ముందు కూర్చుని పేజీ డిజైనింగ్

చేసుకుంటున్న యాభైఏళ్ల వ్యక్తి తలెత్తిచూశాడు. ఆమెను చూసి చిరునవ్వుతో "ఏమ్మా రేవతీ! వర్క్ అయిపోయిందా? " అడిగాడు.

మీరిచ్చిన మేటర్ మొత్తం ఈరోజు కంపోజ్ అయిపోయింది సార్. ప్రూఫ్‌లు ప్రింటర్‌లోనే ఉంటాయి. మీరు తీసేసుకోవచ్చు

"మంచిదమ్మా" అని ఆగి ఆయన టేబుల్ సొరుగు తీశాడు. అందులోనుండి రెండు పదిరూపాయల నోట్ల కట్టలు తీసి ఆమెకు అందిస్తూ చెప్పాడు. "ఈ నెలలో శాలరీ ఇవ్వడం రెండురోజులు లేటయింది. ఏమీ అనుకోకమ్మా"

"పర్వాలేదు సార్" ఆమె ఆయన చేతిలో నుండి డబ్బు తీసుకుంది.

"సరే... వెళ్ళమ్మా"

ఆమె నోట్లకట్టలు హాండ్‌బ్యాగ్‌లో పెట్టుకున్నాక ఆయనతో చెప్పింది. "కంప్యూటర్ ఆఫ్ చేయలేదు సార్"

"ప్రూఫ్‌లు రావాలికదా? అది నేను చూసుకుంటాలే వెళ్లు"

ఆమె ఆ గదిలోనుండి బయటపడింది.

ప్రింటింగ్ ప్రెస్ ఆఫీసు అది.

ఈమధ్యకాలంలో ఆఫ్‌సెట్ ప్రింటింగ్ విరివిగా ఉపయోగించడం మొదలయింది. ఆఫ్‌సెట్ ప్రింటింగ్‌లో మేటర్‌ని ఫిల్మ్‌గా తీసి, ప్లేట్ల మీదకు ఎక్కించి ప్రింట్ చేయడం జరుగుతుంది. అంటే అక్షరాలు హాండ్ కంపోజ్ చేయరు. కంప్యూటర్‌లో వచ్చే మేటర్‌ని ఫిల్మ్‌గా తీసుకోవచ్చు

అలా ఆఫ్‌సెట్ ప్రింటింగ్ ప్రెస్ ఉన్నవాళ్ళకు కంప్యూటర్లు అవసరపడుతున్నాయి. అందువల్లే కంప్యూటర్ ఆపరేటర్లకూ బాగా డిమాండ్ ఏర్పడింది. కాస్త మంచి జీతాలు దొరుకుతున్నాయి.

రేవతి ఆఫీసులోనుండి ఇవతలికొచ్చాక కొద్ది నిమిషాలు రోడ్డుమీదనే నిలబడిపోయింది. "కల్పన ఇంకా డ్యూటీలో ఉంటుందా? " అని ఆలోచించి ఓ నిర్ణయానికి వచ్చాక దగ్గరలో ఉన్న టెలిఫోన్ బూత్ వైపు వెళ్ళింది.

నంబర్ డయల్ చేశాక అవతలి గొంతు "హలో" అనడం వినిపించింది.

ఆ గొంతు గుర్తుపట్టి రేవతి పలికింది. "కల్పనా! నేనే రేవతిని"

"హాయ్ రేవతి! ఏమిటి విశేషం? "

"నువ్వింకా డ్యూటీలో ఉన్నావో, లేదో అనుకుంటూనే ఫోన్ చేశాను"

"నాకు డ్యూటీ టైమ్ అయిపోయింది. ఇంకా రిలీవర్ రాలేదు. ఆమె కోసమే వెయిటింగ్... అది సరే! విశేషమేమిటో చెప్పలేదు"

"ఏంలేదు ఈరోజు శాలరీ అందుకున్నాను. కాస్త షాపింగ్ చేద్దామనుకుంటున్నాను. మరి నువ్వు తోడు ఉంటే బాగుంటుందికదా అని"

అవతలివైపు కల్పన ఆశ్చర్యపోయినట్టుగా ఉంది. "నేను విన్నది నిజమేనా? అని నాకు అనుమానం కలుగుతోంది నువ్వు... నువ్వు షాపింగ్ చేసి డబ్బులు ఖర్చు పెట్టబోతున్నావా? "

రేవతి నవ్వి అవునంది. "అయితే ఓ పని చెయ్యి. వెంటనే బస్సెక్కి మా హోటల్ దగ్గరకు వచ్చెయ్యి. ఈలోపే రిలీవర్ వచ్చేస్తుందనుకుంటా. మనిద్దరం ఇటునుండి ఇటే షాపింగ్ చేసుకుని హాస్టల్‌కి వెళ్ళిపోదాం"

"అలాగే. వస్తున్నాను" ఫోన్ పెట్టేసింది రేవతి.

బస్టాప్‌లో వెయిట్ చేస్తే రెండు నిముషాలలోనే బస్సు వచ్చేసింది.

కల్పన పనిచేసే హోటల్ వద్ద బేగంపేటలో దిగాక అటువైపు నడిచింది.

కల్పన హోటల్ ఎంట్రన్స్‌లో నిలబడి ఆమె కోసమే ఎదురుచూస్తోంది.

రేవతిని చూడగానే దగ్గరగా వచ్చి చెప్పింది. "నీతో మాట్లాడి పెట్టేయగానే నా రిలీవర్ వచ్చేసింది. ఆలస్యమెందుకని బయ

టకొచ్చి నిలబడ్డాను"

"పద వెళ్దాం"

ఇద్దరూ బట్టల షాపుకి చేరారు.

కల్పనే ఓ చీర సెలక్ట్ చేసింది. ఆ చీర ప్యాక్ చేశాక సేల్స్‌గర్ల్ రేవతిని అడిగింది. "ఇంకేమయినా కావాలా మేడమ్?"

రేవతి తల అడ్డంగా ఆడించింది.

కల్పన అంది. "నువ్వూ ఒక చీర తీసుకో కూడదూ?"

"వద్దు కల్పనా! నాకు బట్టలు చాలానే ఉన్నాయి"

"కల్పన రేవతికేసి చిరుకోపంగా చూసింది. "ఇదే నీ దగ్గర నాకు నచ్చని గుణం. అయినా మరీ ఇంత పిసినారిత నమా?"

"ఇది పిసినారితనం కాదు. పొదుపు"

"ఇంతగా పొదుపుచేసి ఆ డబ్బంతా ఏం చేస్తావ్? మొగుడ్ని కొనుక్కుంటావా?"

"కాదు. అమ్మను హైదరాబాద్ తీసుకొ చ్చుకుంటాను?"

రేవతి మాటలు సూటిగా వెళ్ళి కల్పన గుండెల్లోనే తాకాయి. కల్పనకు రేవతి గురించి పూర్తిగా తెలుసు. అయినా సరే. అప్పుడప్పుడూ తను పప్పులో కాలేస్తుంది. తన తప్పు తెలిసిన కల్పన రేవతికేసి అభి మానంగా చూసింది. "మీ అమ్మమీద నీకున్న ప్రేమ చూస్తుంటే నాకేమనిపి స్తుందో తెలుసా రేవతీ?"

"ఏమనిపిస్తుంది?"

"నాకూ అమ్మ ఉండిఉంటే ఎంత బాగు ణ్ణోకదా అనిపిస్తోంది"

కల్పన గొంతులోని జీర కదిలించిం దేమో, రేవతి చప్పున ఆమె చేతిని తన చేతి లోకి తీసుకుంది. గుండెచాటు నరం కది లినా ఏమనాలో తెలియకపోవడంతో గొంతు పెగిలి మాట బయటకు రాలేదు.

చిన్నతనంలోనే తల్లిని కోల్పోయిన దుర దృష్టవంతురాలు కల్పన. సవతి తల్లి పెంప కంలో ఇమడలేక రెక్కలొచ్చాక హైదరాబా ద్‌కి ఎగిరొచ్చి ఉద్యోగంలో చేరిపోయి తన బతుకు బతుకుతోంది. తల్లి ఉన్నప్పుడు తల్లి విలువ తెలియదు. తల్లి లేకుండా పెరిగిన పిల్లలకు తల్లి విలువ తెలుస్తుంది. తల్లిదం డ్రుల ప్రేమాభిమానాలు పొందాక బహుశా ఆ అభిమానం వెగటు పుడుతుందేమో. అందువల్లే వాళ్ళ పెళ్ళి అయ్యాక తమ తల్లి దండ్రులను పట్టించుకోకుపోవడమే కాదు. కొన్ని విషయాలలో వాళ్ళను పట్టిపీడిస్తారు. ఆస్తి పంపకాల విషయంలో అసహ్యంగా ప్రవర్తిస్తారు.

ఇద్దరూ బట్టలషాపులో నుండి బయటికొ చ్చారు.

పదడుగులు ముందుకేశాక రేవతి అంది. "మనం ఐస్‌క్రీం తిందామా?"

రేవతిచేత ఖర్చు పెట్టించడం కల్పనకు ఇష్టంలేదు. ఆ మాట సూటిగా చెపితే బాధ పడుతుందని తెలిసి తప్పించుకునే ఉద్దేశం తోనే చెప్పింది. "అసలే చలికాలం. ఐస్‌క్రీం తింటే జలుబు చేస్తుంది. ఇప్పుడేం వద్దు లేవే"

ఆమె మనసులోని మాట అర్థమయినట్టు గానే నవ్వింది రేవతి. "నీకు ఐస్‌క్రీం అంటే ఎంత ఇష్టమో నాకు తెలుసు. సాకులు చెప్పకపదా" అంది.

ఇక తప్పదనుకుందేమో భుజాలెగరేసి రేవతిని అనుసరించింది.

ఇద్దరూ దగ్గర్లో వున్న ఐస్‌క్రీం పార్లర్‌కి వెళ్ళారు.

ఓ టేబుల్ ముందు ఎదురెదురుగా కూర్చున్నాక రేవతి కల్పనను అడిగింది. "ఏం తీసుకుంటావ్?"

"వెనీలా ఐస్‌క్రీమ్"

"నీకు బ్లాక్‌మేజిక్ అంటే ఇష్టమనుకుం టాను"

"ఇప్పుడు మాత్రం వెనీలానే ఇష్టం"

"డబ్బులు గురించి ఆలోచించకు" అంటూనే అప్పుడే వచ్చిన సప్లయర్‌తో చెప్పింది "రెండు బ్లాక్ మేజిక్". సప్లయర్



## చిత్ర విచిత్రం

## బీర్ ప్రకటన




ప్రకటనలకి అమెరికాలో ఎలాంటి సెన్సార్ లేదు. (ఆమాటకొస్తే సినిమాకి కూడా. ఏ వయసువాళ్లు చూడచ్చో మాత్రం చెప్తారు) బడ్వైజర్ అమెరికాలోని పాపులర్ బ్రాండ్ బీర్. ఆ బీర్ కంపెనీ తమాషా ప్రకటనలని ఇస్తుంటుంది. ఇటీవల 'హర్లీ డేవిడ్ సన్' అనే హాలీవుడ్ సెలబ్రిటీని ఉపయోగించి ఓ స్టేజ్ షో ని నిర్వహించిందా కంపెనీ. అది అన్ని టీ.వీలలో సాంస్కృతిక ఐటంగా ప్రసారమైంది.

బడ్వైజర్ బ్రా లతో కొందరు సుందరీమణులు ఆ షో లో పాల్గొన్నారు. అది టాప్ ఐటమ్ అయింది ఆ షో కి.

వెళ్ళిపోయాడు.

సమ్మర్‌లో విపరీతమైన రద్దీతో కనిపించే ఆ షాపు ఆరోజెందుకనో చాలా ఖాళీగా కనిపిస్తోంది. ఎంతయినా డిసెంబర్‌లో ఐస్ క్రీమ్ పార్లర్స్ కాస్త ఖాళీగానే ఉంటాయి. అందువల్లే ఉన్న పది టేబుల్స్‌లో ఎనిమిది టేబుల్స్ ఖాళీగా ఉన్నాయి.

సప్లయర్ ఐస్‌క్రీమ్ పెట్టి వెళ్ళిపోయాడు.

ఇద్దరూ ఐస్‌క్రీమ్ తింటూ వుండగా కల్పన అడిగింది.

"అయితే నువ్వు సంక్రాంతికి మీ వూరెళుతున్నావా? "

"అవును కల్పనా"

"మళ్ళీ తిరిగి రాక ఎప్పుడు? "

"ఓ వారంరోజుల్లోనే తిరిగి వచ్చేస్తాను"

"వచ్చేప్పుడు అమ్మను ఇక్కడికి తీసుకొచ్చేస్తావా? "

రేవతి తల అడ్డంగా ఆడించింది. "ఇప్పుడే తీసుకొచ్చేయాలని మనసులో వున్నా, పరిస్థితులు సహకరించేలా లేవు"

"ఏం ఎందుకని? "

"ఇప్పుడు నాకు రెండున్నరవేలు జీతం వస్తోంది. కానీ పర్మినెంట్ ఉద్యోగం కాదు కదా. ఏదయినా మంచి కంపెనీలో డి.టి.పి. ఆపరేటర్‌గా ఆర్డర్‌మీద ఉద్యోగం దొరికితే అప్పుడు నిశ్చింతగా అమ్మను తెచ్చేసుకోవచ్చు. ప్రస్తుతానికి అలాంటి జాబ్ కోసమే ప్రయత్నిస్తున్నాను. దొరకగానే వెళ్ళి అమ్మను హైదరాబాద్‌కి తీసుకొచ్చేస్తాను"

కల్పన నిలువుగా తలాడించింది. "నీ ఆలోచన కరక్టే. తీరా అమ్మను తీసుకొచ్చాక ఉన్న ఉద్యోగం వూడిపోతే చాలా కష్టం. అందులో అసలే సిటీ. ఆడపిల్లలంటే అందరూ ఆత్రంగా చూసేవాళ్ళేగాని, ఆదుకునేవాళ్ళు చాలా చాలా తక్కువగా వుంటారు".

రేవతి మౌనంగా వుండిపోయింది.

కల్పనే అంది. "నువ్వు మీ అమ్మను తీసుకుని హైదరాబాద్ వచ్చేస్తే, నేను మాత్రం హాస్టల్‌లో ఉండనోయ్"

"మరెక్కడ ఉంటావ్? "

"ఇంకెక్కడ ఉంటానూ? మీ ఇంటోనే ఉంటాను"

"దానికేం భాగ్యం. సంతోషంగా ఉండొచ్చు"

"అలా అని నీకు భారం మాత్రం కానులే. నేను సంపాదిస్తున్నాను కాబట్టి. అమ్మకు రెండోకూతురిలా నీకో చెల్లిలిలా నా సంపాదన కూడా ఇంటికే ఖర్చుపెడతాను... ఏమంటావ్? "

రేవతి మరేం మాట్లాడలేదు. కల్పనమీద పొంగిపొరలిన ప్రేమతో ఆప్యాయంగా తల మీద నిమిరింది.

ఐస్‌క్రీమ్ తినడం పూర్తయింది.

కల్పన ఊహించినట్టే రేవతి ఆమెను బిల్లు కట్టనివ్వకుండా తనే పేచేసింది.

అక్కడనుండి ఇద్దరూ బస్టాప్ చేరారు.

బస్సు పట్టుకుని హాస్టల్‌కి దగ్గర్లోని బస్టాప్‌లో దిగేసరికి పావుగంటయింది.

ఇద్దరూ హాస్టల్ గేటు దాటి లోపలకు అడుగుపెడుతుంటే వాచ్‌మెన్ రేవతితో చెప్పాడు. "ఏమ్మా! వార్డెన్‌గారు మీ కోసమే ఎదురుచూస్తున్నారు. రాగానే మిమ్మల్ని తన గదికి పంపమన్నారు"

రేవతి, కల్పన ముఖాలు చూసుకున్నారు.

ఇద్దరూ వార్డెన్ గదివైపు అడుగులేశారు.

హాస్టల్ వార్డెన్ అప్పటివరకూ రేవతికోసమే ఎదురుచూస్తున్నదేమో ఆమె కనిపించగానే కాస్త కంగారుగా అడిగింది "ఏమ్మా రేవతీ! ఈరోజు బాగా ఆలస్యమయిందేం? "

"ఈరోజు శాలరీ అందుకున్నాను మేడమ్. అమ్మకోసం ఓ చీర కొనుక్కుని వచ్చేసరికి ఆలస్యమయింది" చెప్పింది రేవతి.

హాస్టల్ వార్డెన్ కొద్దిక్షణాలు తటపటాయించాక టేబుల్ సొరుగులోనుండి ఓ కాగితం తీసింది. "నీకు... నీకీ టెలిగ్రాం వచ్చిందమ్మా. అందువల్లే నీకోసం కంగారుగా ఎదురుచూస్తున్నాను" ఆమె తన చేతిలో టెలిగ్రాం రేవతికి అందించింది.



టెలిగ్రాం అనగానే రేవతికి గుండె వేగం పెరిగింది. శరీరంలో వణుకు మొదల యింది. అప్రయత్నంగానే పెదవులు బిగ పట్టి కాగితం మడతలు విప్పింది.

అప్పుడే కల్పన కూడా టెలిగ్రాంలోని మేటర్ చూసింది.

'మదర్ సీరియస్ స్టార్ట్ ఇమ్మీడియట్లీ- సాయికృష్ణ'

కల్పన మెల్లగా తలెత్తి రేవతి ముఖంలోకి చూసింది. ఆమె పరిస్థితి గమనించాక చప్పున భుజంమీద చెయ్యివేసి "పద రూమ్‌కి వెళ్దాం" అంటూ ముందుకు నడిపిం చింది.

"ఏమిటే ఇది? ఏదో కాస్త అనారోగ్యం చేసి ఉంటుంది. దాంతో ఆంటీ టెలిగ్రాం ఇచ్చిఉంటారు. అంతమాత్రానికే ఇలా భయ పడిపోవడమేనా? "

"మా అమ్మ మనస్తత్వం నీకు పూర్తిగా తెలియదు కల్పనా. తనకు పరిస్థితి విష మించి ఉంటేనే తప్ప అమ్మ ఇలా చేయదు" కల్పన మరేం మాట్లాడలేకపోయింది. రేవతి ద్వారా అప్పటికే ఆమె తల్లి శారదమ్మ గురించి ఎక్కువగానే విని ఉండడంతో ఆమె ఆలోచన సబబుగానే తోస్తోంది. 'అంటే రేవతి తల్లి పరిస్థితి చాలా సీరియస్‌గానే ఉందా? అసలు సీరియస్ కండిషనేనా? లేక...' ఆపై ఊహించడానికే మనస్కరించ లేదు.

ఆమె తల తిప్పుకుంది.

★ ★ ★

రోడ్డుమీద వాహనాలు పరుగెడుతు న్నాయి. ఆ పరుగుపందెంలో ఎక్కువమంది లక్ష్యం అభిమానం, ఆప్యాయతలు కాదన్నది సత్యం. వాళ్ల పరుగు డబ్బు సంపాదన, ఇతర మానవ అవసరాల కోసమే అయి ఉంటుంది.

రోజురోజుకీ మనుషులమధ్య అభిమానం, ఆప్యాయతల పొర కరిగిపోతూ ఉంది. చివ రికి రక్తసంబంధం కూడా స్వార్థంతో కలుషి తమవుతోంది.

తనకు తెలిసినంతలో వయసొచ్చిన ఆడ పిల్లల్లో ఎక్కువమంది పెళ్లికోసం ఆరాటపడ తారు. ఆ ఆరాటంలో అమ్మనయినా, నాన్న నయినా ఏడిపిస్తారు.

కాని శారదమ్మకు, రేవతికి మధ్య ఉన్న ఆ అనుబంధం తనకెప్పటికీ ఆశ్చర్యాన్నే కలిగి స్తుంది.

వర్కింగ్ ఉమెన్స్ హాస్టల్‌లో రాత్రయ్యాక చాలా గదులలోని అమ్మాయిలు అబ్బాయిల గురించిన టాపిక్ మాట్లాడుకోవడం జరు గుతుంది.

కాని తన రూమ్మేట్ రేవతి అబ్బాయిల విషయాలు మాట్లాడగా తనేనాడూ విన లేదు. ఆమె నోరు విప్పితే అన్నీ తన అమ్మ కబుర్లే!

"అమ్మ ఇప్పుడు ఏంచేస్తుంటుందో కల్పనా! తనకి తిండిమీద ధ్యాస ఉండదు. వేళకు ఇంత తింటే ఫర్వాలేదు కానీ తినదు. తనకు తిండి విషయం కూడా ఎవరో గుర్తు చేయాల్సిందే. నేను అక్కడ ఉంటే ఫర్వా లేదు. ఇప్పుడు తనకెవరున్నారు? నాకు మంచి ఉద్యోగం ఎప్పుడొస్తుందో. అమ్మను హైదరాబాద్‌కి ఎప్పుడు తీసుకురాగలనో? "

వాళ్లిద్దరూ మాట్లాడుకోలేదు. ఎవరి ఆలో చనల్లో వాళ్లు ఉండిపోయారు.

రేవతికి మాత్రం చాలా... చాలా కంగా రుగా వుంది.

"ఏంజరిగింది? ... ఏంజరిగి ఉంటుంది? ... ఏదో మరీ సీరియస్ కాక పోతే అమ్మ టెలిగ్రాం ఇవ్వడానికి ఒప్పుకుని ఉండదు. అంటే...

"మరి సీరియస్‌గా ఉన్న అమ్మ ఎక్క డుంది? ఇంట్లో ఉందా? లేక హాస్పిట ల్‌లో...

"సాయికృష్ణ టెలిగ్రాం ఇచ్చాడంటే అతడికి ఖచ్చితంగా అమ్మ అనారోగ్యం గురించి వివ రంగా తెలిసి ఉంటుంది. తెలిస్తే టెలిగ్రాం ఇచ్చి చేతులు దులిపేసుకోడు. అదే కొంత




లో కొంత తనకిప్పుడు నిశ్చింత."

ఆటో ట్రాఫిక్ సిగ్నల్ ముందు ఆగింది.

రేవతి విసుగ్గా సిగ్నల్ లైట్లవైపు చూసింది.

అప్పుడు తల తిప్పి ఆమె ముఖంలోకి చూసిన కల్పన ఆ విషయం గమనించింది. 'పాపం! త్వరగా తల్లిని చేరుకోవాలని ఆరాటపడుతోంది' అనుకుంది మనసులో.

తనకు తల్లిలేదు. ఉన్నది సవతి తల్లి. కాబట్టి తల్లీ కూతుళ్ల మధ్య ఉన్న అనుబంధం తనకు తెలియదు. అయితే రేవతిని చూస్తుంటే తనకు అనిపిస్తూ వుంటుంది, "తల్లీకూతుళ్ళ మధ్య అనుబంధం ఇంత గట్టిగా ఉంటుందా? " అని!

ఊహు ! ఇది అందరి విషయంలో నిజం కాదనిపిస్తూ వుంటుంది. తమ హాస్టల్‌లో నూటయాభై మంది ఉంటే, వాళ్లల్లో ఓ వంద మందికైనా ఇప్పటికీ తల్లి బతికే ఉంటుంది. బతికున్న తమ తల్లి గురించి ఆ కూతుళ్లెవరూ తలచుకోగా తను ఏనాడూ విని ఎరుగదు. వాళ్లెప్పుడూ కొత్త డ్రస్సుల గురించో, పాత బాయ్ ఫ్రెండ్‌ల గురించో, రిలీజవబోయే సినిమాల గురించో మాట్లాడుకుంటూ వుంటారు.

తల్లి పెంపకంలో పెద్ద తేడా వుండదు. ఏ తల్లయినా తన బిడ్డను ప్రేమగానే చూసుకుంటూ, గుండెలమీద పెట్టుకుని పెంచుతుంది. కాని బిడ్డలు తల్లిదండ్రులను దగ్గరకు తీయడంలో మాత్రం చాలా రకాల వ్యత్యాసాలు కనిపిస్తుంటాయి. ఎదిగిన బిడ్డ తల్లిదండ్రుల గుండెలు మీద కొట్టి దూరంగా వెళ్లిపోవడం చాలా సర్వసాధారణంగా జరిగే విషయం.

ఇలా ఎందుకు జరుగుతోంది.

గ్రీన్ లైట్ వెలిగింది.

ఆటో ముందుకు కదిలింది.

కల్పనకు రేవతిని మాట్లాడించాలని వున్నా ఆమె ముఖం చూశాక డిస్టర్బ్ చేయడం ఇష్టం లేకపోయింది.

అందుకే మౌనంగా సీటులో వెనక్కు వాలింది.

మరో పదినిముషాల తర్వాత ఆటో బస్ స్టేషన్‌ను సమీపించింది.

ఆటోడ్రైవర్ తల తిప్పి వాళ్లను అడిగాడు, "ఆటో లోపలికి పోనివ్వమంటారా లేక ఇక్కడే ఆపేయమంటారా? "

రేవతి తన ఆలోచనల్లో తను ఉండడంతో జవాబు చెప్పలేదు.

కల్పన చెప్పింది "లోపలికి పోనివ్వు"

ఆటో లోపలికి వెళ్లింది.

పార్కింగ్ ప్లేస్‌లో ఆటో ఆగింది. కల్పన ఆటో ఫేర్ చెల్లించింది. ఇద్దరూ ఆటో దిగారు.

టిక్కెట్ కౌంటర్ వైపు నడుస్తున్నప్పుడు కల్పన, రేవతికి చెప్పింది. "నీ బ్యాగ్‌లో వెయ్యి రూపాయలు ఉంచాను. ఇప్పుడు అంతే ఉంది. డబ్బు అవసరపడితే మొహమాటపడకు. నా దగ్గర బ్యాంక్ బేలన్స్ కొంత ఉంది. లెటర్‌లో ఆ విషయం రాస్తే డి. డి. తీసి పంపిస్తాను"

"అవసరపడితే తప్పకుండా లెటర్ రాస్తాను"

కల్పన కౌంటర్ దగ్గరకెళ్లి కౌంటర్‌లోని వ్యక్తిని అడిగింది. "గుంటూరుకి ఒక టిక్కెట్ ఇవ్వండి"

"బస్సు కదలబోతోంది. టిక్కెట్ మీకు కండక్టర్ బస్సులోనే ఇస్తాడు" చెప్పాడు కౌంటర్‌లోని వ్యక్తి.

ఇద్దరూ హడావుడిగా బస్సు దగ్గరకు పరుగెత్తారు. అటు చూస్తే బస్సు కదలడానికి సిద్ధంగానే ఉంది.

కల్పన రేవతిని బస్సెక్కిస్తూ చెప్పింది. "ఇల్లు చేరగానే ఉత్తరం రాయి. నువ్వు కాస్త ధైర్యంగా ఉండు. మనకు అత్యంత ఇష్టమైన వ్యక్తికి చిన్న కష్టం కలిగినా, మన మనసు విలవిలలాడిపోతుంది. మనం ధైర్యం కోల్పోతాం, అది సహజం"

కల్పన ఆప్యాయంగా రేవతి చెయ్యి నొక్కి

వదిలింది. రేవతి బస్సెక్కింది.

మరో నిముషానికి బస్సు కదిలింది.

★ ★ ★

రాత్రి మూడింటికి బస్సు గుంటూరు చేరింది.

రిక్షాలో ఇల్లు చేరుకున్నాక చూస్తే, తలుపుకు తాళం కప్ప వేలాడుతూ కనిపించింది.

ఆమె రిక్షాలోని బ్యాగ్ కూడా అందుకోలేదు. ఏదో తెలియని భయం వళ్లంతా వణికించేస్తోంది.

కొద్ది క్షణాలు పనిచేయని మెదడు తిరిగి పనిచేయడం మొదలుపెట్టాక అప్పుడే తోచినట్లు ఆమె వడివడిగా పక్కింటి వైపు వెళ్లింది.

ఆ ఇంటి తలుపు తట్టిన నిముషం తర్వాత తలుపు తెరుచుకుంది. తలుపు తీసిన అరవైఏళ్ల ముసలావిడ కొద్దిక్షణాలు రేవతిని ఎగాదిగా చూసింది.

చీకటిగా ఉండటంతో ఆవిడ తనను పోల్చుకోలేకపోతోందని అర్థం చేసుకుని రేవతి చెప్పింది. "పెద్దమ్మా? నేను రేవతిని. హైదరాబాద్‌నుండి వచ్చాను"

రేవతిని గుర్తు పట్టడంతోనే ఆవిడ ముఖంలో ఒక్కసారిగా విచారం కదలాడింది. "వచ్చావటే రేవతీ... ఏమిటోనే ఈ వయసులో మీ అమ్మకు రాకూడని జబ్బు వచ్చింది. మొన్న రాత్రి కూడా నాతో పది ని ముషాలు నీ గురించే మాట్లాడింది. కాని తెల్లారేసరికి ఆ మాయదారి జబ్బు వల్ల స్పృహలేకుండా పడిపోయింది."

"అమ్మకు... అమ్మకు ఏమయింది? " రేవతి గొంతులో జీర ధ్వనించింది.

అయితే ఆవిడ రేవతి గొంతులోని ఆతృతని గమనించలేదు.

"చాలాదూరం ప్రయాణం చేసి వచ్చావ్ కదా? ముందు లోపలికిరా. కాసిన్ని మంచి నీళ్లు తాగాక విషయాలు తీరికగా మాట్లాడుకుందాం"

"లేదు పెద్దమ్మా! ముందు... ముందు అమ్మకు ఏమయిందో చెప్పు? "

ఆవిడ రేవతి మనసులోని ఆతృత, ఆరాటాలనూ అప్పుడు గమనించిందేమో వెంటనే చెప్పేసింది. "మీ అమ్మకు పక్షవాతం వచ్చిందే రేవతీ"

రేవతి పెదవులు బిగపట్టింది. తనచుట్టూ ఉన్న చీకటి మరింత చిక్కబడుతుంటే, ఆ చీకటిలో తనూ కలిసి పోతున్న ఫీలింగ్...

కొద్దిక్షణాల తర్వాత ఆమె ప్రశ్నించింది "అమ్మ ఇప్పుడు ఎక్కడుంది? "

"సాయికృష్ణ ఆమెను హాస్పిటల్‌కి తీసుకెళ్లాడు. గవర్నమెంట్ హాస్పిటల్లో ఉంది."

రేవతి చప్పున వెనుతిరిగింది.

ఆమె హాస్పిటల్‌కి వెళుతుందని అర్థంకావటంతోనే, ఆవిడ కాస్త కంగారుగా అంది. "ఇంత రాత్రివేళ హాస్పిటల్‌కి వెళ్లి ఏంచేస్తావ్? ఈ రాత్రికి ఇక్కడ పడుకో. ఉదయాన్నే నేనూ నీతో వస్తాను"

"నేను ఇప్పుడే అమ్మను చూడాలి"

రేవతి రిక్షాను చేరుకుంది.

అప్పటివరకూ రిక్షావాడు ఆమె కంగారును చూస్తూ, వాళ్లిద్దరి మధ్యా జరిగిన సంభాషణనూ విన్నాడు. ఆమె దగ్గరకు రాగానే, " హాస్పిటల్‌కి వెళ్లాలి కదమ్మా" అన్నాడు.

"అవును" అంటూ రిక్షా ఎక్కి కూర్చుంది రేవతి.

పావుగంట తర్వాత రిక్షా గవర్నమెంట్ ఆసుపత్రి ముందు ఆగింది.

రిక్షావాడికి డబ్బులిచ్చాక, ఆమె బ్యాగ్ అందుకుంది.

ఎదురుగా గవర్నమెంట్ ఆసుపత్రి మరో రుద్రభూమిలా అనిపిస్తోంది. శ్మశానంలో చితివెలుగు కనపడుతుంటే, ఇక్కడ కరెంట్ బల్బులు వెలుగుతున్నాయి. అలాంటి ఆసుపత్రిలో శవాలకూ రోగులకూ తేడా ఏమీ ఉండదు.

ఆమె హాస్పిటల్ లోపలికి నడిచింది.

కారిడార్‌లో బెంచీమీద కూర్చుని కునికి




పొట్లు పడుతున్న యువకుడు, ముందుకు తూలి ఉలిక్కిపడి కళ్లు తెరిచాడు. అప్పుడే హాస్పిటల్ లోపలికి వస్తున్న ఆమె కనిపించింది.

అతడు బెంచీమీద నుండి లేచి ఆమెకు ఎదురెళ్లాడు "రేవతీ! వచ్చావా? ... నీకోసమే ఎదురుచూస్తున్నా. కాని ఇంత రాత్రివేళ వస్తావనుకోలేదు"

"అమ్మ ఎక్కడుంది? "

అతడు చప్పున ఆమె ముఖంలోకి చూశాడు. అంత రాత్రివేళ, మరో ఆలోచన లేకుండా ఆమె అక్కడికి రావడంతోనే, ఆమె తల్లిని చూడడంకోసం ఎంతగా తపించిపోతోందో అర్థమయిపోతోంది. అతడు మరేం మాట్లాడకుండా ముందుకు నడిచాడు. ఆమె అనుసరించింది.

జనరల్ వార్డ్‌లో బెడ్‌మీద అపస్మారక స్థితిలో ఉంది ఆవిడ. జీవితకాలానికి తగినంతగా శ్రమపడి అలసిపోయి విశ్రాంతి తీసుకుంటున్నట్టుగా పడుకుని వుంది.

తల్లిని ఆ స్థితిలో చూడగానే రేవతి గుండె కదిలిపోయింది. తన తల్లిని చేరుకునేందుకు ఆమె అడుగులు ముందుకేస్తుంటే, వెనుకనుండి అతడు చెప్పాడు, "రేవతీ! ఆంటీకి ఒక్కసారి మాత్రమే స్పృహ వచ్చింది. డాక్టర్ ఇంజక్షన్ చేశాడు. ఇప్పుడు ఆమెను డిస్టర్బ్ చేయడం మంచిది కాదు"

అప్పటికే రేవతి బెడ్ దగ్గరకు చేరుకుంది. అతడి మాటలు వినిపించడంతో మరేం చేయాలో తోచనట్టు బెడ్ పక్కనే మోకాళ్ల మీద కూలబడింది.

కొద్దిక్షణాలు గాఢమైన నిశ్శబ్దం.

ఎదుటి వాస్తవాన్ని అర్థంచేసుకునేందుకు రేవతి మనసు అంగీకరించడంలేదు. అది తన భ్రమ అయితే బాగుణ్ణనే కోరిక. కాని అది భ్రమకాదు. నిజం! ఒక వాస్తవం.

తన తల్లికి పక్షవాతంతో కాలూ చెయ్యీ పడిపోయాయి.

బాధాకరమే అయినా, అంగీకరించి తీరాల్సిన నిజం ఇది.

రేవతి చెయ్యి ముందుకు సాగింది. తన తల్లిని కనీసం తాకాలన్న ఆశ. కాని తన స్పర్శ ఆవిడను డిస్టర్బ్ చేస్తుందేమోనన్న భయంతో ఆగిపోయింది. ఆమె చెయ్యి గాలిలో ఉండే తల్లిని తడిమింది.

అర నిముషం తర్వాత తేరుకుని ఆమె మెల్లగా తల తిప్పి అతడిమీద చూపు నిలిపింది.

ఆ సమయంలో ఆమె కళ్లల్లో సుడులు తిరుగుతున్న నీళ్లు చూసి అతడు విచలితుడయ్యాడు. అప్రయత్నంగానే రెండు అడుగులు ముందుకేసి ఆమె దగ్గరగా వచ్చి నిలబడ్డాడు.

"సాయీ... ఇది... ఇదెలా జరిగింది? "

"నిన్న ఉదయం ఆఫీసుకి బయల్దేరబోతుంటే ఫోన్ వచ్చింది. మీ పక్కింటివాళ్లెవరో ఫోన్ చేశారు. నేను హడావుడిగా మీ ఇంటికెళ్లాను. అప్పటికే ఆంటీ అపస్మారక స్థితిలో ఉండడం చూసి, హాస్పిటల్‌కి తీసుకొచ్చాను. వెంటనే నీకు టెలిగ్రాం ఇచ్చాను. నాకు తెలిసిందంతే"

ఆమె మౌనంగా ఒక నిజాన్ని జీర్ణించుకోవడానికి ప్రయత్నిస్తోంది.

కొద్దిక్షణాల తర్వాత అతడే అన్నాడు, "అయినా స్ట్రోక్ రావడానికి కారణం, 'మెదడులో రక్తనాళం చిట్లి రక్తస్రావం జరిగి రక్తం గూడుకట్టడం' అని డాక్టర్ చెప్పాడు. బ్లడ్‌ప్రెషర్ ఎక్కువ కావడం వలన ఇలా రక్తనాళాలు చిట్లుతాయట"

తన తల్లికి హై బి.పి. ఉన్న విషయం రేవతికి గుర్తుకొచ్చింది. ఆవిడ తన బి.పి. కంట్రోల్‌లో పెట్టుకునేందుకు ఎప్పుడూ ప్రయత్నించిందికాదు. అప్పట్లో ఆ విషయం గురించి తనకూ తన తల్లికి వాదన కూడా జరిగేది. ఎలాగయితేనేం నిర్లక్ష్యమే భయంకరమైన జబ్బును కొని తెచ్చింది. ఇక ఇప్పుడు చేయగలిగిందేముంది?

రేవతి దీర్ఘంగా నిశ్వసించి బెడ్ దగ్గర నుండి లేచింది.



సాయికృష్ణ దగ్గరగా నడిచి, ఎదురుగా నిలబడ్డాక అతడి ముఖంలోకి చూస్తే నిద్ర లేకపోవడం వల్ల కాబోలు అతడి కళ్లు ఎర్రగా కనిపించాయి.

ఆమెకు అతడి కష్టం అర్థం కావడంతో మనస్ఫూర్తిగానే అంది "థాంక్స్ సాయి"

"ఎందుకు? "

"ఆపద సమయంలో అమ్మను కనిపెట్టుకుని వున్నందుకు"

అతడు నిట్టూర్పులాంటి నవ్వొకటి నవ్వాక అన్నాడు.

"నువ్వు థాంక్స్ చెప్పకుండా వుంటేనే నేను సంతోషపడి వుండేవాడిని రేవతీ"

'ఎందుకని? ' అని అడగబోయి ఆగిపోయింది రేవతి. ఆమెకు కొంతవరకూ అర్థమయింది.

అయితే ఆమెకు అర్థమయిందో లేదోనను కుని అతడు చెప్పాడు. "ఎందుకంటే సన్నిహిత బంధుమిత్రులు, ఆప్తులమధ్య 'థాంక్స్' అనే పదానికి తావులేదని వినిఉన్నాను"

ఆమె తల తిప్పుకుంది.

ఆ జనరల్ వార్డ్‌లోని బెడ్‌లన్నీ పేషెంట్స్‌తో నిండి ఉన్నాయి. ఇంచుమించు తెల్లవారుఝాము కావస్తూ ఉండడంతో అందరూ గాఢనిద్రలో ఉన్నారు. నిద్రపోతున్న మనుష్యుల మధ్య తామిద్దరే నిలబడి మాట్లాడుకోవడం ఏదోలా అనిపించింది.

"కారిడార్‌లో నిలబడదామా? "

"పద" అతడు ఆమెను అనుసరించాడు.

ఇద్దరూ కారిడార్‌లోకి వచ్చాక అప్పుడే తోచినట్టు ఆమె అంది. "అమ్మను నేను చూసుకుంటాను. ఇంక నువ్వు ఇంటికెళ్లకూడదూ? "

"ఈ టైమ్‌లో ఇంటికెళ్లి చేసేదేముంది, తెల్లారాక వెళ్తాను"

"ఇప్పుడు వెళ్లి కాసేపు నిద్రపోతే, ఉదయం ఫ్రెష్‌గా రావచ్చు " అంది.

అతడు తలాడించాడు, "అలాగే, అయితే నేను ఉదయాన్నే వస్తాను" అతడు రెండు అడుగులు వేశాక ఆగి, వెనుతిరిగి చెప్పాడు. "ఏదయినా ప్రాబ్లమ్ వస్తే ఇంటికి ఫోన్ చేయి. ఇబ్బంది పడకు"

"అలాగే"

సాయికృష్ణ వెళ్లిపోతూ ఉంటే కనుమరుగయ్యేవరకూ అతడినే చూస్తూండిపోయింది రేవతి.

అతడు తనకు దూరపుబంధువు. అయితే అంతకుమించి దగ్గర వాడిలా ప్రవర్తిస్తాడు. తనకన్నా రెండేళ్లు పెద్దవాడు. కాలేజీలో అతడు డిగ్రీ ఫైనలియర్ చదువుతున్నప్పుడు తను ఫస్టియర్. కేవలం ఓ సంవత్సరం కలిసి చదువుకోవడం వల్ల అతడు తమ కుటుంబానికి అంత దగ్గరయ్యాడా? !

'కాదని' తనకు తెలుసు. అతడి ప్రవర్తన, మాట తీరు మనసులోనిభావం ఎప్పుడో అర్థమయ్యేలా చేశాయి కానీ...

ఆమె నిట్టూర్చింది.

రేవతి రెండు అడుగులువేసి వార్డ్ తలుపు దగ్గర నిలబడి అటు చూసింది.

తల్లి మత్తుగా పడుకుని వుంది.

తనిప్పుడు బెడ్ దగ్గరకు వెళ్లి చేసేదేమీ లేదు. ఆమెను మత్తులో నుండి లేపడం తనకిష్టంలేదు.

రేవతి తల తిప్పుకుంది. ఏమీతోచక కాసేపు వరండాలో అటూఇటూ తిరిగింది.

కాసేపటికి కాళ్లు నొప్పులుగా అనిపించడంతో ఓచోట ఆగి అక్కడే ఉన్న బెంచీమీద కూర్చుని గోడకు వీపానించింది.

మనసంతా గజిబిజిగా ఉంది. ఏదో తెలియని భయం తనను ఆవరించేసింది.

'ఈమధ్యనే మంచి ఉద్యోగం సంపాదించుకుని, త్వరలో తల్లిని హైదరాబాద్‌కి తీసుకెళ్లాలనుకుంటూ ఉంటే, ఇంతలో ఇలాంటి దారుణం జరగడమేమిటి? ...'

ఏడుగంటలు బస్సులో ప్రయాణం చేసి వచ్చినప్పటికీ, రేవతికి అలసటగా అనిపించడంలేదు. ఆమెకు నిద్ర రావడమూలేదు.

ఆమె ఆలోచనలు వెనక్కు పరుగెట్టాయి.




తనకు అప్పుడప్పుడే వూహ తెలుస్తోంది. ఏడేళ్ల వయసు బాల్యం అప్పుడప్పుడే తొలకరిలా తన జీవితంలో ప్రవేశిస్తోంది. అదే సమయంలో తన తండ్రి యాక్సిడెంట్‌లో మరణించాడు.

ఆయన చిన్నసైజు కాంట్రాక్టరు. కాంట్రాక్టరు అన్నపేరు గొప్పగా వున్నా ఆయన సంపాదించింది మాత్రం ఏమీలేదు. పైగా ఆయన సర్వవ్యసన శోభితుడు. అప్పులు కూడా చేసి తను సుఖంగా బతికేవాడు. తను సుఖంగా బతికితే పోనీలే అనుకోవచ్చు. భార్యను అన్నివిధాలా కష్టపెట్టేవాడు. అర్ధరాత్రివేళ తాగి ఇంటికొచ్చి అతడుచేసే అల్లరి ఇప్పటికీ తన కళ్లముందు కదలాడుతూనే ఉంది.

అలాంటి ఆ తండ్రి చనిపోతే అప్పట్లో తనకేం బాధగా అనిపించలేదు. ఇప్పటికీ తనకు తండ్రిమీద కనీసం అభిమానంలాంటివి ఏర్పడలేదు.

ఆయన చనిపోయాడు. చనిపోతూ... చనిపోతూ తామిద్దర్నీ దారిద్ర్యంలో వదిలివెళ్లాడు. అంతవరకూ కొంత మేలు. దయతలచిన అప్పుల వాళ్లు తమమీద పడలేదు అని అప్పట్లో అమ్మ అనడం తనకిప్పటికీ గుర్తే.

తండ్రి చనిపోయాక తల్లి కుటుంబ బాధ్యతను నెత్తిని ఎత్తుకుంది. గడపదాటలేదు. ఇంట్లోనే ఉండి టైలరింగ్ పనిచేసి సంపాదించేది. అప్పట్లో ఆమె ఎంతగా కష్టపడిందంటే, ఏ అర్ధరాత్రో తనకు మెలుకువొచ్చి కళ్లు తెరిచి చూస్తే అమ్మ టైలరింగ్ మిషన్ మీద కనిపించేది. ఇప్పటికీ ఎప్పుడయినా తను అమ్మను ఊహించుకుంటూ కళ్లు మూసుకుంటే టైలరింగ్ మిషన్‌మీద కూర్చుని వున్న అమ్మే కనిపిస్తుంది తప్ప మరోలా కనిపించదు.

ఏడేళ్ల వయసులో వున్న తనను ఆ కష్టాలలోకి దింపకుండా ఆమె తనను చదివించింది.

ఇరుగుపొరుగువాళ్లూ, కష్టాలలో ఆదుకోని బంధుమిత్రులూ ఆమెతో అనేవాళ్లు! "శారదమ్మా! ఆడపిల్లకు చదువెందుకే? ఆ పిల్లకూ కుట్టుపని నేర్పిస్తే, తనూ ఎంతో కొంత సంపాదిస్తుంది కదా! ఇప్పటి నుండే ఇద్దరి సంపాదనలో కొంత మిగుల్చుకుంటే, రేపు ఆ పిల్ల పెళ్లికోసం పెద్దగా కష్టపడాల్సిన అవసరం ఉండదు. అసలే రోజులెలా వున్నాయి? ఆడపిల్ల పెళ్లిచేయాలంటే లక్షలు కూడబెట్టాల్సి వస్తోంది. అందులోనూ చదువుకున్న ఆడపిల్లలంటే ఆ చదువుకి తగిన మొగుడినే తేవాలి. అది మరింత పెద్ద ఖర్చు మామాట విని ఆ పిల్లకి ఇప్పటినుండే కుట్టుపని నేర్పించెయ్"

అప్పుడు తన తల్లి అలాంటి వాళ్లకు చెప్పిన జవాబు ఇప్పటికీ తను మరిచిపోలేదు. సజీవస్మృతిలా ఆ జ్ఞాపకం అలాగే నిలబడిపోయింది. తల్లి చెప్పిన మాటలు తన చెవుల్లో గింగురుమంటున్నాయి.

"చూడండి! ఆడపిల్లకు చదువు అవసరమో, కాదో నాకు తెలియదుగానీ, రేపటి పెళ్లికోసం ఇప్పటినుండే దాన్ని కష్టపెట్టడం నాకిష్టంలేదు"

ఆ జవాబు విన్నవాళ్లు ఆమె మూర్ఖత్వానికి విసుక్కుని ఉండొచ్చు కాని అది మూర్ఖత్వమా? ... కాదు.

అది ఓ తల్లి హృదయం..

తనకు తల్లినోట ఆ మాటలు వింటున్నప్పుడు ఆమె తనకు తల్లిలానేకాక, మనసెరిగిన స్నేహితురాలిలా కూడా కనిపించింది. నిజానికి తనకు చదువుకోవడమంటే చాలా ఇష్టం. ఒకవేళ ఆమె అప్పుడు తనను బలవంతంగా సంపాదనలోకి నెట్టేసి వుంటే, ఇప్పుడు బాల్యస్మృతులు ఆనందాన్ని కలిగించి ఉండేవికావు. అంటరాని జ్ఞాపకాల్లా బాధను మిగిల్చి ఉండేవి.

అందువల్లే కాబోలు తన బాల్యాన్ని బాల్యంలా భద్రపరచి అందించిన తల్లి అంటే తనకెంతో ఇష్టం.



వార్డ్‌లోంచి ఘొల్లుమనే ఏడుపులు వినిపించడంతో రేవతి ఆలోచనలు ఆగాయి.

అదిరిపడి అటూఇటూ కంగారుగా చూస్తుంటే అప్పటికే విషయం అర్థమయిందేమో అప్పటి వరకూ కారిడార్‌లో టేబుల్ మీద తలపెట్టుకుని నిద్రపోతున్న నైట్ డ్యూటీ నర్స్ వడివడిగా వార్డ్‌లోకి నడిచింది.

రేవతికి అప్పటికి కొంత అర్థమయింది.

ఆమె భయంగా లేచి వార్డ్‌తలుపు దగ్గరికెళ్లి లోపలికి తొంగి చూసింది.

వార్డ్‌లో చివరి బెడ్‌మీద వున్న పేషెంట్ మీదపడి ఇద్దరు వ్యక్తులు ఏడుస్తున్నారు.

నిద్రలోంచి మేలుకున్న వార్డ్‌లోని జనం భయంగా, జాలిగా ఆవైపే చూస్తున్నారు.

నర్స్ ఆ ఇద్దర్నీ గదమాయిస్తోంది. "ఏడవకండి... ఇక్కడ ఏడవకూడదు..."

రేవతికి పూర్తిగా అర్థమయిపోయింది. ఆ వార్డ్‌లోని ఒక పేషెంట్ భవబంధాలను వదులుకుని ఈలోకం విడిచి వెళ్లిపోయాడు.

★ ★ ★

తూర్పు దిక్కున వెలుగురేఖలు విచ్చుకుంటుండగా శారదమ్మ కళ్లు తెరిచింది.

చుట్టూ కొద్దిసేపు అయోమయంగా చూశాక, చివరిగా ఆమె చూపులు రేవతి మీద నిలిచాయి.

కూతుర్ని గుర్తుపట్టినట్టు ఆమె కళ్లు మిలామిలా మెరిశాయి.

తల్లి కళ్లు తెరవడంతోనే రేవతికి సంతోషం కలిగింది. " అమ్మా... అమ్మా" అంది ఆనందంగా.

శారదమ్మ కూతురుతో ఏదో మాట్లాడాలని కాబోలు నోరు తెరిచింది. అయితే ఆమె గొంతులోనుండి మాట పెగలి బయటకు రాలేదు. నోరు వంకర తిరిగిపోయింది.

ఒక చేదునిజం అప్పుడప్పుడే అర్థమయి

నట్టు ఆమె ఆశ్చర్యపోయింది. ఆకళ్లల్లో నిరాశ, భయం, నిస్పృహలాంటివన్నీ ఒక్క సారిగా కదిలాయి.

తల్లి కళ్లలోని భావాలను గమనించిన రేవతికి ఏడుపు రాబోయింది. అయితే అది ఏడవడానికి సమయంకాదని తెలిసి తల్లితో చెప్పింది, "ఫర్వాలేదమ్మా!... ఏమయిందిప్పుడు! నువ్వు బాగానే వున్నావ్. కొద్దిసేపలా వుంటుంది అంతే..." ఆవిడకు ధైర్యం చెప్పడం కోసం అలా మాట్లాడేస్తూ ఉంది.

శారదమ్మ కళ్లల్లో నీళ్లు సుడులు తిరిగాయి. తన పరిస్థితి ఏమిటో అర్థంచేసుకోలేనంత అమాయకురాలేంకాదామె. అయితే తన మనసులోని బాధను కూడా నోటితో చెప్పుకోలేకపోతోంది. తన బిడ్డను ఆప్యాయంగా దగ్గరకు తీసుకోలేకపోతోంది. ఎంత నిస్సహాయ స్థితి!

తల్లి మనసులోని బాధను గమనించడంతో రేవతికి కూడా కళ్లల్లో నీళ్లు వచ్చాయి. కాని ఇలాంటి స్థితిలో తనే ధైర్యంకోల్పోతే, తన తల్లి మరింత బెంగపడిపోతుందేమో! ఇలాంటి సమయంలో రోగులకు కావలసింది కాసిన్ని ధైర్యవచనాలు.

అదృష్టవశాత్తు అప్పుడే నర్సు అక్కడికొచ్చింది.

ఆవిడ స్పృహలోకి రావడంచూసి రేవతితో చెప్పింది "ముందు ఆవిడకు నీళ్లు ఇవ్వండి. గుటక పడుతుందో లేదో చూడండి"

రేవతి పక్క పేషెంట్ తాలూకు వాళ్లను అడిగి గ్లాసులో నీళ్లు తీసుకుంది. గ్లాసు తల్లి నోటికి అందించింది.

ఆవిడ రెండు గుటకలేసింది.

అది చూసి నర్స్ చెప్పింది. "కొంతవరకూ పరిస్థితి ఫర్వాలేదనే అనుకోవాలి"

అయితే ఐదు నిమిషాల తర్వాత శారదమ్మ మళ్ళీ కళ్ళు మూసుకుంది.



రేవతి కంగారుగా నర్స్ ముఖంలోకి చూసింది. నర్స్ అంది, "ఏం ఫర్వాలేదు. మరో గంటా, రెండుగంటల్లో ఆవిడకు మళ్ళీ మెళుకువొస్తుందిలెండి"

ఆమె దిగాలుగా బెడ్‌మీద అలాగే కూర్చుండిపోయింది.

మరో గంట తర్వాత ఆవిడకు స్పృహ రాలేదుగానీ, సాయికృష్ణ వచ్చాడు. అతడి చేతిలో చిన్న ప్యాకెట్ ఉంది.

అతడు రేవతి దగ్గరగా వచ్చాక అడిగాడు, "ఆంటీకి స్పృహ వచ్చిందా? "

"ఆ! వచ్చింది. కాసిన్ని నీళ్ళుతాగి మళ్ళీ నిద్రపోయింది"

అతడు తన చేతిలోని ప్యాక్ ఆమెకు అందించి చెప్పాడు, "రాత్రి కూడా భోజనం చేసినట్టులేదు. అందులో టిఫిన్ ఉంది తిను"

"వద్దు సాయి"

"చూడు రేవతీ! మనకు ఆప్తులు ఆపదలో ఉండొచ్చు వాళ్ళ కష్టాన్ని తలుచుకుని మనం తినడం మానేస్తే వాళ్ళకు సేవ చేయడం కోసమైనా మనకు శక్తి కావాలి కదా? "

ఆమె మరేం మాట్లాడలేదు. తన బ్యాగ్ లోనుండి బ్రష్, పేస్ట్ తీసుకుని బాత్ రూమ్‌వైపు వెళ్ళింది.

మరో పావుగంటకు టిఫిన్ తినడం పూర్త య్యాక ఆమె అతడితో చెప్పింది, "నిన్నంతా హాస్పిటల్‌లోనే ఉన్నావ్. నేనొచ్చేశాను కదా. ఈ రోజు నువ్వు ఆఫీస్‌కి వెళ్ళు"

"ఫర్వాలేదు. రెండురోజులు ఆఫీసుకి శలవు పెట్టడంవల్ల నష్టమేం లేదు"

"అయినా ఇక్కడ అవసరం కూడా లేదు కదా? అంతగా అవసరపడితే నేను మీ ఆఫీ సుకి ఫోన్ చేస్తాను. ఫోన్ నెంబర్ ఇచ్చి వెళ్ళు"

"అయితేసరే"

అతడు ఫోన్ నెంబర్ చెపుతుంటే ఆమె కాగితం మీద రాసి ఉంచుకుంది.

"వస్తాను"

అతడు వెళ్ళిపోయాడు.

ఆమె తిరిగి తల్లి బెడ్ పక్కన ఉన్న స్టూల్‌మీద కూర్చుంది.

అలా ఎంతసేపు కూర్చుండిపోయిందో తెలియదు.

చాలా దగ్గరగా అడుగుల చప్పుడయింది. అప్పుడే ఆమె ఉలిక్కిపడి తలెత్తి చూసింది.

ముప్ఫయ్ ఏళ్ళ యువకుడు, తెల్లకోటు, మెడలో స్టెత్ ఉన్నాయి. పక్కనే నర్స్!

అతడిని హాస్పిటల్ డాక్టర్‌గా పోల్చుకు న్నాక ఆమె లేచి నిలబడింది.

డాక్టర్ శారదమ్మను పరీక్ష చేశాడ. తర్వాత ప్రిస్క్రిప్షన్ పేడ్‌మీద ఏవో మందులు రాసి ఆమెవైపు తిరిగాడు. "పేషెంట్ దగ్గర ఉన్నది మీరేనా? " అన్నాక ఆమెవైపు పరిశీలనగా చూశాడు.

ఆమెకేసి కొద్దిక్షణాలు అదోలా చూశాక అన్నాడు, "మిమ్మల్ని ఎక్కడో చూసిన ట్టుంది"

రేవతికి కూడా అతడిని ఎక్కడో చూసిన ట్టనిపించింది. కానీ ఎక్కడ చూసిందో గుర్తుకురాలేదు.

అతడికి అప్పుడే గుర్తుకొచ్చిందేమో. అయినా అనుమానంగానే అడిగాడు, "మీకు అంజలి అనే స్నేహితురాలు ఉందా? "

"అంజలి అంటే... రెండేళ్ళ క్రితం నా క్లాస్‌మేట్ అంజలి..." అలా అంటూ ఉన్న ప్పుడే ఆమెకు చప్పున గుర్తుకొచ్చింది. ఆమె కాసింత హుషారుగా అంది. "మీరు... మీరు అంజలి అన్నయ్యగారుకదూ"

అతడు చిన్నగా నవ్వాడు. "అవును... అయితే మీరు ఆరోజు నేను చూసిన మా చెల్లెలి ఫ్రెండ్‌వేనన్నమాట. మిమ్మల్ని చూడ గానే ఎక్కడో చూశాననిపించింది. కానీ ఎక్కడ చూశానో వెంటనే గుర్తుకురాలేదు"

ఎవ్వరూ తోడులేరు. ఆ హాస్పిటల్‌లో ఒక్కరూ తెలియదు అని దిగులుపడుతున్న సమయంలో ఒక పరిచయస్తుడు అందు





లోనూ డాక్టర్‌స్థాయి వ్యక్తి కలవడంతో ఆమెకు చాలా ఆనందం కలిగింది.

మాటలు కలిపే ఉద్దేశ్యంతో అడిగింది, "అంజలి ఇప్పుడు ఎక్కడ ఉందండీ?"

"తనిప్పుడు బొంబాయిలో ఉంది. మా బావగారు స్టాక్ ఎక్ఛేంజ్‌లో పనిచేస్తారు"

"అలాగా! కాలేజీలో మేమిద్దరం క్లోజ్‌గా ఉండేవాళ్ళం. కానీ, కాలేజీనుండి బయటపడ్డాక ఎక్కువగా కలుసుకోలేదు"

"కొన్ని స్నేహాలు అంతే. ఒకస్థాయిలో గాఢంగా ఉండి, తర్వాత తెగిపోతూ ఉంటాయి. అందులోనూ మా అంజలిది అదోరకమైన మనస్తత్వం. ఎవరితోనూ ఎక్కువకాలం స్నేహం చేయడం దానికి ఇష్టం ఉండదు. స్నేహాలు కూడా అవసరాలకే అనుకునే టైప్" అన్నాడు అతను.

ఆమె నవ్వి ఊరుకుంది.

అతడు బెడ్‌మీద ఉన్న శారదమ్మవైపు దృష్టి సారించి "ఈవిడ..." అంటూ ఆగాడు.

"మా అమ్మ"

"నిన్న ఉదయం ఈవిడను నేనే అడ్మిట్ చేసుకున్నాను. మరి నిన్నంతా మీరు కనిపించనేలేదు?"

"నేను రాత్రే హైదరాబాద్‌నుండి వచ్చాను"

"హైదరాబాద్‌నుండా?... అక్కడికెందుకెళ్ళారు?"

"నేనక్కడ కంప్యూటర్ ఆపరేటర్‌గా ఉద్యోగం చేస్తున్నాను"

అతడు మరేదో అడగబోయి ఆగాడు. రిస్ట్‌వాచ్‌కేసి ఒకసారి చూసుకున్నాక ఆమెతో చెప్పాడు, "రౌండ్స్ పూర్తయ్యాక నేను కన్సల్టింగ్ రూమ్‌లో ఉంటాను. రండి. మీకు పేషెంట్ కండీషన్ గురించి చెపుతాను"

ఆమె తలాడించింది. "చాలా థాంక్సండి"

అతడు అక్కడినుండి వెళ్ళిపోయాడు.

మరో అర్ధగంట తర్వాత ఆమె పక్కబెడ్ పేషెంట్ తాలూకూ ఓ వ్యక్తితో చెప్పింది, "మా అమ్మగారిని కాసేపు చూస్తుంటారా? నేను డాక్టర్‌గారిని కలిసి వస్తాను"

ఆమె డాక్టర్‌కి కాస్త పరిచయస్తురాలని తెలియడంతో హఠాత్తుగా గౌరవం పెరిగిపోయింది. "అలాగేనమ్మా... ఆలస్యమయినా ఫర్వాలేదు. వెళ్ళిరామ్మా" అన్నాడావ్యక్తి.

రేవతి తలాడించి అంజలి అన్నయ్యను వెతుక్కుంటూ వెళ్ళింది.

ఆమె అన్ని రూమ్‌లూ చూసుకుని అతదున్న కన్సల్టింగ్ రూమ్‌లోకెళ్ళేసరికి ఒంటరిగా కూర్చుని ఉన్నాడు. ఆమెను చూసి నవ్వి "రండి" అన్నాడు, చేత్తో ఎదురుగా వున్న కుర్చీని చూపిస్తూ!

రేవతి అతడు చూపించిన కుర్చీలో కూర్చుంది.

తలుపు దగ్గర నిలబడివున్న బాయ్‌ని పిలిచి కాఫీకోసం పంపాడతను.

బాయ్ వెళ్ళిపోయాక ఆమె అంది. "జస్ట్! ఇంతకుముందే కాఫీ తాగానండి. మళ్ళీ ఇంతలోనే ఎందుకండి?..." నిజానికి ఆమెకు తలనొప్పిగా వుండి, కాఫీ తాగాలనే వుంది. కానీ మొహమాటం!

"మీకు తాగాలనిపించకపోయినా నాకు తాగాలనిపిస్తోంది. ఎందుకంటే వన్ అవర్ అయినా అలా రౌండ్స్‌కెళ్ళొచ్చేసరికి తలంతా దిమ్ముగా అనిపిస్తుంది. మీరిప్పుడు కంపెనీ వున్నారుగదా, కాఫీ తాగాలనే మూడ్ వచ్చేసింది"

ఆమె నవ్వింది. అప్పుడే ఆమెకు ఓ విషయం అర్థమయింది. డాక్టర్ వృత్తిలో వున్నప్పటికీ అతడు చాలా కలుపుగోలు మనిషి. తనో డాక్టర్‌నని గర్వం అతడిలో కించిత్తు కూడాలేదు. ఒకవేళ అలాంటిది అతడిలో వుంటే తనను గమనించనట్టే వూరుకునేవాడు. గుర్తుకు తెచ్చుకుని మరీ పలకరించేవాడుకాదు. అందులోనూ ఒక గవర్నమెంట్ ఆసుపత్రికి వచ్చిన పేదింటి పిల్లను పలకరించవలసిన అవసరం అతడికి



లేదు. అదోరకంగా అతడిస్థాయికి ఇబ్బంది కలిగించే అంశమే... అయినా అతడు తనను పలకరించాడు. అదే అతడి గొప్ప తనం.

అతడూ నవ్వుతూ ఆమె ముఖంలోకి చూసి, కొద్ది సెకనుల తర్వాత చెప్పాడు. "నేను మిమ్మల్ని ఓసారి మా ఇంట్లో కలి శాను. అంజలి మిమ్మల్ని నాకు పరిచయం చేసింది"

"అవును. నాకూ గుర్తొచ్చింది"

అప్పట్లో తను కాలేజీలో చదివేరోజుల్లో తన స్నేహితురాలు అంజలి ఇంటికి ఒకటి రెండుసార్లు వెళ్ళింది. అలా వెళ్ళినప్పుడు ఓసారి ఇతడు ఇంట్లోనే ఉన్నాడు. అంజలి ఇతడిని తనకు పరిచయం చేసింది. అప్ప టికి అతడు మెడికో. ఎంతయినా టీనేజ్‌లో కాసింత సిగ్గు డామినేట్ చేస్తూ వుంటుంది. కాబట్టి తను అతడిని అంతగా పరిశీలనగా చూడలేదు. ఓరగా చూసింది. అతడు నమ స్కరిస్తే, తను ప్రతి నమస్కారం చేసిం దంతే.

అతడిని ఇప్పుడు ఇలా కలవవలసి వస్తుందని తను అనుకోలేదు. బహుశా జీవితం అంటే ఇదేనేమో. ఆమె ఆలోచనలు కట్ చేస్తూ అతడు అన్నాడు, "మిమ్మల్ని కలిసి మూడునాలుగేళ్ళు అయిపోవడంతో నేను మీ పేరు మర్చిపోయాను"

"నాపేరు రేవతి"

"మరి మీకు నాపేరు తెలుసా? "

తెలియదన్నట్టు రేవతి తల అడ్డంగా ఆడించింది.

"రామ్మోహన్"

బాయ్ కాఫీ పట్టుకొని లోపలికొచ్చాడు. ఇద్దరూ మౌనంగా ఉండిపోయారు.

ట్రేలోని కాఫీకప్పులు వారిద్దరిముందు పెట్టాక, బాయ్ వెళ్ళిపోయాడు.

"తీసుకోండి" అని అతడు అన్నాక ఆమె కప్పు చేతిలోకి తీసుకుంది.

అతడికి మరేం మాట్లాడాలో తెలియనట్టు సీరియస్‌గా కాఫీ తాగడంలో మునిగిపో యాడు. ఆమె కూడా కొద్దిక్షణాలు మౌనాన్ని ఆశ్రయించింది.

అదే సమయంలో ఆమె ఓరగా అతడిని పరిశీలనగా చూడసాగింది.

నిర్మలత్వానికి ప్రతీకలుగా చెప్పుకునే తెల్లని బట్టల్లో అతడు చాలా ప్రశాంత మూ ర్తిలా కనిపిస్తున్నాడు. వయసు ముప్ఫయ్ దాటినట్లులేదు. అయినా ఏదో తెలియని హుందాతనం అతడి నడవడికలో కనిపి స్తోంది. బహుశా అది వృత్తివలన ఏర్పడిన పెద్దరికం కావచ్చు.

అతడు కాఫీ తాగి కప్పు టేబుల్‌మీద పెడుతూ ఆమెవైపు చూశాడు.

అప్పటివరకూ అతడినే చూస్తున్న ఆమె అతడి చూపులు తనమీద పడడంతోనే తడ బడి చూపులు మరల్చుకుంది.

దాంతో అప్పటివరకూ వున్న నిశ్శబ్దం మరింత గాఢతను సంతరించుకుంది.

కొద్దిక్షణాలపాటు ఆ నిశ్శబ్దం ప్రవా హంలా సాగాక, ఆ ప్రవాహానికి అడ్డుకట్ట వేయవలసిన బాధ్యత తనదే అన్నట్టు ఆమే అంది. "తెలిసిన వాళ్ళులేక, ఏంచేయాలో తోచక భయపడుతున్న నాకు మీరు దేవు డిలా కనిపించారు"

అతడు నవ్వేశాడు. కాసేపాగి కొంత క్యూరియాసిటీతోనే అడిగాడు. "అయితే మీకు తోడుగా మరెవ్వరూ లేరా? "

"లేరు డాక్టర్!..."

"మీ ఫాదర్, బ్రదర్స్...? "

"ఫాదర్ లేరు. నో బ్రదర్స్. అమ్మకు నేనొక్కత్తే కూతుర్ని. కాబట్టి అమ్మకు నేను, నాకు అమ్మ తప్ప ఈ లోకంలో మాకు మరెవ్వరూ తోడులేరు డాక్టర్"

"నిన్న మీ అమ్మగారిని తీసుకొచ్చి జాయిన్ చేసిన ఆ వ్యక్తి? "

"మాకు దూరపు బంధువు. పైగా నాతో కలిసి చదువుకున్నాడు. పేరు సాయికృష్ణ. మీ అంజలికి కూడా అతడు బాగా తెలుసు.





"అప్పటికి ఇద్దరిమధ్యా కొంత దగ్గరితనం ఏర్పడడంతో ఆమె బిడియం వదిలి అతడిని అడిగింది. "మా అమ్మ హెల్త్ గురించి ఏదో చెపుతానన్నారు...?"

అతడు తలాడించాడు. వెంటనే దీర్ఘంగా నిశ్వసించాడు. ఆ తర్వాత ఆమెవైపు జాలిగా చూస్తూ పలికాడు. "వృద్ధాప్యంలో ఒక మనిషికి పెరాలసిస్ స్ట్రోక్ రావడం చాలా... చాలా అన్యాయం. అది ఆ జబ్బు వచ్చినవాళ్ళకి బాధాకరమైన విషయమయితే వాళ్ళను చూసుకోవలసిన వాళ్ళకి చాలా ఇబ్బంది కలిగించేదిగా వుంటుంది. స్ట్రోక్ వచ్చిన మనిషి చాలాకాలం లేదా జీవితాంతం బెడ్‌మీదనే వుండే పరిస్థితి ఏర్పడడంతో బెడ్‌మీద పడివుండే పేషెంట్‌ని చూసుకునేవాళ్ళకు చాలా... చాలా ఓర్పు, సహనం కావాలి..." చెప్పడం ఆపి అతడు ఆమె ముఖంలోకి చూశాడు.

అతడు తనవైపు ఎందుకు చూస్తున్నాడో అర్థం కావడంతో ఆమె వెంటనే చెప్పింది, "ఆ అనుమానం మీకు అక్కర్లేదు. మా అమ్మంటే నాకు చాలా చాలా ఇష్టం డాక్టర్. ఆమెను నేను కంటికి రెప్పలా కాపాడుతాను"

"మిమ్మల్ని చూడగానే నాకు అలాంటి నమ్మకమే కలిగింది. అందువల్లే ఇలా నా కన్సల్టింగ్ రూమ్‌కి పిలిచి మరీ చెపుతున్నాను"

ఆగి, క్షణం తర్వాత అతడు కంటిన్యూ చేశాడు.

"స్ట్రోక్ వచ్చాక ప్రాణాపాయస్థితినుండి కోలుకునేలా చేసి మేం పేషెంట్‌ని ఇంటికి పంపుతాం. ఇంటిదగ్గర పేషెంట్‌కోసం మీరు చాలా జాగ్రత్తలు తీసుకోవలసి ఉంటుంది. పేషెంట్ కాస్త కూర్చోగలిగే పరిస్థితికి రాగలిగేలోపు వీపుమీద, పిర్రలమీద పుళ్ళు పడకుండా జాగ్రత్తలు తీసుకోవాలి. అందుకోసం పూటకో పొజిషన్ మారుస్తూ మెత్తటి పరుపులమీద పేషెంట్‌ని పడుకోబెట్టాలి. పక్షవాతం వచ్చిన చేతికింద, కాళ్ళకింద మెత్తటి దిండ్లు ఉంచాలి. ఆహారాన్ని మెత్తటి జావలాగా చేసి అందించాలి. మనిషిలో మార్పు వస్తున్నకొద్దీ, కదలకుండా పడిపోయిన అవయవాన్ని కదిలించేందుకు రోగిచేత క్రమేణా మృదువుగా ప్రయత్నాలు చేయించాలి.

"ఈ ప్రయత్నాలు ప్రారంభమయినప్పటి నుండి 'రిహాబిలిటేషన్ పిరియడ్' అంటారు. ఈ ప్రయత్నాలలో భాగంగా, రోగిని బెడ్‌మీదనుండి లేపడం, మంచం అంచుకు చేర్చి తనంతతానుగా కుర్చీలోకి మారగలిగేలా ప్రయత్నాలు చేయించాలి. నెమ్మదిగా అడుగులు వేయడం నేర్పాలి. ముఖం కడుక్కోవడం, తల దువ్వుకోవడం, బట్టలు వేసుకోవడం... ఇలా పక్షవాతం వచ్చిన చేత్తో ఒక్కటొక్కటే ప్రాక్టీస్ చేయించాలి. ఇలాంటి ఎక్సర్‌సైజ్‌లు చేయిస్తూనే 'స్పీచ్ థెరపీ' అంటే మాట్లాడడం కూడా నేర్పాలి. పసిపాపలకు 'అమ్మ, ఆవు' అంటూ చదువు ఎలా నేర్పుతామో, అలా రోగిచేత ఒక్కొక్కమాటే పలికించి పలకడం అలవాటు చేయాలి. ఒక్కమాటలో చెప్పాలంటే పక్షవాతం వచ్చిన మనిషి 'పసిపాప'తో సమానం. 'పసిపాప'ను చూసుకునేందుకు 'అమ్మ' కావాలి. కాబట్టి మీరిప్పుడు మీ అమ్మగారికి 'అమ్మగా' మారగలగాలి..."

రేవతి మౌనంగా ఉండిపోయింది.

ఆమె మౌనం చూసి అతడు అడిగాడు, "మాట్లాడరేంటి? బాధపడుతున్నారా?"

రేవతి తల అడ్డంగా ఆడించింది. "అమ్మకు ఈ పరిస్థితి రావడం బాధాకరమే కావచ్చు కానీ అమ్మకు అమ్మగా మారగలగడం పూర్వజన్మ సుకృతం వల్ల నాకు దొరికిన అదృష్టంగా నేను భావిస్తున్నాను"

అతడు ఆమెకేసి కొద్దిక్షణాలు కన్నార్పకుండా చూశాడు.

రేవతి అతడి చూపులు గమనించి కొద్దిగా తడబడింది. అయినా తన తడబాటుకి



అర్థంలేదనుకుందేమో, వెంటనే సర్దుకుని చెప్పింది, "చాలా మంచి విషయాలు చెప్పారు. థాంక్సండి"

"వెల్‌కమ్. మీ అమ్మగారి అనారోగ్యం విషయంలో ఎలాంటి సహాయం కావాలన్నా నిర్మొహమాటంగా అడగండి"

"అలాగేనండి. మరి నేను వెళ్ళొస్తానూ"

అతడు తలాడించాడు.

ఆమె కుర్చీలోనుండి లేచి బయటకు నడిచింది.

రేవతి వెళ్ళిపోయాక రామ్మోహన్ చాలాసేపు అలాగే కూర్చుండిపోయాడు. ఆ సమయంలో అతడికి ఆమె మాటలే గుర్తుకు రాసాగాయి.

"అమ్మకు ఈ పరిస్థితి రావడం బాధాకరమే కావచ్చు. కానీ అమ్మకు అమ్మగా మారగలగడం పూర్వజన్మసుకృతం వల్ల నాకు దొరికిన అదృష్టంగా నేను భావిస్తున్నాను"

అతడు అనుకున్నాడు, 'ఆ అదృష్టం రేవతిదా?... కాదేమో! రేవతిలాంటి బాధ్యత కలిగిన కూతుర్ని కన్న ఆ తల్లే అదృష్టవంతురాలు'



సాయంత్రం శారదమ్మ మళ్ళీ స్పృహలోకొచ్చింది. కూతుర్ని చూస్తూ కన్నీళ్ళు కార్చసాగింది.

తల్లి మనసు గమనించినట్టుగా రేవతి అంది, "కన్నీళ్ళు ఎందుకమ్మా? అసలిప్పుడేమయింది? చిన్న అనారోగ్యం. అంతే కదా? "

ఆ తల్లికీ తన కూతురు తనకు ధైర్యం చెప్పడంకోసమే అలా అంటూ ఉందన్న విషయం అర్థమైంది. అయినా తనకొచ్చిన జబ్బేమిటో, ఆ జబ్బు లక్షణాలేమిటో తనకు తెలియదా? తనేం మరీ అంత అమాయకురాలేం కాదుకదా? పిచ్చిది, తనను మాటలతో మభ్యపెట్టాలని చూస్తోంది.

రేవతి ఆప్యాయంగా తల్లి తలను నిమురుతూ, మంచంమీద కూర్చుంది. కొద్దిక్షణాల తర్వాత తల్లి తలను తన ఒడిలో ఉంచుకుంది.

వాళ్ళిద్దరూ తల్లీకూతుళ్ళనే విషయం ఆ వార్డ్‌లోని వాళ్ళందరికీ ఉదయమే తెలిసిపోయింది. ఆ తల్లికి కూతురికి మధ్య ఉన్న అనుబంధాన్ని ఆ వార్డ్‌లోని వాళ్ళంతా పరిశీలిస్తూ ఉండిపోయారు.

శారదమ్మకు స్పృహ వచ్చిన ఓ పావుగంటకు సాయికృష్ణ హాస్పిటల్‌కొచ్చాడు.

స్పృహలో ఉన్న శారదమ్మను చూసి సంతోషపడ్డాడు. "ఆంటీ... ఎలా ఉంది ఆంటీ? " బెడ్‌పక్కనే ఉన్న స్టూల్‌మీద కూర్చుంటూ అడిగాడు.

ఆమె ఉన్న పరిస్థితికి జవాబు ఆశించి అలా అడగలేదతను. ఓ పలకరింపు ఉంది. ఏ స్థితిలో ఉన్న పేషెంట్‌కయినా అలాంటి పలకరింపు వలన అదోరకమైన తృప్తి కలుగుతుంది. వీళ్ళంతా నా వాళ్ళేకదా అన్న మానసిక ధైర్యం ఏర్పడుతుంది.

శారదమ్మ మాట్లాడాలని ప్రయత్నించిందో, నవ్వాలనుకుందోగానీ నోరుమాత్రం వంకరపోయింది. నోటినుండి శబ్దం కూడా రాలేదు.

రేవతికి చెప్పినట్టే ఆమెకూ ధైర్యం చెప్పాడతను. "భయపడాల్సిందేమీలేదు ఆంటీ. నేను పెద్ద డాక్టర్లతో కూడా మాట్లాడాను.

# రచయితలకు మనవి



★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, 'చతురకతలు', 'చతుర ప్రపంచం'వంటి శీర్షికలు కాక కేవలం నవలమాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచడంగాని, తగ్గించడంగాని వుండదు గనుక రచయిత(త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో 100 పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని పంపవలసి వుంటుంది.

★ ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూసుకుని, ఆమేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు సరిపోయేలా ప్లాన్‌చేసుకుని 'చతుర'కు అనుకూలంగా వుండేసైజులో పంపడం మంచిపద్ధతి.

★ ఆవిధంగా నవలలు 'చతుర'కు సరిపడా లేకపోయినట్లయితే ఆయా నవలలు పరిశీలనార్హాలు కావని గమనించగోరుతున్నాం.

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయినసందర్భాల్లో మా బాధ్యత వుండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపరచడం, లేనిపక్షంలో తిప్పిపంపడం జరుగుతుంది.

★ ప్రతి నవలకు అందజేసే రు: 3000/– పారితోషికం ఏనెల 'చతుర'లో ప్రచురిస్తే ఆనెల మొదటివారంలోనే పంపబడుతుంది.

ఎడిటర్:

# చతుర

'ఈనాడు' కాంపౌండ్ హైదరాబాద్-500 482.

# చతుర సమీక్ష



ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలుబడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్లీ చెప్పకుండా, అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీ లోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', 'ఈనాడు' కాంప్లెక్స్, హైదరాబాదు-500 082 అనే చిరునామాకు పోస్ట్ చేయాలి.

మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రూ.100/- ప్రథమ బహుమతి, రూ. 75/- ద్వితీయ బహుమతి, రూ. 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటు చేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

సెప్టెంబర్ చతుర నవల **కూతురు**

సమీక్షకుని పేరు : ____________________

చిరునామా ____________________

____________________

____________________

వారం రోజులలో మీరు మళ్ళీ మామూలు మనిషైపోయి, మునుపటిలా తిరిగేయొచ్చని చెప్పారు"

ఆవిడ అతడి మాటలు నమ్మిందో, నమ్మ లేదో తెలియదు. కళ్ళతో భావాలు పలికించే నేర్పు ఇంకా రాకపోవడంతో ఆవిడ నిశ్చలంగా వాళ్ళిద్దరినే చూస్తోంది.

కొద్దిసేపటికి మళ్ళీ కళ్ళు మూతబడిపోయాయి.

రేవతి కంగారు పడుతుంటే, సాయికృష్ణ చెప్పాడు. "పరిస్థితి నుండి కోలుకునే వరకూ స్పృహ ఇలా వస్తూపోతూ ఉంటుంది. ఇది సహజం"

ఆమె తలాడించింది. అప్పుడే అటు చూస్తే సెలైన్ బాటిల్ అయిపోతూ ఉంది. ఆమె అతడితో అంది. "నేను నర్సుని పిలుచుకొస్తాను"

"ఎందుకు? "

ఆమె సెలైన్ బాటిల్ అతడికి చూపించి చెప్పింది. "సెలైన్ బాటిల్ అయిపోతూ ఉంది"

బాటిల్ కేసి చూశాక అతడు "అలాగే వెళ్ళిరా" అన్నాడు.

రేవతి తల్లి తలను దిండుమీద ఉంచి లేచి నిలబడింది.

నిముషం తర్వాత నర్సుని తీసుకొచ్చి సెలైన్ బాటిల్ మార్పించింది.

నర్స్ వెళ్ళిపోయాక సాయికృష్ణ ఆమెతో చెప్పాడు, "రేవతీ! ఎలాగూ నేను ఉంటున్నాను కాబట్టి, నువ్వు ఇంటికెళ్ళి స్నానంచేసి పడుకునేందుకు దుప్పట్లు లాంటివి తెచ్చుకుంటే బాగుంటుంది కదా? "

"అవును, వాటర్ బాటిల్, గ్లాసు, మెత్తటి దిండ్లు కూడా తీసుకురావాలి"

"మరి ఆలస్యం ఎందుకు? వెళ్ళిరా"

తన బ్యాగ్ అందుకుని హాస్పిటల్ నుండి బయటకు నడిచింది రేవతి.

రిక్షాలో ఇంటికి చేరుకుంది.

తలుపుతీసి, లోపలికి వెళ్లాక కొద్దిక్షణాల పాటు ఏమీ తోచనట్టు అలాగే నిలబడిపోయింది. ఏవేవో స్మృతులు గుర్తుకొస్తున్నాయి. ఎన్నెన్నో దృశ్యాలు కళ్లముందు కదలాడుతున్నాయి.

తండ్రి మరణం, శవాన్ని ఇంటి వరండాలో పడుకోబెట్టి ఉన్నప్పుడు తల్లి ఆ శవం మీద పడి ఏడుస్తూ తనిక ఎందుకు బ్రతకాలని ప్రశ్నించడం, ఇరుగుపొరుగు ఓదారుస్తూ "ఇదుగో ఈ పసిదాని కోసమయినా నువ్వు బతక్క తప్పదు శారదమ్మా" అనడం. మరణం తాలూకు దుఃఖంనుండి తేరుకోకమునుపే భయంకరమైన దారిద్ర్యం తమను చుట్టుముట్టడం. అప్పటివరకూ ఇంటిపనికే పరిమితమైన తల్లి సంపాదన కోసం దారులు వెతుక్కోవడం. టైలరింగ్ నేర్చుకుని కుట్టుమిషన్ కొనుక్కొని రాత్రింబవళ్లు కష్టపడడం. ఏ అర్ధరాత్రివేళనో తనకు మెలుకువవచ్చి చూస్తే అప్పటికీ కుట్టుమిషన్ మీదనుండే తనను చూసి నవ్వే తల్లి, జ్వరంతో హాస్పిటల్ కి వెళ్లాల్సినవేళ పరీక్ష ఫీజు కట్టాల్సి ఉందని తన అనారోగ్యాన్ని దాచిన తల్లి. ఎన్నెన్ని స్మృతులో? ! అన్నీ గుండెల్లో హత్తుకుపోయిన అనుభూతులే.

రేవతి తల విదిలించింది. ఒక్కసారిగా నీరసం ముంచుకురావడంతో అతికష్టంమీద రెండు అడుగులేసి అక్కడే ఉన్న మంచం మీద కూలబడిపోయి వెనక్కు వాలింది.

ఏమిటిది? అసలెందుకిలా జరిగింది? తన చిన్న వయసునుండి తల్లి పడుతున్న కష్టాలకు ఇక ముగింపు చెప్పాలని అనుకుంటూ, అందుకు పథకాలు ఆలోచించుకుంటూ ఉన్నప్పుడే ఊహించని విధంగా తమ బతుకు దారి ఇలా మలుపు తిరగడం ఏమిటి?

పక్షవాతం వచ్చిన మనిషి కోలుకోవడానికి చాలా సంవత్సరాలుపడుతుంది. వృద్ధాప్యంలో ఇలాంటి జబ్బువస్తే కోలుకునే అవకాశాలు చాలా తక్కువ. మరిప్పుడు తన తల్లి భవిష్యత్తు?



రేవతికి భయమేసింది. అప్రయత్నంగానే ఆమె పెదవులు బిగపట్టింది. కళ్లు మూసుకుని కొద్దిక్షణాలు అలాగే ఉండిపోయింది.

"అమ్మాయ్ రేవతీ"

రేవతి తలెత్తి చూస్తే పక్కింటి కరుణమ్మ తన ఎదురుగా నిలబడివుంది.

"రా పెద్దమ్మా... రా కూర్చో"

కరుణమ్మ రేవతి కూర్చుని వున్న మంచం దగ్గరగా వచ్చి పక్కనే కూర్చుంది. "అమ్మకు ఎలా ఉందే రేవతీ? "

"ప్రాణాలకు ప్రమాదం లేదని చెప్పారు డాక్టర్లు"

"మరి తను స్పృహలోకొచ్చి, నిన్ను గుర్తు పట్టడంలాంటివి జరిగాయా? "

"ఆ... రెండుసార్లు స్పృహలోకొచ్చింది. నన్ను గుర్తుపట్టి కళ్ళనీళ్ళు పెట్టుకుంది" తల్లి గుర్తుకురావడంతోనే రేవతికి మళ్ళీ కళ్ళ నీళ్ళు ఉబికివచ్చాయి. గొంతు పూడుకుపోయి, చివరిమాట గద్గదమయింది.

కరుణమ్మ రేవతి భుజంమీద చెయ్యివేసి నిమిరింది. "ఏడవకే రేవతీ... ఏడవకు..." అంది అనునయంగా.

శారదమ్మ ఆ వీధిలోని వారందరితో చాలా మంచిగా మసలుకుంటూ, కలసిమెలసి ఉండేది. అయితే మిగిలిన వారందరి కన్నా కరుణమ్మతో ఎక్కువ చనువుగా ఉండేది. వాళ్ళిద్దరూ ఒకరినొకరు అక్కా... అక్కా... అని పిల్చుకునేవారు.

ఇరుగుపొరుగుతో మనస్పర్థలు రాకుండా కాలం గడపగలగడం ఒక గొప్ప ఆర్టేమో! ఆ విద్య తన తల్లికి బాగా తెలుసు. ఆమె ఇరుగుపొరుగుతో గొడవ పడగా తనేనాడూ చూడలేదు.

రేవతి తల్లి జ్ఞాపకాలను బలవంతంగా పక్కకు నెట్టేయాలని ప్రయత్నిస్తూనే కళ్ళు తుడుచుకుంది.

ఆమెను ఆ మూడ్‌లోంచి ఇవతలకు తీసుకురావాలనే ఉద్దేశ్యంతో కాబోలు కరుణమ్మ అంది, "నేను నిన్ననే హాస్పిటల్‌కు వెళ్లాలనుకున్నానే, కాని మీ పెదనాన్న బంధువులింట్లో పెళ్లికి ఊరెళ్లి ఉన్నాడు. ఇంట్లో ఎవరూలేరు. అందుకని వెళ్లలేకపోయాను. అప్పటికీ హాస్పిటల్‌కి వెళ్లి మీ అమ్మను చూసొచ్చిన ఇరుగుపొరుగుని అడిగి విషయం తెలుసుకుంటూనే ఉన్నాను..."

రేవతి తలాడించింది. "ఫర్వాలేదులే పెద్దమ్మా" గొణిగినట్టుగా అంది.

అంతలో మళ్లీ కరుణమ్మే చెప్పింది, "నేను హాస్పిటల్‌కి వెళ్లలేకపోయానుగాని, ఈ వీధిలో చాలామంది వెళ్లి మీ అమ్మను చూసొచ్చారు. అప్పుడే నాకు తెలిసింది. మీ అమ్మంటే ఈ వీధిలో చాలామందికి అభిమానం ఉందని"

ఈసారి రేవతి అసలు మాట్లాడలేదు.

కొద్దిక్షణాలాగాక కరుణమ్మ అడిగింది. "అవునే! ఇంతకీ హైదరాబాద్‌లో నీ ఉద్యోగం ఎలా వుందే? "

"బాగుంది పెద్దమ్మా. కాని...కాని అమ్మను తీసుకెళ్లి అక్కడ ఉంచుకోవాలంటే ఆ చిన్న ఉద్యోగం సరిపోదు. అంతకన్నా మంచి ఉద్యోగం సంపాదించుకోవాలి"

"మీ అమ్మకు ఇలావుంటే ఇక నువ్వు హైదరాబాద్ ఏం వెళ్తావ్? "

రేవతి మాట్లాడలేదు. 'నిజమేకదా' అని మనసులో అనుకుంది. ఆ విషయం గురించి తీరికగా ఆలోచించి నిర్ణయం తీసుకోవాలి.

"... నిజం చెప్పాలంటే మీ అమ్మకు నీ గురించే దిగులు 'ఆడపిల్ల... మా వెనుక ఆస్తిపాస్తులేం లేవు. ఈ పిల్లకు ఎలా పెళ్లి చేయగలనక్కా' అని నా దగ్గర ఎన్నోసార్లు బాధపడింది"

కరుణమ్మ చాలా మామూలుగానే విషయాలు చెపుతూ వుండొచ్చు కాని తల్లి జ్ఞాపకాలు తన గుండెను పిడికిట బట్టి బిగిస్తున్నంతగా బాధపెడుతున్నాయి. 'అమ్మ నాకోసం ఎన్ని నిద్రలేని రాత్రులు గడిపిందో కదా? ' అనుకుంది.





అప్పుడే కర్తవ్యం గుర్తుకొచ్చిందేమో. ఆవిడ మంచంమీదనుండి లేస్తూ రేవతితో చెప్పింది. "నువ్వు బాగా అలిసిపోయినట్టు న్నావ్, స్నానం చెయ్యి. వంట ప్రయత్నాలు మాత్రం మొదలెట్టకు. నేను భోజనం పట్టు కొస్తాను"

"మీకు శ్రమ ఎందుకు పెద్దమ్మా, నేను వండేసుకుంటాను"

"ఇలాంటి హడావుడిలో నువ్వు వండుకుని తినడం జరిగేపనికాదులే. అయినా నాకు మాత్రం శ్రమేముంది? నేను వండుకోబో తున్న దాంట్లో ఇంకాసిన్ని బియ్యం వేస్తే, నీకూ భోజనం అయిపోతుంది"

రేవతి మరేం మాట్లాడలేదు. ఆవిడ మరోసారి " వంటచేయొద్దు" అంటూ చెప్పి వెళ్ళిపోయింది.

కొద్దిసేపు అక్కడే ఏమీ తోచనట్టు కూర్చుండిపోయాక, ఇక తప్పదన్నట్టు లేచింది.

ఒకేఒక పెద్ద గది వున్న పెంకుటిల్లు అది. ముందు వరండా వుంది. వెనుకవైపు పెరట్లో వంట చేసుకునేందుకు చుట్టిల్లు, బాత్‌రూమ్, కాసింత ఖాళీస్థలం ఉన్నాయి. తమకు ఉన్న ఆస్తల్లా ఆ పెంకుటిల్లే. తను పుట్టి పెరిగింది ఆ ఇంట్లోనే.

ఆమె ఇంటివెనుకవైపు తలుపు తీస్తుంటే, శ్రీలక్ష్మి వచ్చింది. ఆవిడ తమ ఇంటికి ఎదు రింట్లో వుంటుంది.

"నువ్వు రాత్రి వచ్చావని తెలిసింది రేవతీ! హాస్పిటల్‌నుండి వస్తున్నావటకదా? అమ్మ కెలా వుంది?" ఆప్యాయంగా అడిగింది శ్రీలక్ష్మి.

"బాగుందక్కా"

ఆమె పరామర్శ చేసి వెళ్ళిపోయేవరకూ అలాగే నిలబడి ఉండిపోయింది రేవతి.

శ్రీలక్ష్మి వెళ్ళిపోయాక రేవతి తలుపు పూర్తిగా తెరిచి పెరట్లోకి వెళ్లింది. చుట్టింటికి తాళం తీసి లోపలికి వెళ్లింది. కిరోసిన్ స్టవ్ అందుకుని ముట్టించి, దానిమీద నీళ్లు పడే సింది.

తిరిగి ఇంట్లోకి వచ్చాక, హాస్పిటల్‌కి తీసు కెళ్లాల్సిన వస్తువులు సర్దుకోసాగింది.

రేవతి అలా సర్దుకుంటున్నప్పుడే వీధి చివరఇంటి ప్రతిమ వచ్చింది. ఆమె మరి కాసేపు కూర్చుని పరామర్శలు చేసింది.

అలా పది నిముషాలు గడిచాక రేవతి ఆమెతో చెప్పింది. " కూర్చొని ఉండండి, నేను స్నానం చేసి వచ్చేస్తాను"

"ఎందుకులేమ్మా! నేను తర్వాత మరికా సేపు కూర్చుంటాలే. అసలే నువ్వు మళ్ళీ హాస్పిటల్‌కి వెళ్లే హడావుడిలో వున్నట్టు న్నావ్"

రేవతి జవాబుగా ఇబ్బంది పడుతూ నవ్వింది.

ప్రతిమ వెళ్ళిపోయింది.

రేవతి బట్టలు తీసుకుని పెరట్లోకి వెళ్లింది.

స్నానంచేసి తయారయ్యేసరికి మరోపావు గంటయింది. తనిక త్వరగా హాస్పిటల్‌కి వెళ్లాలనుకుంటూ, తీసుకెళ్లాల్సిన వస్తువు లన్నీ ఓ పక్కన పెట్టుకుని కరుణమ్మ కోసం ఎదురు చూడసాగింది.

ఎక్కువ ఆలస్యం చేయకుండానే వచ్చే సింది కరుణమ్మ. ఆవిడ చేతిలో స్టీలు పళ్లెం ఉంది. అందులో అన్నం, కూరలు ఉన్నాయి.

రేవతి ఆ పళ్లెం అందుకుని ముద్ద కలుపు కుని నోట్లో పెట్టుకోబోతూ వుంటే, హాస్పిట ల్‌లోని తల్లి కళ్లముందు కదలాడింది. అన్నం తినడానికి మనసొప్పలేదు. ఆమె చెయ్యి అలాగే కిందికి దిగిపోయింది.

అది గమనించిన కరుణమ్మ, ఆమె భుజం మీద చెయ్యేసి అడిగింది "అమ్మ గుర్తుకొ స్తోందా రేవతీ"

"అవును పెద్దమ్మా"

"అన్నం తినేవేళ అమ్మను తలచుకోవడం సంతోషించదగ్గ విషయమే కాని మీ అమ్మను తలుచుకుంటూ నువ్వు భోంచేయ

కపోతే, నాలుగురోజుల తర్వాత నువ్వూ మీ అమ్మ పక్కనే పడుకోవలసి ఉంటుంది. అప్పుడు మీ ఇద్దరికీ సేవచేయడానికి మరె వ్వరూలేరు"

ఆమె భయం కూడా అదే. తల్లికి సేవచే యడానికి తనకి ఎంతో కొంత ఓపిక కావాలి. కానీ తనకిప్పుడు బాధ తాలూకు ప్రభావం ఎక్కువగా ఉంది.

చివరికి ఆమె బాధను దిగమింగుకుంది. సయించకపోయినా కాసింత ఎంగిలి పడ్డాన నిపించి చెయ్యి కడిగేసింది.

హాస్పిటల్ కి తీసుకెళ్లాల్సిన సామాన్లు బయటపెట్టి ఇంటికి తాళం వేసింది.

కరుణమ్మ ఆమె వెంట వీధి చివరవరకూ వచ్చి రిక్షా ఎక్కించి వెళ్లిపోయింది.

ఆమె వార్డ్‌లోకి వచ్చేసరికి సాయికృష్ణ, డాక్టర్ రామ్మోహన్ బెడ్ దగ్గర నిలబడి మాట్లాడుకుంటూ ఉన్నారు.

రామ్మోహన్ ఆమెను చూసి విష్ చేశాక అడిగాడు " ఇంటికెళ్లారా? "

"అవునండి. ఈ సామాన్లు పట్టుకురావడా నికి వెళ్లాను"

"జస్ట్ ఇప్పుడే, మీ అమ్మగారికి ఇంజక్షన్ చేశాను. మీ గురించి అడిగితే 'ఇంటికెళ్లారని' ఈయన చెపుతూ ఉన్నాడు. ఇంతలో మీరొ చ్చారు"

ఆమె సాయికృష్ణకేసి చూపుతూ, రామ్మో హన్‌తో చెప్పింది "ఉదయం మీకు చెప్పానే, సాయికృష్ణగారని, ఆయన ఈయనే. గుర్తుప ట్టారనుకుంటానూ? "

"నిన్న మీ అమ్మగారిని హాస్పిటల్ లో చేర్పించింది ఈయనే కదా? తెలుసు" అన్నాక చెయ్యి ముందుకు సాచి సాయికృ ష్ణతో చెప్పాడు, " ఐయామ్ డాక్టర్ రామ్మో హన్"

"గ్లాడ్ టు మీట్ యూ సార్" సాయికృష్ణ చెయ్యి కలిపాడు.

రామ్మోహన్ చెప్పాడు, "రేవతిగారు మా చెల్లెలికి క్లాస్‌మేట్. తనను ఒకటీ, రెండు సార్లు మా ఇంట్లో చూశాను. హాస్పిటల్‌లో హఠాత్తుగా చూడడంతో మొదట గుర్తుపట్ట లేకపోయానుగానీ, తర్వాత గుర్తుపట్టడంతో పరిచయమేర్పడింది"

"ఎలాగయితేనేం మీరు పరిచయం కావడం మా అదృష్టం"

"నేనిక వెళ్తాను. రేపు ఉదయం మళ్లీ కలుస్తాను. ఈలోపు ఏ ప్రాబ్లమ్ రాకుండా నైట్ డ్యూటీ నర్స్‌కి చెప్పి వెళ్తాను. ప్రాబ్లమ్ అనిపిస్తే ఏవేళలోనయినా ఇంటికి ఫోన్ చేయండి, సరేనా"

"అలాగే డాక్టర్" తలాడించింది రేవతి.

రామ్మోహన్ వెళ్లిపోయాడు.

మరో పావుగంట తర్వాత ఆమె సాయికృ ష్ణతో చెప్పింది " ఇంక నువ్వూ ఇంటికెళ్లి పోతే బాగుంటుందేమో కదూ? "

"అలాగే, నేనూ రేపు ఉదయం వస్తాను"

ఆమె తలాడించింది. సాయికృష్ణ కూడా వెళ్లిపోయాడు.

హాస్పిటల్ లో తల్లీకూతుళ్లు మాత్రమే మిగిలారు.

★ ★ ★

మర్నాటికి శారదమ్మ పూర్తి స్పృహలో కొచ్చేసింది.

స్పృహలోకొచ్చినా కనీసం పదిరోజుల పాటు హాస్పిటల్ లోనే ఉండాలని ఆవిడకు ట్రీట్‌మెంట్ ఇస్తున్న డాక్టర్ రామ్మోహన్ చెప్పాడు.

రేవతి బాధపడలేదు. తల్లి ఆరోగ్యం మెరుగయ్యేందుకు పదిరోజులుకాదు, పది నెలలయినా హాస్పిటల్ లో ఉండేందుకు తను ఎప్పుడో మానసికంగా సిద్ధపడింది.

ఇరవై నాలుగు గంటలూ తల్లిని కనిపెట్టు కుని ఉండడమే ప్రస్తుతం ఆమె దినచర్యగా మారింది.

కాకపోతే రెండురోజులకోసారి ఇంటికెళ్లి బట్టలు ఉతికి, స్నానంచేసి హాస్పిటల్ కి కావలసిన వస్తువులు తెచ్చుకునేది. పేద రికం కారణంగా బంధుమిత్రులు తక్కువ




కావడంతో హాస్పిటల్ కి భోజనం తెచ్చిపెట్టే వాళ్లు ఎవ్వరూ లేకుండాపోయారు. దాంతో ఆమె హోటల్ తిండి మీదనే ఆధారపడింది. ఏదో ఇంటికెళ్లినప్పుడు మాత్రం కాసింత వండుకుని తినేది.

ఈమధ్యకాలంలో సాయికృష్ణ ఆమెకు అన్నివిధాలా చేదోడువాదోడుగా ఉంటున్నాడు. ప్రతిరోజు ఉదయం, సాయంత్రంవేళల హాస్పిటల్ కివచ్చి అవసరాలు కనుక్కొని వెళ్లడమో లేదా తను ఆవిడ దగ్గర ఉండి ఆమెను ఇంటికి పంపడమో చేస్తున్నాడు. అయితే అతడికి ఇంటి దగ్గర ఉన్న కొన్ని రకాల సమస్యల కారణంగా భోజనం తెచ్చిపెట్టే పనిమాత్రం చేయలేకపోతున్నాడు. బహుశా ఆ గిల్టీ ఫీలింగ్ వల్లనే కాబోలు తనే ఎక్కువసార్లు హోటల్ నుండి భోజనం తెచ్చి ఆమెకు అందిస్తున్నాడు.

మూడురోజుల తర్వాత రేవతి ఇంటికెళ్లేసరికి లోపల ఓ ఉత్తరం పడివుంది. ఆమె ఉత్తరం అందుకుని చూస్తే అది కల్పన దగ్గరనుండి వచ్చింది.

రేవతి ఉత్తరం విప్పింది.

ప్రియమైన రేవతీ!

నేను ఇక్కడ క్షేమం. అక్కడ నువ్వు క్షేమమని తలుస్తాను.

గుంటూరు వెళ్లగానే నిన్ను ఉత్తరం రాయమని చెప్పాను. నువ్వు ఉత్తరం రాశావో లేదో నాకు తెలియదు. ఎందుకంటే ఇప్పటివరకూ నాకే ఉత్తరం అందలేదు కాబట్టి. అందుకే నేనే ఉత్తరం రాస్తున్నాను.

ఆంటీకి సీరియస్ అని టెలిగ్రాం వచ్చింది కదా? తనకొచ్చిన అనారోగ్యం ఏమిటి? తనిప్పుడు ఎలా ఉంది? ఇప్పటివరకూ నువ్వు ఉత్తరం రాసి ఉండకపోతే ఆ వివరాలతో వెంటనే ఉత్తరం రాయి.

నువ్వు వెళ్లిన మర్నాడే, నేను మీ ఆఫీసుకు ఫోన్ చేసి విషయం చెప్పాను. టెలిగ్రాం విషయం విని మీ బాస్ చాలా బాధ పడ్డాడు. నీకు వీలయితే మీ బాస్ కి కూడా ఓ ఉత్తరం రాస్తే బాగుంటుంది.

అక్కడ నీకు డబ్బు ఇబ్బంది వుంటే మొహమాటపడకు. ఉత్తరంలో తెలియచేస్తే చాలు. వెంటనే నీకు డబ్బు అందే ఏర్పాటు చేస్తాను.

అయినా ఇంతకీ నువ్వు అక్కడ ఎన్నిరోజులు ఉండవలసి వస్తుంది. ఆంటీ ఆరోగ్యం కాస్త మెరుగ్గానే ఉంటే, ఆమెను కూడా ఇక్కడికి తీసుకొచ్చేస్తే బాగుంటుంది కదా? ఇక్కడ చిన్నగది అద్దెకు తీసుకుని, మీరిద్దరూ ఉండిపోవచ్చు. లేదంటే నేను కూడా మీ ఇంట్లో ముందు మనం అనుకున్నట్టుగానే పేయింగ్ గెస్ట్ గా ఉండిపోతాను. ఆంటీ, నువ్వు, నేను ఒకే ఇంట్లో ఉండడం... నాకెంతో ఇష్టమయిన కల అది. నా కల కల్లలా మిగిలిపోనివ్వవు కదా?

ఇక ఇక్కడ నువ్వు లేకపోవడంతో ఐదు రోజులకే నాకు చాలా బోర్ కొట్టేసింది. చుట్టూ అందరున్నా ఎవరూ లేరన్న ఫీలింగ్ కలుగుతోంది. ఏదేమయినా నువ్వు త్వరగా హైదరాబాద్ వచ్చేస్తే బాగుణ్ను.

ఇప్పటివరకూ ఉత్తరం రాయకుండా వుంటే, వెంటనే ఉత్తరం రాయి.

నీ ఉత్తరం కోసం ఎదురుచూస్తూ ఉంటాను.

కల్పన

రేవతి ఉత్తరం చదవడం పూర్తిచేశాక దీర్ఘంగా నిట్టూర్చింది. వచ్చినప్పటినుండి మనసు కుదుటపడకపోవడంతో ఫ్రెండ్ కి ఉత్తరం రాయాలన్న ఆలోచన కూడా రాలేదు. ఉత్తరం మడిచి పక్కన పెడుతూ మనసులోనే అనుకుంది.

ఆమె స్నానం చేసి, వంట చేసుకుని కల్పనకూ, ఆఫీసుకు ఉత్తరాలు రాయాలని నిర్ణయించుకుని సెంటర్ లో వున్న పోస్టాఫీస్ కి చేరుకుంది.

పోస్టాఫీసులో నాలుగు ఇన్ ల్యాండ్ లెటర్స్ తీసుకుని బయటకొచ్చి రోడ్డుమీద నిలబ

# ఏరినముత్యాలు

★ చెంచాడు ఆచరణ టన్నులకొద్దీ బోధన కన్నా విలువైనది.

–గాంధీ

★ జీవిత సమస్యను పరిష్కరించేది విద్య.

–గాంధీ

★ దుర్మార్గాన్ని సహిస్తే అది వ్యవస్థనే విషపూరితం చేస్తుంది.

–నెహ్రూ

★ ప్రజలు పాల్గొనని ఏ పోరాటం విజయంకాదు.

–మార్క్స్

★ మోకాళ్ళపై వంగిన నాగరికునికంటే తన కాళ్ళపై నిలబడిన కర్షకుడు మిన్న.

–ఫ్రాంక్లిన్

★ అసంఖ్యాక జీవితగాథల సారాంశమే చరిత్ర.

–థామస్ కార్లైల్

★ తెలివైనవాడు పుస్తకాలే కాదు జీవితాన్ని కూడా చదువుతాడు.

–ఇన్‌యుటాంగ్

★ మతం వేరైతే ఏమోయ్ మనసులొకటై మనుషులుంటే.

–గురజాడ

★ జీవితం నిరాడంబరంగాను, ఆశయాలు ఉన్నతంగా వుండాలి.

–ప్రేమ్‌చంద్

★ అవసరమైతే ప్రాణాలు అర్పించయినాగానీ నీ జాతి పతాకాన్ని గౌరవాన్ని కాపాడుకోవాలి.

–భగత్‌సింగ్

★ ఉన్నతుడైనవాడు ఎంత ఉన్నతపదవిలో వున్నా తాను గడ్డిపరకకన్నా హీనమని భావించుకుంటాడు.

–చైతన్య

★ అశాంతితో, ఆందోళనతో పాల్గొనే గొప్ప విందుకంటే, శాంతితో ఒక చిన్న రొట్టె ముక్క తినటం మేలు.

–ఈసఫ్

★ స్వర్గం, నరకం ఎక్కడో లేవు. నీ మనసులోనే వున్నాయి.

–రాజ్‌పాల్

★ కర్తవ్య నిర్వహణకు వ్యక్తిగత కారణాలు అడ్డు రాకూడదు.

–యాలిసిస్ గ్రాంట్

సేకరణ: నెక్కల చిరంజీవి

డింది. రిక్షాకోసం ఇటు చూస్తుంటే చాలా దగ్గరగా వచ్చిందో కారు.

తనముందు ఆగిన కారువైపు ఆమె అదోలా చూసింది.

అప్పుడే కారు డ్రైవింగ్ సీట్లోనుండి పక్క సీట్లోకి మారి డోర్‌లోనుండి తల బయటకు పెట్టి అడిగాడు రామ్మోహన్, "హలో రేవతి గారూ! ఇక్కడ నిలబడి ఉన్నారేంటి? "

ఆ సమయంలో అతడికి అలా ఎదురుపడటం కాస్త ఇబ్బందిగానే అనిపించింది. అయినా పెదవుల మీదకు నవ్వు పులుముకుని చెప్పింది "హాస్పిటల్‌కి వెళ్ళడానికి రిక్షా కోసం చూస్తున్నాను డాక్టర్"

"అలాగా, అయితే నో ప్రాబ్లమ్. నేను హాస్పిటల్‌కే వెళ్తున్నాను. రండి డ్రాప్ చేస్తాను"

అతను తన జవాబుకోసం ఎదురు చూడకుండానే ఫ్రంట్‌డోర్ తీయడంతో ఆమెకేం పాలుపోలేదు. అప్పటికే రోడ్డుమీద వెళ్తున్న ఒకరిద్దరు తమకేసే చూడడం గమనించింది. అందుకే కాస్త బిడియపడుతూనే చెప్పింది. "ఎందుకండీ రిక్షా దొరుకుతుంది. నేను వచ్చేస్తానులెండి"

"ఇప్పుడు నేను మీకోసం ప్రత్యేకంగా హాస్పిటల్ వైపు వెళ్ళడంలేదు. అటే వెళ్తున్నాను. అందులోనూ కారులో సీట్లన్నీ ఖాళీగానే ఉన్నాయి- ఒక్క డ్రైవింగ్ సీటు తప్ప. కాబట్టి డ్రాప్ చేస్తానుగానీ మొహమాట పడకుండా రండి"

అతడు గౌరవనీయమయిన వృత్తిలో వున్నవ్యక్తి. తన తల్లికి చాలా హెల్ప్ చేశాడు. నిజానికి అతడు తనను పలకరించడమే ఒక విశేషంగా చెప్పుకోవాలి. అందుకే తను ఆనందపడాలే తప్ప భయపడాల్సిన అవసరమేముంది?

ఆమె మరేం మాట్లాడకుండా కారెక్కింది. అతడు కారు ముందుకు పోనిచ్చాడు.

కారు కొద్దిదూరం వెళ్ళాక అతడు తల తిప్పి ఆమెకేసి చూస్తూ ప్రశ్నించాడు. "హాస్పిటల్‌లో మీ అమ్మగారికి సహాయంగా ఎవరున్నారు? "

"ఎవ్వరూ లేరు"

"సాయికృష్ణగారు? !"

"ఆయన సాయంత్రం వస్తారు. ప్రస్తుతం పక్కబెడ్‌వాళ్లను కాసేపు చూస్తుండమని చెప్పివచ్చాను"

"ఇలాంటి సమయాలలో మీరు డ్యూటీ నర్స్‌కి చెప్పండి. వాళ్ళకు నేను మీ గురించి చెప్పి ఉన్నాను. అన్నివేళలా వాళ్ళు మీకు సహాయం చేస్తారు"

"అలాగే అవసరపడితే వాళ్ళ సహాయం తీసుకుంటాను"

అతడు తలతిప్పుకుని కారు డ్రైవింగ్‌మీద కాన్‌సన్‌ట్రేషన్ చేసి రోడ్డుమీద దృష్టి నిలిపాడు. ఇద్దరిమధ్యా కొద్దిక్షణాలు నిశ్శబ్దం.

ఈసారి అతడు తలతిప్పకుండానే రోడ్డుకేసి చూస్తూ అన్నాడు, "చాలా చిన్నవయసులోనే మీకు చాలా పెద్ద కష్టం వచ్చిపడింది రేవతిగారూ"

"కన్నతల్లికి సేవచేయడం కష్టం ఎందుకవుతుంది డాక్టర్? "

అతడు మెల్లగా తల తిప్పాడు. ఆమెను ఓరగా చూస్తూ అన్నాడు. "అయితే ఇది మీకు కష్టంగా అనిపించడం లేదా? "

"లేదు డాక్టర్! ఎందుకంటే ఓ కవి అన్నట్టు, ఈ సృష్టిలో అమ్మ అన్నపదమే ఓ తియ్యని మాట. అది ఎన్నెన్నో జన్మల మమతల మూట.

"తల్లి తన గర్భంలో శిశువును తొమ్మిది నెలలు మోస్తుంది. ఆ సమయంలో ఆమె కడుపు లోపల శిశువుచేసే అల్లరిని భరిస్తుంది. వాడు పెట్టే కష్టాన్ని కూడా భరిస్తుంది. ప్రసవవేదన సమయంలో ఆమె మృత్యువు అంచులవరకూ వెళ్ళాల్సిరావచ్చు. అలా కాకున్నా ఆ సమయంలో ఆమె వేదన దారుణంగా ఉంటుంది. చివరికో బిడ్డకు జన్మనిస్తుంది. ఆడపిల్లయితే కన్నెపిల్లగా ఉన్నప్పుడు ఊహాలోకంలో విహరిస్తుంది.

పెళ్లయ్యాక కష్టసుఖాలు తెలిసొస్తాయి. కాని ఆమె తల్లయ్యాకే ఆమెకు వాస్తవ ప్రపంచం అర్థమవుతుంది. అప్పటివరకూ 'అసహ్యం' అనుకున్నవి దగ్గరయినా విసుక్కోదు. పసివాడు విసర్జించే మలమూత్రాదులను ప్రేమతో తొలగిస్తుంది. ఆ పసివాడికి చిన్న కష్టం కలిగినా తనే తల్లడిల్లిపోతుంది. వాడికి అనారోగ్యం కలిగితే తను భోజనం, నిద్ర మానేస్తుంది. వాడు కనుపాప అయితే తను రెప్పలా మారుతుంది. వాడు ఏడిస్తే అది తనకు ఏడుపు, వాడు నవ్వితే అది తనకూ నవ్వే. వాడి సంతోషం తన సంతోషం. వాడి దుఃఖం తన దుఃఖం. అప్పటినుంచే తల్లికి తనదంటూ ఏమీ మిగలదు. పిల్లలతోనే ఆమె బతుకు ముడిపడిపోతుంది. ఆమె ప్రపంచంలో ఉండేది వాళ్లే. త్యాగాలపర్వం మొదలవుతుంది. అమ్మానాన్నలు బిడ్డలకోసం ఎంత కష్టపడతారు. వాళ్ళకోసం తమ సర్వం త్యాగం చేస్తారు. అయితే బిడ్డలపట్ల తల్లిదండ్రులు చూపించే ప్రేమలో తండ్రికన్న, తల్లి ప్రేమ కాసింత ఎక్కువశాతం ఉంటుందన్నది నిజం. మరి బిడ్డలకోసం అంతగా త్యాగాలు చేసే తల్లిదండ్రులకు ఆ బిడ్డలు ఏవిధంగా రుణం తీర్చుకోగలుగుతున్నారు. అంటే ఇక్కడ ఆ తల్లిదండ్రులు బిడ్డలను పెంచడం వాళ్ళకు రుణం ఇవ్వడంలా భావించడంలేదు. వాళ్ళ ప్రేమ నిస్వార్థమైంది. మరి నిస్వార్థంగా ఎలాంటి ప్రతిఫలాపేక్ష లేకుండా వాళ్ళు అందించిన అపురూపమైన ప్రేమను అందుకున్న ఆ బిడ్డలు తల్లిదండ్రులకు కనీసం కృతజ్ఞతగానైనా తిరిగి ఏమయినా చేయగలుగుతున్నారా? నేటి మన ఉనికికి కారణమైన తల్లిదండ్రులకు కష్టకాలంలో సేవచేయడం కష్టంగా భావించడం చాలా దారుణమైన విషయం"

కారు చిన్నగా వూగి ఆగింది. రేవతి చెప్పడం ఆపి చుట్టూ చూసింది. కారు హాస్పిటల్ ఆవరణలో ఆగివుంది.

రేవతి చుట్టూ పరిశీలనగా చూడడం గమనించిన రామ్మోహన్ నవ్వుతూ అన్నాడు, "తల్లిదండ్రుల పట్ల బిడ్డలు చూపించాల్సిన బాధ్యత గురించి చెప్పడం మొదలెట్టాక మిమ్మల్ని మీరు మరచిపోవడమే కాదు. పరిసరాలూ గమనించడం మానేశారు. మనం ఇప్పుడు హాస్పిటల్‌కి చేరుకున్నాం రేవతిగారూ"

ఆమె కాస్త సిగ్గుపడింది. డోర్ తెరుచుకుని దిగబోతుంటే అతడిగొంతు వినిపించింది "వన్ మినిట్"

అతడు ఆమె చూపులో చూపు కలిపి చెప్పాడు. "మీ మాటలు నాకు చాలా బాగా నచ్చాయి. నా చిన్ననాటి సంఘటనలు నా కళ్లముందు కదలాడేలా కూడా చేశాయి మీ మాటలు. ఏదేమయినా మీ భావాలు మెచ్చుకోకుండా ఉండలేకపోతున్నాను"

రేవతి చప్పున తల తిప్పుకుని డోర్ తెరుచుకుని కిందికి దిగింది.

అతడూ డ్రైవింగ్ సీట్లోనుండి కిందికి దిగి కారు డోర్ లాక్‌చేశాడు.

ఇద్దరూ ముందుకు నడుస్తున్నప్పుడు ఆమె అతడితో అంది. "అమ్మంటే నాకు చాలా ఇష్టం డాక్టర్! మా అమ్మ అంటేనే కాదు, 'అమ్మ' పదమంటేనే నాకెంతో ఇష్టమనుకుంటా, అందువల్లే కాబోలు నా ఎదురుగా ఏ తల్లికయినా బిడ్డలు అన్యాయం చేస్తూవుంటే చూస్తూ వూరుకోలేను కూడా. అలాటి టాపిక్ వచ్చినా నేను కాస్త కంట్రోల్ తప్పి మాట్లాడతాను. సో! కారులో నేను కాస్త ఎక్కువగా మాట్లాడి వుంటే ఐయామ్ సారీ"

అప్పటికే వాళ్ళిద్దరూ కారిడార్ చివరకు చేరుకున్నారు. ఓవైపు వెళ్తే జనరల్ వార్డ్ వస్తుంది. మరోవైపు డాక్టర్స్ కన్సల్టింగ్ రూమ్స్ ఉన్నాయి.

అతడు ఆగాడు. ఆమె కూడా ఆగిపోయింది.

డాక్టర్ రామ్మోహన్ ఆమెకేసి చిరున





వ్వుతో చూశాడు. అతడి కళ్లలో ఆ క్షణం మరేదో భావం కనిపించిందిగానీ, ఆ భావం ఏమిటో ఆమెకు అర్థంకాలేదు.

"సారీ చెప్పాల్సినంత తప్పు మీరేం చేశారు? నిజం చెప్పాలంటే మీ మాటలు నాకెంతగానో నచ్చాయి. ఇంకా చెప్పా లంటే..." అతడు ఏదో చెప్పబోయి తనను తాను కంట్రోల్ చేసుకుంటున్నట్టుగా మాట మార్చాడు. "ఉంటానండి" అతడు వడిగా ముందుకెళ్ళిపోయాడు.

అతడు ఉన్నట్టుండి అలా తడబడడమెం దుకో ఆమెకు అర్థం కాలేదుగానీ, అతడి మాటలు, చూపులు కాస్త కొత్తగా ఉన్నా యన్న విషయం మాత్రం అర్థమయి పోయింది. అయితే అతడిని తప్పుగా అర్థం చేసుకోవడం భావ్యం కాదనిపించింది.

రేవతి కొద్దిక్షణాలు అక్కడే నిలబడిపో యాక తల విదిలించి మరోవైపుకి నడి చింది.

వార్డ్‌లోకి వెళ్లి చూస్తే తల్లి గాఢనిద్రలో ఉంది. తల్లికి నిద్రాభంగం కలగకుండా ఆమె బెడ్ పక్కన స్టూల్ మీద కూర్చుంది.

పక్క బెడ్ పేషెంట్ తాలూకు వ్యక్తి ఆమెతో చెప్పాడు. "మీరు ఇంటికెళ్లిన తర్వాత మీ అమ్మగారోసారి మేల్కొన్నారు. ఆమెకు అర్థమయ్యేలా మీరు ఇంటికెళ్లిన విషయం చెప్పాం. ఆమె అంతలోనే మళ్లీ నిద్రపోయింది.

రేవతి తలాడించింది.

కొద్దిక్షణాలు నిశ్శబ్దంగా కూర్చున్నాక ఆమె ఇన్‌ల్యాండ్ లెటర్స్ తీసుకుని రాయడం మొదలెట్టింది.

ముందుగా ఆఫీసుకి లెటర్ రాసింది. అందులో తన బాస్‌కి ఇక్కడి పరిస్థితి తెలి యచేస్తూ తనిక హైదరాబాద్ రావడం కష్ట మేనని తెలియచేసింది. వర్క్‌కి ఇబ్బంది కలగకుండా మరొకరిని అపాయింట్ చేసు కుంటే మంచిదేమోనని రాసేసింది.

ఆ తర్వాతి ఉత్తరం కల్పనకు.

"డియర్ కల్పనా!..." అని రాశాక ఆమె కొద్ది క్షణాలపాటు తల పైకెత్తి ఆలోచిస్తూ ఉండిపోయింది.

ఏంరాయాలి? తన భవిష్యత్తు ప్రణాళి కను గురించి ఎలా తెలియచేయాలి?

నిజం చెప్పాలంటే ఇప్పుడు తన భవి ష్యత్ అగమ్యగోచరంగా ఉంది. అలాంట ప్పుడు ఏమని రాయడం?

కొద్దిక్షణాలు ఆలోచించాక తనకు తోచిందే రాయసాగింది.

"... ఇక్కడ నేను క్షేమం. అక్కడ నువ్వు క్షేమమేనని తలుస్తాను.

"నీవు రాసిన ఉత్తరం అందింది. చదివి చాలా ఆనందించాను.

"ఇంతకుముందు అమ్మ తాలూకు హడా విడిలో ఉత్తరం రాయలేకపోయాను. ఇదిగో ఇప్పుడు కాస్త ప్రశాంతత చిక్కాక నీనుండి వచ్చిన ఉత్తరం ఇచ్చిన ఆనందంతో ఈ ఉత్తరం పూర్తి చేయగలుగుతున్నాను.

"ఇంతకీ అమ్మకు ఏమయిందో నీకింతవ రకూ తెలియచేయలేదుకదూ! అమ్మకు పెరాలసిస్ స్ట్రోక్ వచ్చింది. అదే పక్షవాతం. కాలూ, చెయ్యీ పడిపోయాయి.

"అమ్మ ఇంకా హాస్పిటల్‌లోనే ఉంది.

"నాకేమో ఏమీ తోచడంలేదు. ఏంచే యాలో పాలుపోవడం లేదు. ఏదో... ఏదో తెలియని భయం నాలో మెల్లమెల్లగా పెరి గిపోతోందే కల్పనా!

"అయితే ఆ భయం భవిష్యత్ గురించి మాత్రం కాదు. ఎందుకంటే అమ్మను మించిన లోకం నాకు మరోటిలేదు. అమ్మ హాస్పిటల్లో వున్నా ఇంట్లో వున్నా ఆమెకు ఏకష్టం కలగకుండా నేను చూసుకోగలను. ఆమె మంచంమీద ఇలాగే వున్నా నేను ఆమెను పువ్వుల్లో పెట్టి చూసుకుంటాను. ఆమెను సంతోషంగా పోషించగలను

"మరి నాకిక భయమేంటి? నా భయ మంతా అమ్మ గురించేనే!

"అమ్మకు నేనంటే విపరీతమయిన

ప్రేమ. ఆమె ఇంకా పూర్తిగా మన లోకం లోకి రాలేదుగానీ వచ్చాక తన పరిస్థితి అర్థం చేసుకుంటే చాలా చాలా బాధపడిపో తుంది. తను నాకు భారంగా తయారయ్యా నని ఆమె అనుకుంటే అసలు తట్టుకోలేదు. అదిగో అదే... అదే... నా భయం

"అమ్మా! నువ్వు నాకు భారం కాదు. నిన్ను నా గుండెల్లో దాచుకుని పోషించ డమే నాకెంతో ఇష్టమని నాకు చెప్పాలని వుంది చెపుతాను కూడా.

"సో! ఇదీ ఇక్కడ పరిస్థితి.

"నువ్వేమో అమ్మను తీసుకుని హైదరా బాద్ వచ్చేయమని రాశావ్. ఇలాంటి పరిస్థి తుల్లో అమ్మను కదిలించడం ఎలా సాధ్యం? అయినా నేనిక హైదరాబాద్ రాగ లనా? ఏమో ఆ విషయం గురించి కూడా నేనిప్పట్లో ఏమీ ఆలోచించలేను.

"ఈ ఉత్తరంతోపాటే మా ఆఫీసుకి లెటర్ రాశాను. వాళ్లను కొత్త కంప్యూటర్ ఆపరేట ర్ని పెట్టుకోమంటూ సూచించాను.

"నువ్వు ఈ ఉత్తరం అందిన వెంటనే రిప్లయ్ రాయి. నేను నీ రిప్లయ్ కోసం ఎదురు చూస్తుంటాను. అంతేకాదు వీల యితే నువ్వు ఇక్కడికి వస్తే మరింత సంతో షిస్తాను.

ఇట్లు
రేవతి"

రేవతి రెండు ఉత్తరాలూ మడిచి హేండ్ బ్యాగ్‌లో పెట్టుకుంది.

శారదమ్మను హాస్పిటల్‌కి తీసుకొచ్చి అది పదో రోజు.

ఆ రోజు సాయంత్రం డిశ్చార్జ్ చేస్తానని డాక్టర్ రామ్మోహన్ చెప్పి ఉండడంతో ఇంటి కెళ్లేందుకు రేవతి అన్నీ సర్దేసింది. ఆమెకు సహాయంగా సాయికృష్ణ కూడా వచ్చాడు.

రామ్మోహన్ శారదమ్మను ఫైనల్‌గా చెకప్ చేశాక రేవతితో చెప్పాడు "మీ అమ్మ గారిని ఇంక ప్రత్యేకించి హాస్పిటల్‌లో ఉంచాల్సిన అవసరంలేదు. మీరు ఇంటికి తీసుకెళ్లిపోయి వేళకు మందులు ఇచ్చి వ్యాయామాలు చేయిస్తూ కాసిన్ని జాగ్రత్తలు పాటిస్తే ఆవిడ త్వరగా కోలుకుంటుంది"

"అలాగే డాక్టర్" తలాడించింది రేవతి.

"అయితే నేను వెళ్లి ఆటో తీసుకొస్తాను" అంటూ సాయికృష్ణ బయటకు వెళ్లబోతుంటే రామ్మోహన్ అతడిని ఆపి చెప్పాడు "ఆటో అవసరం లేదులెండి. నా డ్యూటీ కూడా అయిపోయింది. నేనెలాగూ ఇంటికే వెళ్తు న్నాను కాబట్టి మిమ్మల్ని మీ ఇంటి దగ్గర డ్రాప్ చేసి వెళ్తాను రండి"

"మీకు శ్రమ ఎందుకండి. మేము ఆటో తెచ్చుకుంటాం" కాస్త ఇబ్బందిగా ముఖం పెట్టి అంది రేవతి.

"ఇందులో ప్రత్యేకించి శ్రమ తీసుకోవడం ఏమీలేదు. నేను వెళ్లేది ఎలాగూ అదే దారి. జస్ట్ మిమ్మల్ని ఇంటి దగ్గర దించేసి అటే వెళ్లిపోతాను"

రేవతి మరేం మాట్లాడలేకపోయింది.

"వన్ మినిట్" రామ్మోహన్ అక్కడినుండి వెళ్లి ఐదు నిముషాల తర్వాత తిరిగొచ్చాడు. అతడి చేతిలో కొన్ని మందులున్నాయి. అవి రేవతికి అందిస్తూ అన్నాడు, "ఇవి నాకొచ్చిన శాంపిల్స్ మీ అమ్మగారికి ఉపయోగపడ తాయి తీసుకోండి"

రేవతి అతడికేసి కృతజ్ఞతగా చూసింది. నిజానికి అతడు తమకు పరిచయం కాకుంటే తను ఆ హాస్పిటల్‌లో చాలా ఇబ్బందులు ఎదుర్కోవలసి వచ్చి ఉండేది. గవర్నమెంటు ఆసుపత్రిలో నర్సులు కూడా మాట వినరు. ప్రతి చిన్న పనికి మామూళ్లు ఇవ్వడం సర్వసాధారణం. కాస్తోకూస్తో డబ్బు ఖర్చు పెట్టకుంటే ట్రీట్‌మెంట్ సరిగ్గా ఉండదు. తమకు ఓ ఖరీదైన ప్రవేట్ హాస్పి టల్ లో ఉన్నంత సౌకర్యం ఇక్కడ దొరికిం దంటే అందుకు కారణం అతడే. హాస్పిటల్ లోని ఉచిత మందులు ఇప్పించడంవల్ల చాలా తక్కువ ఖర్చుతోనే తాము అక్కడి నుండి బయటపడగలుగుతున్నారు.

"పదండి" అన్నాడు రామ్మోహన్.

వార్డ్‌బోయ్ వీల్‌చెయిర్ తోసుకొచ్చాడు. సాయికృష్ణ, రేవతి కలిసి శారదమ్మను బెడ్ మీద నుండి దించి వీల్ చెయిర్‌లో కూర్చో బెట్టారు. వార్డ్‌బోయ్ వీల్ చెయిర్ నెట్టు కుంటూ కారు దగ్గరకు తీసుకొచ్చాడు.

ఈసారి రామ్మోహన్ కూడా సహాయం చేశాడు. శారదమ్మను కారులో కూర్చోబె ట్టారు.

రేవతి వార్డ్‌బోయ్‌కి డబ్బు లివ్వబోతుంటే అతడు తీసుకోలేదు. రామ్మోహన్ వంక ఇబ్బందిగా చూశాడు.

రామ్మోహన్ తల తిప్పుకోవడంతో రేవతి పది రూపాయలు వార్డ్‌బోయ్ చేతిలో పెట్టింది. అది తిట్టుకుంటూ ఇచ్చిన మామూలు కాదు. ఆనందంగానే అందిం చింది.

రేవతి కారెక్కాక రామ్మోహన్ డ్రైవింగ్ సీట్లో కూర్చుని కారు ముందుకు పోని చ్చాడు.

పావుగంట తర్వాత కారు ఆ ఇంటి ముందు ఆగింది.

ముగ్గురూ కలిసి శారదమ్మను లోపలికి తీసుకెళ్లి మంచం మీద పడుకోబెట్టారు.

శారదమ్మ చూపులతోనే సాయికృష్ణకు, రామ్మోహన్‌కి కృతజ్ఞతలు చెప్పుకుంది. ఇప్పుడిప్పుడే ఆమెకు కళ్లతో మాట్లాడగలిగే శక్తి వస్తోంది.

రామ్మోహన్ ఆ ఇంటిని ఓసారి పరిశీల నగా చూశాక వెళ్లడానికి ఉద్యుక్తుడవుతూ ఉంటే రేవతి అంది, "డాక్టర్! ఒక్క ఐదు నిముషాలు కూర్చోండి. కాఫీ పెట్టుకొస్తాను"

"ఇప్పుడు కాఫీ ఎందుకండి? "

"ఫర్వాలేదు కూర్చోండి" ఆమె రామ్మో హన్, సాయికృష్ణలకు కుర్చీలు చూపిం చింది.

ఇద్దరూ కుర్చీల్లో కూర్చున్నారు.

రేవతి హాస్పిటల్ నుండి వచ్చేముందే పాల ప్యాకెట్ తీసుకుని ఉంది. అందువల్ల పాలకు ఇబ్బంది లేకుండా పోయింది.

ఐదు నిముషాలు తర్వాత ఆమె కాఫీ గ్లాసులు తెచ్చి వారిద్దరికీ అందించింది.

రామ్మోహన్ కాఫీ తాగాక లేస్తూ ఆమెతో చెప్పాడు, "ఎలాగూ హాస్పిటల్‌కి వెళ్లేది ఈ రూట్‌లోనే కాబట్టి అప్పుడప్పుడు వచ్చి మీ అమ్మగారిని చూసి వెళ్తుంటానులెండి"

"థాంక్యూ డాక్టర్"

ఆమె అతడి వెంట వీధిగేటు వరకూ వెళ్లింది. రామ్మోహన్ కారెక్కి ఆమెకు చెయ్యి ఊపి ముందుకు సాగాడు.

రేవతి వెనుతిరిగి ఇంట్లోకి నడిచింది.

సాయికృష్ణ ఎదురుగా కుర్చీలో కూర్చుని అతడితో అంది. "రామ్మోహన్‌గారు పరి చయం కాకపోతే మనం హాస్పిటల్‌లో చాలా ఇబ్బంది పడి ఉండేవాళ్లం"

అతడు "అవును" అన్నాడు క్లుప్తంగా.

మరి కాసేపటికి అతడూ "నేను మళ్లీ కలుస్తాను" అంటూ ఆమెకు చెప్పి ఇంట్లో నుండి బయటకు నడిచాడు.

అప్పుడే పక్కింటి కరుణమ్మ, ఇరుగుపొ రుగు వచ్చి శారదమ్మను చూసి రేవతికి ధైర్యం చెప్పి వెళ్లసాగారు.

అలా ఓ రెండు గంటలు గడిచింది.

ఆ ఇంట్లో తామిద్దరే మిగిలారు. నిశ్శబ్దం తమకు తోడయింది. ఆమె అన్నం వండింది. అన్నాన్ని జావలా చేసి తల్లి చేత తాగించింది.

మందులు మింగిన కాసేపటికి శారదమ్మ మత్తుగా నిద్రలోకి జారుకుంది.

తర్వాత రేవతి స్నానం చేసింది. కాసింత తిని మంచం మీద వాలింది.

గది మధ్యకు తగిలించి ఉన్న ట్యూబ్ లైట్ కాంతిని కురిపిస్తోంది. కాని తనకు మాత్రం ఎటువైపు అడుగెయ్యాలో తెలియ నంతగా భవిష్యత్ గాఢాంధకారంలో చిక్కు కుపోయి ఉంది.

మొన్నటివరకు తనకో చిరు ఆశ ఉండేది. తనకు హైదరాబాద్‌లో కాస్త మంచి ఉద్యో

గమే ఉంది. త్వరలో తల్లిని కూడా అక్కడికే తీసుకుపోయి తనతో ఉంచుకుని ఇద్దరూ కలిసి జీవించొచ్చు. ఇకనుండి అమ్మకు మరే శ్రమా లేకుండా ఆమెను కూర్చోబెట్టి పోషించవచ్చు.

హాస్టల్‌లో తీరిగ్గా కూర్చున్నప్పుడు కల్పనకూ, తనకూ మధ్య ఓసారి ఈ టాపిక్కే చర్చకు వచ్చింది.

"అమ్మను తీసుకొచ్చుకుంటానంటున్నావ్. ఇద్దరం కలిసి హాయిగా బతికేస్తామంటున్నావ్. మరి నువ్వు జీవితాంతం మీ అమ్మతోనే బతికేస్తావేంటే రేవతీ?" అంది కల్పన.

"నువ్వనేదేమిటో నాకర్థం కావడంలేదు"

కల్పన అదోలా చూసింది. "ఇప్పుడు నీ వయసెంత రేవతీ?"

"ఇరవై రెండేళ్లు"

"ఇప్పటికీ అమ్మ కూచిలా అమ్మను తెచ్చుకుంటా, అమ్మా నేను కలిసి ఉంటాం అంటున్నావేగానీ మొగుడి మాటలు, కబుర్లు ఎప్పటికి చెపుతావో నాకయితే అర్థం కావడంలేదు"

ఆ మాటలకు ప్రతి ఆడపిల్ల సిగ్గుపడ్డట్టే తనూ సిగ్గుపడింది. బహుశా బుగ్గలు కూడా ఎరుపెక్కి ఉండొచ్చు. అయితే అది కొద్ది క్షణాల కాలం మాత్రమే. వెంటనే తను సర్దుకుంది.

ఆ క్షణం తనకు సాయికృష్ణ గుర్తుకొచ్చాడు. అతడికి తనంటే చాలా ఇష్టం. కానీ... కానీ ఏ మగాడయినా భార్యను తనింటికి తీసుకెళ్లాలనుకుంటాడుగానీ భార్యతోపాటు అత్తగారినీ వెంటబెట్టుకుని వెళ్లాలని అనుకోడు. మరి తన తోడు లేకపోతే అమ్మ ఉండగలదా! ఆమె వయసు యాభై ఏళ్లే కాబట్టి మరో పది పదిహేనేళ్లు ఒంటరిగా బతకగలుగుతుంది. ఆమె ఒంటరిగా బతకగలిగి ఉండొచ్చు. అయినా ఆమెను




ఒంటరిగా వదిలేసి తను అత్తారింటికి వెళ్లి పోగలదా?

"ఏమిటే... మాట్లాడవేంటి?" కల్పన తనను కుదిపింది.

"ఏమోనే! ప్రస్తుతానికి అమ్మ సుఖం కోసం ఆమెకు ఆసరాగా ఉండడంకోసం పెళ్లి ఆలోచనను పక్కన పెడుతున్నాను. రేపు ఏం జరుగుతుందో నాకే తెలియదు"

అలా ఆ రోజు తను ఆ టాపిక్‌ని కట్ చేసింది.

కానీ ఆలోచనల్లో నుండి భవిష్యత్ గురించిన బెంగ తొలగిపోలేదు. అందులోనూ తన తల్లికి తను ఏం చేయగలదన్న ఆలోచన అనుక్షణం మనసులో కదలాడుతూనే ఉండేది.

తల్లిదండ్రులు కొడుక్కి పెళ్లి చేస్తే కోడలిని ఇంటికి తీసుకొచ్చుకుంటారు. ముసలితనం మీదపడి మంచానపడ్డప్పుడు అత్తమామలను చూసుకోవలసిన బాధ్యత ఆ ఇంటి కోడలిది. కానీ కూతుళ్లు మాత్రమే కలిగిన తల్లిదండ్రులు ఆ కూతుళ్లను అత్తారింటికి పంపించేస్తే వృద్ధాప్యంలో వాళ్లను చూసుకునేదెవరు?

తల్లికి తనొక్కత్తే కూతురు. మరి తను పెళ్లి చేసుకుని అత్తారింటికెళ్లిపోతే ఆ తల్లి పరిస్థితి ఏమిటి? ఆమె కొద్దికాలం సంపాదించుకో గలుగుతుంది. ఆ తర్వాత సంపాదించుకునే శక్తి కూడా లేకుండా పోతుంది. ఇక ప్రస్తుతం తల్లి పరిస్థితి మరింత దారుణం. ఇలాంటి పరిస్థితిలో ఆమెకు ఓ తోడు అవసరం.

ఇలాంటి పరిస్థితే అనికాదు, వృద్ధాప్యంలో ప్రతిమనిషి తోడు కోరుకుంటాడు. ఆ తోడు జీవిత భాగస్వామి అయితే సంతోషమే. లేకపోతే కనీసం తన బిడ్డలయినా తనకు తోడు ఉండాలి.

మరి తను పెళ్లి చేసుకుని వెళ్లిపోతే తన

తల్లికి వృద్ధాప్యంలో సేవచేసే తోడు లేకుండాపోతుంది. ఇలాంటి పరిస్థితిలో అంతకన్నా ఘోరమయిన స్థితి మరొకటి ఉండదు.

మనిషి పాపపుణ్యాలు ఇలాంటి సమయాల్లోనే తెలిసిపోతాయంటారు. ఒక మనిషి వృద్ధాప్యంలో ఎలాంటి అనారోగ్యం లేకుండా హఠాత్‌గా మరణిస్తే అది ఆ వ్యక్తిపుణ్యం అనుకోవచ్చు. మంచాన బడితే అది ఈ జన్మది కాకపోయినా పూర్వజన్మ పాపం అని సరిపెట్టుకుంటారు. పాపపుణ్యాల సంగతి పక్కనపెట్టినా వృద్ధాప్యంలో మనిషి మంచానపడడంతోనే నరకం మొదలవుతుంది. నరకంలోనూ తోడుగా ఉండడమే నిజమైన అనుబంధం.

అనుబంధాలు, ఆప్యాయతలు మెల్లమెల్లగా కరిగిపోతున్న ప్రస్తుత పరిస్థితుల్లో కనీసం కొద్దిమందయినా ఆ బంధాల కోసం ఎంతో కొంత త్యాగం చేయవలసి వుంది.

ఒకప్పుడు తను తన తల్లికి కొంత కాలమయినా దూరంగా వుండే అవకాశం వుండేది. కాని ఇప్పుడు ఒక్క రోజు కాదు ఒక్క గంటయినా తల్లిని వదిలి వుండే పరిస్థితి లేదు. కనీసం ఉదయం వెళ్లి సాయంత్రం వరకూ ఉద్యోగం చేసుకుని వచ్చే అవకాశం తనకిక వుండబోదు.

మరి తనిప్పుడేం చేయాలి?

భవిష్యత్ గురించి ఆలోచనకన్నా ముందు తామిద్దరి పోషణకోసం ఏదో ఒక మార్గం చూసుకోవాలి. ఆ మార్గం తల్లిని విడిచి దూరంగా వెళ్లేదిగా ఉండకూడదు. ఇంట్లోనే వుండి చేసుకునేదిగా వుండాలి.

ఇంట్లోనే వుండి చేసుకోగలిగేది, ఇంటిపని తప్ప మరేం ఉంటుంది? అలాంటి ఉపాధి మార్గం ఏమీ లేదనుకుంటా.

ఆమెకు చాలా నిరాశగా అనిపించింది. అప్పుడే భవిష్యత్ గురించి భయమూ కలిగింది.

నిరాశగా ఆమె తల అటూఇటూ తిప్పి చూస్తుంటే చప్పున కళ్లబడిందా వస్తువు.

సూయింగ్ మిషన్

రేవతి మంచం దిగి అటువైపు అడుగులేసింది.

ఆ సూయింగ్ మిషన్ మీద చెయ్యివేసి కొద్దిక్షణాలపాటు అలాగే నిలబడిపోయింది.

ఏదో తెలియని అనుభూతి శరీరమంతా పాకింది. ఆ అనుభూతి తన కర్తవ్యాన్ని తనకు గుర్తుచేసింది. అప్పుడే నిరాశ ఎగిరిపోయి ఆ స్థానంలో ఉత్సాహం చోటుచేసుకుంది.

అప్పుడెప్పుడో తల్లికి సహకరించడం కోసం తను కుట్టుపని నేర్చుకుంది. ఆ పనిలో తను పర్‌ఫెక్ట్ అనే చెప్పొచ్చు.

సో! ఇప్పుడు ఆ కుట్టు పనినే జీవనాధారంగా చేసుకుంటే ఎలా వుంటుంది?

ఆలోచించగా అంతకుమించిన మార్గం మరొకటి లేదనిపించింది.

చివరికి ఆమె ఓ నిర్ణయానికి వచ్చేసింది.

అప్పుడే మనసులో కదలాడిన భావం ఆమెను నవ్వుకునేలా చేసింది. బిడ్డను పోషించడంకోసం దారీతెన్నూ తోచని ఓ తల్లి ఈ కుట్టుమిషన్‌నే ఆధారం చేసుకోవాలి. ఇక నుండి తను ఆ కుట్టుమిషన్ మీదే పని చేయబోతుంది.

అయినా ఆమెకు సంతృప్తిగానే అనిపించింది.

ఆ సంతృప్తితో ఆమె ఆ రాత్రి ప్రశాంతంగా నిద్రపోయింది.

★ ★ ★

"నువ్విలా చేయడం నాకయితే నచ్చలేదు రేవతీ"

రేవతి తల తిప్పి సాయికృష్ణ ముఖంలోకి చూసింది. "ఎందుకని? "

"నువ్వు డిగ్రీ చదువుకున్నావ్. కంప్యూటర్ నేర్చుకున్నావ్. నీ క్వాలిఫికేషన్స్‌కి హైదరాబాద్‌లో మూడు వేలు వచ్చేది, ఇక్కడ రెండు వేలయినా ఇస్తారు. అలాంటప్పుడు నువ్వు ఈ కుట్టుమిషన్ పని




ఎందుకు పెట్టుకున్నావో నాకయితే అర్థం కావడంలేదు" సాయికృష్ణ ముఖంలో అసహనం కదలాడుతోంది.

రేవతి చిన్నగా నవ్వింది. "నువ్వు చెప్పింది కరక్టే కాదనడం లేదు. నాకు రెండు వేల రూపాయల జీతం ఇచ్చేవాళ్లు నన్ను ఇంట్లో కూర్చుని పని చేసుకోమని చెప్పరుకదా? "

"ఇంట్లో కూర్చోవడం ఎందుకు? " అతడు ఆశ్చర్యంగా, అనుమానంగా చూశాడు.

"అమ్మను ఎవరు కనిపెట్టుకునుంటారు? "

అప్పుడర్థమయింది అతడికి. అతడీసారి ఆమెకేసి జాలిగా చూశాడు. అయితే ఆమె నిర్ణయంపట్ల ఆనందాన్ని వ్యక్తం చేయలేక పోయాడు.

మంచంమీద జీవచ్ఛవంలా పడివున్న శారదమ్మ వారిద్దరికేసి చూస్తోంది. కేవలం చూడగలదేతప్ప వాళ్ల సంభాషణలో పాలు పంచుకునే శక్తి ఆవిడకులేదు.

అతడి ముఖంలోకి కొద్ది క్షణాలు తదేకంగా చూసిన రేవతి "కాఫీ పెట్టుకొస్తాను. తాగుతూ మాట్లాడుకుందాం కూర్చో" అంది.

సాయికృష్ణ మరేం మాట్లాడలేదు. ఆమె పెరట్లోకి నడిచింది.

పాలగిన్నె స్టౌమీద పడేసి అక్కడే కూర్చుండిపోయింది. అప్పుడే సాయికృష్ణ తాలూకు ఆలోచనలు ఆమెను చుట్టుముట్టాయి.

సాయికృష్ణ మండల రెవెన్యూ ఆఫీస్‌లో క్లర్క్‌గా పని చేస్తున్నాడు. నెలకు నాలుగు వేలు జీతం. నిజానికి అతడు ఉద్యోగం చెయ్యడం కేవలం కాలక్షేపం కోసమేనేమో అనిపిస్తుంటుంది. వాళ్ల కుటుంబానికి స్థిరచరాస్తులు ఎక్కువగానే వున్నాయి. సాయికృష్ణ తండ్రి కుటుంబరావుకి మెయిన్‌రోడ్‌లో పెద్ద బట్టలషాపు ఉంది. అతడి అన్నలిద్దరిలో ఒకరు మూడు లారీలు కొనుక్కోగా మరొకరు ఆటోమొబైల్ షాపు పెట్టుకుని ఉన్నారు. సాయికృష్ణ అడిగితే అతడికీ ఏదో పెద్ద వ్యాపారమే పెట్టించి ఇవ్వగలడా తండ్రి. కాని అతడికి వ్యాపారం అంటే ఇంట్రెస్ట్ లేదు.

అతడి కుటుంబానికీ రేవతి తల్లికి మధ్య దూరపు బంధుత్వం ఉంది. అయితే అవతలవాళ్లు ఆర్థికంగా స్థితిపరులు కావడంతో పేదరికంలో ఉన్న వీరిని పట్టించుకోరు. ఏ కార్యాలకూ పిలవరు. వాళ్ల బంధువులుగా చెప్పుకోవడానికే సిగ్గుపడుతూనూ ఉండొచ్చు.

అయితే కాలేజీలోనే పరిచయమయి రెండు కుటుంబాల మధ్యనున్న బంధుత్వం తెలియడంతో అతడు కాస్త దగ్గరగా మసలుకోసాగాడు. తమింటికి రాకపోకలు మొదలెట్టాడు.

కొద్దిరోజుల్లో తనకు అతడి మనసు కొంతవరకూ అర్థమయింది. కేవలం స్నేహం, బంధుత్వాల ఆధారంగానే అతడు తమ కుటుంబం మీద ప్రత్యేకశ్రద్ధ కనబరచడంలేదని తెలుసుకోలేనంత అమాయకురాలేం కాదు తను. అతడి మనసులోని మాట తనకు సూచాయగా తెలుసు.

కాని తను అతడి మనసు తెలిసి కూడా తెలియనట్టే ప్రవర్తిస్తూ వుంటుంది. పైగా ఆ విషయం గురించి అసలు ఆలోచించనే ఆలోచించదు. జరగని విషయాలు గురించి ఆలోచించి బుర్రపాడుచేసుకోవడం అవివేకం అని తన ఉద్దేశ్యం.

ఎందుకంటే అతడికి ఈ విషయంలో ఇంట్లో మొదటి నుండి వ్యతిరేకత ఉంది. ఓ పేదింటి పిల్లను ఎలా చేసుకుంటావ్? మంచి ఆస్తిపరుల కుటుంబంలోని అమ్మాయిని పెళ్లి చేసుకుంటే పెద్ద ఎత్తున కట్నకానుకలొస్తాయి. నిజానికి ఒకప్పుడు ఆ ఒక్క ఆలోచన మాత్రమే వాళ్లది. ఇప్పుడు లేవలేని స్థితిలో మంచంలో ఉన్న ఓ తల్లికి కూతురు తను. తనను ఆ ఇంటి పెద్దలు ఎట్టి పరిస్థితుల్లో ఒప్పుకోరుగాక ఒప్పుకోరు.

పాలు పొంగిపోయి స్టౌమీద పడి శబ్దం

చేశాయి. ఆమె ఉలిక్కిపడి ఈ లోకంలో కొచ్చేసింది.

రెండు గ్లాసులు అందుకుని కాఫీ పౌడర్, చక్కెర వాటిల్లో వేసింది. పాలను గ్లాసు ల్లోకి వంచి కాఫీ గ్లాసులు పట్టుకుని అవత లికి నడిచింది.

గ్లాసు అందుకుంటూ అతడు ఆమె ముఖంలోకి చూశాడు. అయితే ఏదో ఇబ్బం దికరమైన ఫీలింగ్ మనసులో కదలాడ డంతో వెంటనే తల తిప్పుకున్నాడు.

ఆఫీసుకెళ్లేముందు కాసేపు కూర్చుని వెళ్లా లని తను ఆ ఇంటికి వచ్చాడు. కాని ఆ ఇంట అడుగుపెట్టడంతోనే కనిపించిన ఆ దృశ్యం మనసు వికలమయ్యేలా చేసింది.

రేవతి కుట్టుమిషన్ ముందు కూర్చుని జాకెట్స్ కుడుతోంది. అటు చూడగానే అవి ఆమె సొంతానికి కాదనీ ఇతరులవని అర్థమ యిపోయింది.

అయినా అప్పటికీ అనుమానంగానే అడి గాడు "రేవతీ! ఈ పని మొదలు పెట్టా వేంటి?"

"తప్పలేదు" క్లుప్తంగా అందామె.

"అంటే?"

"ఇక నుండి ఇదే నా వృత్తి"

"నువ్వు నువ్వు టైలరింగ్ పని చెయ్యబో తున్నావా?"

"అమ్మను కనిపెట్టుకుని వుండడం కోసం ఇంట్లో కూర్చునే పని ఏదన్నా చేసుకోవాలి కదా?"

అతడు ఏదో చెప్పబోయాడు. చెప్పలేక ఆగిపోయాడు. పరధ్యాసగానే కాఫీ సిప్ చేయసాగాడు.

రేవతి కూడా అతడి ముఖంలో కదలాడు తున్న భావాలు చదువుతూ కొద్దిసేపు మౌనంగా ఉండిపోయింది.

శారదమ్మ చూపు పైకప్పు మీదనే నిలచి వుంది..

కాఫీ తాగి గ్లాసు కిందపెడుతున్నప్పుడే రేవతి అతడిని అడిగింది. "నువ్విప్పుడు ఆఫీసుకే కదూ వెళ్లేది?"

"అవును" జవాబిచ్చాక అతడు అడిగాడు "ఎందుకడిగావ్?"

"నేను మార్కెట్ వరకూ వెళ్లి రావాలను కుంటున్నాను. అమ్మకు తోడుగా ఎవరూ లేరుకదా అని భయపడుతున్నాను. నువ్వా ఆఫీసుకి వెళ్లాలంటున్నావ్ కాబట్టి ఓ గంట సేపు కూర్చోవడం వీలుకాదుకదా?"

అతడు నిలువునా తలాడించాక చెప్పాడు. "టైమ్‌లేదు. ఆఫీసుకెళుతూ చూసి వెళ్లాలని ఇలా వచ్చాను"

ఆమె మౌనంగా ఉండిపోయింది.

"పోనీ నేను సాయంత్రం ఆఫీసునుండి వచ్చేప్పుడు ఏవయినా పట్టుకురానా?"

"వద్దొద్దు. రేపెప్పుడయినా వీలు చూసు కుని వెళ్తాలే... ప్రస్తుతానికి నీతోనే సెంటర్ వరకూ వచ్చి కొద్దిగా కూరలు, పళ్లు పట్టుకొ చ్చుకుంటాను"

అతడు రిస్ట్‌వాచ్‌కేసి చూసుకుని చెప్పాడు. "నాకూ ఆఫీసుకి టైమయింది. వెళ్దాం పద"

రేవతి లేచి తల్లి దగ్గరకెళ్లింది. "అమ్మా! నేను సెంటర్‌వరకూ వెళ్లి త్వరగా వచ్చే స్తాను"

శారదమ్మ తలాడించలేదు. రెండుసార్లు కనురెప్పలాడించింది.

రేవతి సంచి చేత పట్టుకుని ఇంట్లో నుండి బయటకు నడిచింది. అతడు ఆమెను అనుసరించాడు. ఆమె తలుపులు దగ్గరగా లాగి బయట గడియపెట్టింది.

ఇద్దరూ రోడ్డుమీద పక్కపక్కనే నడుస్తు న్నప్పుడు అతడు చాలాసేపు మాట్లాడ కుండా పరధ్యానంగా ఉండడం గమనించి ఆమే అడిగింది "సాయి ఏమిటాలోచిస్తు న్నావ్?"

అతడు వెంటనే చెప్పాడు "నీ గురించే"

"నా గురించా?"

"అవును నీ గురించే"

"నా గురించి ఏమాలోచిస్తున్నావ్?"




సాయికృష్ణ అడుగు ముందుకు వేయ కుండా ఆగిపోయాడు. అతడు ఆగడంతో ఆమె కూడా ఆగింది.

అతడు ఆమెవైపు తిరిగి అడిగాడు, "రేవతీ! నీకు నీ భవిష్యత్ తలచుకుంటే భయం కలగడంలేదా? "

"భయమా? భయమెందుకు? "

అతడు విసురుగా ఏదో చెప్పబోయి ఆగాడు. తను అంత ఆవేశం ప్రదర్శించడం సమంజసం కాదనిపించిందేమో వెంటనే తల విదిలించాడు.

"నీ భవిష్యత్ గురించి నీకే మాత్రం భయమనిపించడంలేదా! కాని నాకు నిన్ను తలచుకుని నీ గురించి ఆలోచించడం మొద లుపెడితే ఇక ఆ రాత్రంతా నిద్ర ఉండడం లేదు తెలుసా? "

"నా భవిష్యత్‌కి ఇప్పుడేమయింది సాయీ? "

"అసలు... అసలు నువ్వేం మాట్లాడుతు న్నావో నీకర్థమవుతోందా? " అతడీసారి కాస్త సీరియస్‌గానే అన్నాడు.

దారిన వెళ్తున్న జనం రోడ్డు అంచునే నిల బడి మాట్లాడుకుంటున్న వాళ్లిద్దరి మీదా కొద్ది క్షణాలు చూపు నిలిపాకే తల తిప్పు కుని ముందుకు నడుస్తున్నారు.

ఆమె అతడితో చెప్పింది. "మనం ఇక్కడ నిలబడి పోవడంతో జనం మనకేసే చూస్తు న్నారు. మనం నడుస్తూ మాట్లాడుకోవడం బాగుంటుందేమో సాయీ"

అతడు దీర్ఘంగా నిశ్వసించాడు. "పద " అన్నాడు.

ఇద్దరూ తిరిగి ముందుకు నడుస్తున్న ప్పుడు అతడు కాస్త నెమ్మదిగానే ఆమెతో చెప్పసాగాడు.

"రేవతీ! నువ్వో ప్రవాహంలో కొట్టుకుపో తున్నావ్. నీ గురించి నువ్వు ఆలోచించుకో వడం పూర్తిగా మానేశావ్. ప్రస్తుతం నీ ప్రపంచం మొత్తం నీతల్లే అయిపోయింది.

"తల్లీకూతుళ్ల మధ్య అనుబంధం, ఆప్యా యతలు ఉండకూడదని నేను చెప్పడంలేదు. జన్మనిచ్చిన తల్లికి రుణపడిఉంటాం. ఆ రుణం తీర్చుకోవలసిన బాధ్యత ప్రతిబిడ్డకూ ఉంటుంది. కాని ఆ రుణం తీర్చుకునే మార్గం ఇది కాదు. నువ్వీరోజు నీ కెరీర్‌ని పాడుచేసుకుని, అమ్మతోనే లోకంగా బతికితే తర్వాత కాలంలో చాలా బాధపడాల్సివ స్తుంది. ఈరోజు నువ్వు నీ కంప్యూటర్ టాలెంట్‌ని వదిలేసి కుట్టుమిషన్ ముందు కూర్చున్నావ్. ఇలా నీ గురించి నువ్వు ఆలో చించుకోవడం మానేసి మీ అమ్మకోసమే అడ్జస్ట్ అయిపోతూ ఉంటే, చివరికి నీకంటూ ఏమీ మిగలదు"

"నాకంటూ అమ్మ ఉన్నాక నాకింకేం కావాలి సాయి"

"అలా అనకు రేవతీ! నిజం నిష్ఠూరమ యినా ఆ నిజమే మాట్లాడుకోవలసి ఉంటుంది. అది నీకు తెలియదని కాదు. చెప్పానుగా! నువ్వో ప్రవాహంలో కొట్టుకుపో తున్నావ్. వాస్తవాలను గమనించేస్థితిలో లేవు. నేను అందుకే చెపుతున్నాను, విను. అమ్మ ఎవరికైనా అమ్మే. కాని అమ్మే జీవితం కాదు. అమ్మ రుణం తీర్చుకోవల సిందే. కాని అదే సమయంలో అమ్మ జీవి తాంతం వరకూ మనకు తోడుఉండదన్న విషయమూ గుర్తుంచుకోవాలి. మీ అమ్మ ఎక్కువలో ఎక్కువ మరో పదిహేనేళ్లు, ఇర వైఏళ్లు నీకు తోడుగా ఉండొచ్చు కానీ ఆ తర్వాత కూడా నీముందు చాలా జీవితం ఉంటుంది. అమ్మ తోడుగా ఉన్నప్పుడు నిన్ను ఒంటరితనం బాధించదు. అమ్మ తర్వాత? ఒంటరితనం శాపమే కాదు. ఒంటరి ఆడదాని బతుకు ఎంత భయంక రమో నువ్వు ఊహించలేవు కూడా. కాబట్టి నేను చెప్పేదేమిటంటే అమ్మ గురించే ఆలో చించు. కానీ అదే సమయంలో నీ గురించి కూడా నువ్వు ఆలోచించుకో"

అతడు చెప్పిన మాటలు వినడానికి కాస్త కటువుగా ఉన్నా తన మనసుకి అవి బాధ

కలిగిస్తున్నా అతడివైపునుండి ఆలోచిస్తే అతడు తన తల్లిమీద కోపంతోనో ద్వేషంతోనో అలా మాట్లాడలేదన్నది నిజం. అతడికి, తన తల్లికన్నా తనే ముఖ్యం. అతడి ఆలోచనలన్నీ తన చుట్టే పరిభ్రమిస్తున్నప్పుడు తన గురించే ఆలోచించడం సహజం. అలా ఒకరి గురించి ఆలోచిస్తున్నప్పుడు మరొకరి గురించి పట్టించుకోవడం జరగదు. ఓ యువకుడు ఓ అమ్మాయిని ప్రేమిస్తున్నప్పుడు ఆ అమ్మాయిని పెళ్లి చేసుకోవడమే ముఖ్యమనుకుంటాడు. ఆ స్థితిలో అతడికి ఆ అమ్మాయి తల్లిదండ్రుల గురించిన ఆలోచన ఉండదు. వాళ్ళ బిడ్డమీద వాళ్లు ఎన్ని ఆశలు పెంచుకున్నారో, వాళ్లు వాళ్లమ్మాయిని ఏ కలెక్టర్‌లాంటివాడికైనా ఇవ్వాలనుకున్నారేమో అని ఆలోచించడు. అతడికి తన ప్రేమ ఫలించడమే కావాలి. అమ్మాయి తల్లిదండ్రుల గురించి ఆలోచించాల్సిన అవసరం అతడికి ఎందుకుంటుంది? అలా అని అతడివైపు నుండి కూడా ఆలోచించడంవల్లనే ఆమె అతడిని అర్థం చేసుకోగలుగుతోంది.

రేవతి చాలాసేపు మాట్లాడకుండా మౌనంగా నడవడం చూసి, అతడు కాస్త అసహనంగానే అడిగాడు. "రేవతీ మాట్లాడవేంటి? "

"ఏం మాట్లాడను? "

"నేను చెప్పిన మాటలమీద నీ అభిప్రాయం? "

కొద్దిసెకనులు ఆలోచించాక ఆమె అంది. "నామీద అభిమానంతో ఆలోచించి చెప్పావ్. ఇక్కడ నువ్వో విషయం మరిచిపోతున్నావ్. నేను మంచాన పడివున్న ఓ ముసలి తల్లికి ఒక్కగానొక్క కూతుర్ని. నాకు మా అమ్మ గురించి ఆలోచించాల్సిన బాధ్యత వుంది. అలా ఆలోచించకుండా నా దారి నేను చూసుకుంటే..." ఆమె ఆగింది.

"ఊఁ! ఏమవుతుంది? " అతడు ఆమె ముఖంలోకి చూశాడు.

ఆమె కూడా అతడి ముఖంలోకి చూసింది. బహుశా అతడు తన వాదనను తను బలంగా నమ్ముతున్నాడు. అందువల్లే అతడి కళ్లలో గిల్టీఫీలింగ్ ఏమాత్రం కనిపించడంలేదు.

మరి అతడు తన వాదనను ఎలా సమర్థించుకుంటున్నాడు.

ఈ దేశంలో తల్లిదండ్రులను వృద్ధాప్యంలో వున్నప్పుడు పోషించాల్సిన బాధ్యత, వాళ్ళ మంచిచెడ్డలు చూసుకోవలసిన ధర్మం కొడుకులదేనా! ఇది అనుశ్రుతంగా వస్తున్న ఆచారం. నిజమే! తల్లిదండ్రులను వృద్ధాప్యంలో చూసుకోవలసిన బాధ్యత ఆడపిల్లలకు ఎంతమాత్రమూ లేదు. కాబట్టి అనుశ్రుతంగా వస్తున్న ఆచారాన్ని ఫాలో అయిపోతూ, కష్టాల్లో వున్న అమ్మను వదిలేసి తన దారి తనను చూసుకోమని చెబుతున్నాడు సాయికృష్ణ.

ఆచారం... వారసత్వ సంపద. ఇన్ని అడ్డం పెట్టుకుని తను తన తల్లికి ద్రోహం చేయడం ఎంతవరకూ సబబు?

రేవతి మాట్లాడకపోవడంతో అతడే అడిగాడు, "రేవతీ మాట్లాడవేంటి? "

"ఏం మాట్లాడను? "

"నేను అడిగిన ప్రశ్నకు సమాధానం? "

"నువ్వు... నువ్వు పాత సాంప్రదాయాల్ని అడ్డు పెట్టుకుని చాలా దారుణంగా ఆలోచిస్తున్నావని మాత్రం చెప్పగలను"

అతడు అదిరిపడి ఆమెవైపు చూశాడు. "అంటే... అంటే నీ ఉద్దేశం? "

"ఆడపిల్లకు అమ్మానాన్నను చూసుకోవలసిన బాధ్యత లేదు. ఒక కొడుకు తన తల్లిదండ్రులను వదిలి, తన సుఖం తను చూసుకుంటే లోకం తప్పు పడుతుంది. బాధ్యత లేని కొడుకు 'తల్లిదండ్రుల మీద దయలేని పుత్రుడు అంటూ... పుట్టనేమి వాడు గిట్టనేమి. పుట్టలోని చెదలు పుట్టవా గిట్టవా? ' అని శాపనార్థాలు పెడుతోంది అదే ఒక కూతురు తన తల్లిదండ్రులను




కష్టకాలంలో వదిలేసి వెళ్ళినా లోకం ఆ కూతురును పట్టించుకోదు. "అవును పాపం! తన సుఖాలను వదిలేసి ఎంత కాలం పుట్టింట్లోనే వుండిపోతుంది. తన కంటూ ఓ సంసారం, పిల్లలూ, బాధ్యతలు అక్కర్లేదా? " అని ఆమె బాధ్యతా రాహిత్యాన్ని కూడా సమర్థిస్తుంది. ఇప్పుడు లోకం నన్ను చెడుగా అనుకోదుకదా అని నేను నా సుఖం చూసుకోమంటావా? చెప్పు సాయి"

అతడి ముఖం కాస్త ఎర్రబారింది. ఆ విషయం రేవతి గమనించింది.

"నేను మరీ అంత కర్కోటకునిలా నీ కంటికి కన్పిస్తున్నానా? " అన్నాడతను.

ఆమె మాట్లాడలేదు

అతడు కొద్దిక్షణాలు పెదవులు బిగపట్టుకుని ఉండిపోయాక మాట్లాడవలసిన బాధ్యత తనదే అన్నట్టుగా పెదవి విప్పాడు. "చూడు రేవతీ! నువ్వు నన్ను ఏవిధంగా అర్థం చేసుకున్నా నేనేం బాధపడను. నా బాధంతా నీ గురించే! నువ్వు సుఖంగా వుండాలన్నదే నా కోరిక. ఇక్కడ నేను నీ బాధ్యతను విస్మరించమని కూడా చెప్పటం లేదు. నువ్వు సుఖపడుతూ, మీ అమ్మ రక్షణకు ఏదయినా ఏర్పాటు చెయ్యి. కాసింత తెలివిగా ప్రవర్తించు. అంతేగానీ మీ అమ్మను వదిలేసి నువ్వు హైదరాబాద్ వెళ్ళిపోయి హాయిగా బతుకు అని సలహా ఇవ్వబోవటంలేదు. ఇంతకీ నేననేది ఏంటంటే ఏదయినా మార్గం ఆలోచించు"

ఆమె వెంటనే ప్రశ్నించింది. "అలాంటి మార్గాలు ఏమున్నాయి? "

"మనసుంటే ఎన్నో మార్గాలున్నాయన్నది నిజం"

అతడు ఆ మార్గాలేమిటో చెప్పలేదు. సంభాషణ మరింత పొడిగించే ఉద్దేశ్యం ఆమెకు లేదు. అదీగాక అప్పటికే ఇద్దరూ సెంటర్ చేరుకున్నారు.

ఆమె అతడి సంతృప్తికోసమే అన్నదా మాట. "ఆలోచిస్తాను"

సాయికృష్ణ మౌనంగా ఉండిపోయాడు.

రేవతి కూరగాయలు, పళ్లు కొనుక్కునేవరకూ అతడు ఆమె పక్కనే ఉన్నాడు.

వచ్చిన పని పూర్తయ్యాక రేవతి అతడిని అడిగింది "సాయంత్రం ఆఫీసునుండి ఇంటికి వస్తావా? "

"ఎందుకూ...ఏదైనా అవసరం ఉందా? "

"అలాంటిదేమీ లేదు. క్యాజువల్‌గా అడిగానంతే. వీలయితే రాకూడదూ? "

"సాయంత్రం చిన్నపని ఉంది. బహుశా రేపు కూడా నేను రాలేకపోవచ్చు"

"అయితే సరే" ఆమె తలాడించింది.

"ఉంటాను" అతడు ముందుకు నడిచాడు.

సాయికృష్ణ తన సమక్షంలో మనసు బాధ పెట్టుకుని వెళ్ళిపోయాడు. ఆ ఫీలింగ్ అతడి ముఖంలో స్పష్టంగా కనిపిస్తూనే ఉంది. తనుకూడా మరీ అంత నిర్మొహమాటంగా, కఠినంగా మాట్లాడకుండా వుంటే బాగుండేదేమో. అమ్మను వదిలేసి సుఖంగా బ్రతకడం గురించి ఆలోచించమనేసరికి తనకు బాగా కోపం వచ్చేసింది. ఆ కోపం అలా బయటపడిపోయింది.

రేవతి సాయికృష్ణ మాటలు ఆలోచించుకుంటూనే ఇంటివైపు అడుగేసింది.

మనసుంటే ఎన్నో మార్గాలున్నాయిట. ఏమిటవి? మంచంలో పడిన మనిషిని ఆ కుటుంబసభ్యులు తప్ప మరెవరయినా ఎందుకు చూస్తారు? ఎవ్వరూ చూడరు. మంచంలో ఉన్న మనిషి ఎవరికయినా ఒక బరువు. భరించలేని ఒక బాధ్యత. కాబట్టి మంచంలోని మనిషిని సొంత మనుషులే చూసుకోవాలి. కాదూ కూడదంటే ఆమె సేవకోసం ఓ నర్స్‌ని అపాయింట్ చేసుకోవాలి. నర్స్ పగలంతా లేదా రాత్రింబవళ్లు ఓ పేషెంటుని కనిపెట్టుకుని వుండడానికి నెలజీతం ఎంత తీసుకుంటుంది? నర్స్ జీతం తను సంపాదించి ఇవ్వలేనన్నది





వాస్తవమయితే ఒకవేళ నర్సుని పెట్టుకున్నా ఆమె పేషెంట్‌ని సొంత మనిషిలా చూసుకోదుకదా! ఒక పేషెంట్‌ని మనం జాగ్రత్తగా చూసుకోవాలంటే ఆ మనిషిమీద మనకు అభిమానం, ఆప్యాయతలు ఉండితీరాలి. అఫ్‌కోర్స్! కొన్నిసార్లు సొంతమనుషులు కూడా అభిమానం, ఆప్యాయతలు ప్రదర్శించరు. మంచానపడిన తమ తల్లిదండ్రులను విసుక్కోవడం, కసురుకోవడమే కాదు. 'వీళ్లింకా ఎంతకాలం మంచంలో వుండి మమ్మల్ని కష్టపెడతారు?' అని మనసులోనే తిట్టుకుంటూ వుంటారు. తను మాత్రం అలా చేయదుగాక చేయదు. అమ్మ మంచంలో ఎంతకాలం వున్నా ఆమె మనసుకు కష్టం కలక్కుండా తను చూసుకుంటుంది.

ఆలోచనలు ఓ కొలిక్కి రాలేదుగాని ఇల్లు వచ్చేసింది.

రేవతి తలుపు గడియ తీసుకుని ఇంట్లోకి వెళ్ళింది. అటుచూస్తే- తల్లి కళ్లు తెరుచుకునే ఉంది. తల కదల్చకుండానే కళ్లుతిప్పి తనను చూసిందామె.

సంచితో సహా వంటగదిలోకి వెళ్ళింది రేవతి. కూరగాయలు, పళ్లు తీసి సర్దిపెట్టుకుంది. చాలాదూరం నడిచి వెళ్లి వచ్చేసరికి అలసటగా అనిపించింది. అందువల్లే వంటగదిలోనే కొద్దిసేపు అలాగే కూర్చుండిపోయింది.

మంచినీళ్లు తాగాక హాలులోకి వచ్చి తల్లి పక్కగా నిలబడింది. ఆమెను చూసి నవ్వుతూ చెప్పింది. "ఓ వారానికి సరిపడా పళ్లు, కూరగాయలు తెచ్చి పెట్టేశానమ్మా"

శారదమ్మ ఏం మాట్లాడగలదు? జవాబుగా కళ్లు కదిలించింది.

"నేనింక కుట్టుమిషన్‌మీద కూర్చోబోతున్నాను. నీకింకేమన్నా కావాలా అమ్మా?"

ఈసారి ఆమె తల అడ్డంగా ఆడించింది.




రేవతి కొద్దిగా వంగి తల్లినుదుటమీద చెయ్యి ఉంచాక అడిగింది. "అమ్మా! నీకు కాసింత నారింజరసం ఇస్తాను. తీసుకో"

శారదమ్మ అతికష్టంమీద మరోసారి తల అడ్డంగా ఆడించింది.

"అలా అంటే ఎలాగమ్మా! నువ్వు మంచి ఆహారం తీసుకోవాలి. త్వరగా కోలుకుని, మళ్ళీ కుట్టుమిషన్ మీద చకచకా బట్టలన్నీ కుట్టేయాలి. ఏమంటావ్?"

నోటితో జవాబు చెప్పలేకపోయినా, ఆమె కళ్ళలో కాసింత మెరుపు కనిపించింది.

కోపం, విసుగు, చిరాకు, ఆందోళన, దుఃఖం ఇలాంటి మానసిక బాధలకు పక్షవాతరోగి చాలా తేలికగా లొంగిపోతాడు. అంతేకాదు డిప్రెషన్ వలన రోగి చికిత్స నిరాకరించి, సహకరించకుండా మొండికేయడం సహజం. పక్షవాతరోగిని బైటకు తెచ్చి, ధైర్యం చెప్పి, నమ్మకం కలిగించి కులాసా కబుర్లతో హుషారుగా ఉండేలా చూడాలి. సేవ చేసేవాళ్లు విసుగుపడకూడదు. చిన్నపిల్లల్ని లాలించి, బుజ్జగించినట్లే ఇక్కడా సహనం, సంయమనం పాటించాలి. పేషెంట్‌ని విసుక్కుంటే అతను మరింత మొండికేయడం లేదా డిప్రెషన్‌లోనే ఉండిపోవడం జరుగుతుంది. అప్పుడా రోగి జబ్బునుండి కోలుకునే అవకాశాలు సన్నగిల్లుతాయి.

రామ్మోహన్ చెప్పిన వివరాలన్నీ ఆమె మనసులో ముద్రించుకుపోయిఉన్నాయి.

నిజానికి తనకు అమ్మమీద విసుక్కునే పరిస్థితి ఎప్పుడూ రాదు. అమ్మంటే తనకు ఇష్టం, అభిమానం, ప్రేమ, గౌరవం, నమ్మకం, ఇంకా అన్నీనూ. అలాంటి అమ్మమీద తను విసుక్కోవడమా? అది అసలు జరగదు. కాకపోతే అలాంటి స్థితిలో ఉండే రోగుల మానసికస్థితి ఎలా ఉంటుందో తెలియడంవలన తను మరింత జాగ్రత్తగా



మసలుకోగలుగుతుంది. చిన్నపిల్లల మన స్తత్వం తెలుసుకున్న పెద్దలు వాళ్ళకు ఏ కష్టం కలగకుండా చూసుకోగలుగుతారు. అలాగే తనకు అమ్మ మానసికస్థితి తెలియ డంవలన ఆమెకు మరింత ఆనందం కలిగిం చగలుగుతుంది.

రేవతి మంచంమీదనుండి లేచి నారింజ రసం తీసుకుని వచ్చింది. స్పూన్‌తో ఆమెకు కొద్దికొద్దిగా అందివ్వసాగింది. ఆమె తాగడం పూర్తిచేశాక టవల్‌తో మూతి తుడి చింది. "మా అమ్మ మంచిది" అంటూ చుబుకం పట్టుకుంది.

శారదమ్మ కొద్దిగా పెదవులు వెడల్పుచే సింది. నోరు వంకరపోయిందిగానీ, పెదాల మీద నవ్వు రేవతికి అర్థమయింది.

రేవతి మంచంమీదనుండి లేచాక, ఆమెతో చెప్పింది "పగటినిద్ర అంత మంచి దికాదట అమ్మా. కాబట్టి వీలయినంత వరకూ పగలు నిద్రపోకు"

శారదమ్మ తలాడించింది.

తల్లిపని చూశాక రేవతి ఇంటిపనులు చేసుకుంది. తర్వాత కాసింత తీరిక దొరక డంతో ఆమె కుట్టుమిషన్ ముందు కూర్చుంది.

కుట్టుపని మొదలు పెట్టబోతూ ఉంటే ఆమెకు ఆ క్షణం సాయికృష్ణ మాటలు గుర్తుకొచ్చాయి.

"నీ భవిష్యత్ గురించి ఆలోచించుకో. మనసుంటే మార్గాలు చాలా ఉన్నాయి?"

రేవతి నవ్వుకుంది. 'మనసుంటే మార్గాలు చాలా ఉండొచ్చు కానీ అవన్నీ తల్లీ కూతుళ్లను వేరుచేసేవే. అలాంటి ఆలో చనలు నేను చేయనుగాక చేయను' ఆమె మనసులోనే అనుకుంది.

ఆలోచనలకు స్వస్తి చెప్పి తన పనిలో తాను మునిగిపోయింది.



ఇంటిముందు కారాగిన చప్పుడ యింది.

అది డాక్టర్ రామ్మోహన్ కారు అన్న విషయం అర్థం కావడంతోనే రేవతి, ఇల్లు చిమ్ముతున్నదల్లా చీపురుకట్టను మూలన పెట్టి వాకిట్లోకి వెళ్లి నిలబడింది.

రామ్మోహన్ కారుదిగి లోపలికొస్తూ ఆమెను చూసి పలకరింపుగా నవ్వాడు. ఆమె బదులుగా, నవ్వింది.

అదే సమయంలో తమ ఇంటిముందు కారు ఆగడంతో ఆ వీధిలోని ఇళ్లల్లోనుండి కొంతమంది తొంగిచూడడం గమనించింది. అలాంటివాళ్ల ఆలోచనాధోరణి ఎలా ఉంటుందో ఊహించగలదు తను.

నిజానికి తనకూ ఆ డాక్టర్ ఇంటికి రావడం ఇష్టంలేదు. పాత పరిచయం కారణం కావచ్చు లేదా తమ స్థితికి జాలి పడి ఉండొచ్చు ఒక డాక్టర్‌గా అతడు తన తల్లిని చెకప్ చేయడానికి వస్తుంటే తనెలా కాదనగలదు?

రామ్మోహన్ ఆమె దగ్గరగా వచ్చాక అడి గాడు. "బాగున్నారా?"

"బాగున్నాను రండి"

ఇద్దరూ లోపలికి నడిచాక అతడు

తిన్నగా పేషెంట్ దగ్గరకెళ్లాడు. కళ్లు, నోరు, నాడి పరిక్షించాక రేవతి అడిగింది. "మా అమ్మగారి పరిస్థితి ఎలా ఉందనుకుం టున్నారు? "

అతడు నవ్వాడు, "పదిహేను రోజుల లోనే తేడా కనిపించడానికి ఇది జ్వరమో తలనొప్పో కాదుకదా? స్ట్రోక్! ఇంచుమించు మనిషి అచేతనంగా అయిపోతాడు. ఆ స్థితి నుండి మళ్లీ మనిషిని మామూలు స్థితికి తీసుకురావాలంటే కొన్ని నెలల కాలం అవ సరం. నిజం చెప్పాలంటే ఈ పదిహేనురో జుల్లోనే మీ అమ్మగారి పరిస్థితి చాలావ రకూ మెరుగయింది. మీరింక 'రిహాబిలిటే షన్' స్టార్ట్ చెయ్యొచ్చు"

"అలాగే డాక్టర్"

అతడు తన షర్ట్ జేబులోనుండి ప్రిస్కి షన్ ప్యాడ్ తీశాడు. అందులో ఏదో రాసి ప్రిస్కిప్షన్ చించి ఆమెకు అందిస్తూ చెప్పాడు. "రిహాబిలిటేషన్ పిరియడ్‌లో అలసట వచ్చినప్పుడు, బి.పి. కంట్రోల్‌లో ఉండేందుకు వాడే టాబ్లెట్స్ అవి. ప్రతి రోజూ మూడు పూటలా వాడాలి. పెద్దగా ఖరీదు ఉండవులెండి"

"తీసుకొస్తాను డాక్టర్"

వచ్చినపని అయిపోయినట్టు అతడు వెళ్ళ డానికి ఉద్యుక్తుడవుతుంటే, ఆమె అంది, "కూర్చోండి డాక్టర్"

"లేదు. ఈరోజు ఇప్పటికే లేటయింది. రెండు రోజులుగా ఇటువైపు రావాలను కుంటూ రాలేకపోతుండడంతో ఈరోజు టైమ్ గురించి ఆలోచించకుండా వచ్చేశాను. కూర్చోండి కాఫీ పెడతాను. అంటే ఎలా? "

ఆమె నవ్వింది.

అతడు బయటకు నడుస్తుంటే వాకిటివ రకూ అనుసరించింది.

అతడికి అప్పుడు గుర్తొచ్చినట్టుంది. ఆమె వైపు తిరిగి చెప్పాడు. "ఫారిన్‌నుండి ఓ మిత్రుడు పంపిన టాబ్లెట్స్ కొన్ని నా దగ్గర ఉన్నాయి. స్ట్రోక్ వచ్చిన వాళ్ళకు అవి చాలా బాగా పనిచేస్తాయి. నేను ఉదయం తీసుకురావాలనుకుని మర్చిపోయాను. మరో రెండురోజులవరకూ ఇక్కడికి రాలేను. అందుకని..."

"చెప్పండి"

"మీరీ సాయంత్రం మా ఇంటికోసారి ఫోన్‌చేసి నేను ఉన్న విషయం కన్‌ఫర్మ్ చేసుకుని ఇంటికొస్తే నేను ఆ టాబ్లెట్స్ మీకి వ్వగలను"

మనసులో ఏదో తెలియని ఇబ్బంది కద లాడింది. ఆ కారణానే ఆమె తడబడింది.

ఆమె ఇబ్బంది గమనించినట్టుగా అతడు అన్నాడు, "నో ప్రాబ్లమ్. మీకేదయినా ఇబ్బంది ఉంటే రానవసరంలేదు. వీలు చూసుకుని నేను వస్తాను. లేదా రెండురో జుల తర్వాతయినా తెచ్చి ఇస్తాను"

అతడు అలా అనడంతో తమకు ఉచిత సేవ చేస్తున్న అతడిని ఇబ్బంది పెట్టడం ఎంతవరకూ సబబు అన్న ప్రశ్న ఆమె మనసులో కదలాడింది. ఇబ్బందిని ఆ ప్రశ్న పక్కకు నెట్టేసింది. "లేదండి నేనే వస్తాను. సాయంత్రం మీ ఇంటికి ఫోన్ చేస్తాను"

"మా ఇంటి ఫోన్‌నంబర్ మీ దగ్గర ఉందనుకుంటానూ"

"ఉందండి"

అతడు చెయ్యి ఊపి ముందుకు నడి చాడు. ఆరు సెకనుల తర్వాత అక్కడ కదిలిన కారు పదిహేను సెకనుల తర్వాత వీధిమలుపు తిరిగి మాయమయింది.

ఆ సాయంత్రం రామ్మోహన్ ఇంటికి ఫోన్ చేసేందుకు, ఇంట్లోనుండి బయటకు నడుస్తుంటే పోస్ట్‌మేన్ వీధిగేటు దగ్గర ఎదురై ఆమె చేతికి ఓ ఉత్తరం అందించి వెళ్ళిపోయాడు.

ఆమె ఉత్తరం చించి చూస్తే అది కల్పన నుండి వచ్చింది. సంక్రాంతికి హాస్టల్‌లోని చాలామంది ఇళ్ళకు వెళుతున్నారనీ తనకూ ఆ సమయంలో అక్కడ ఉండడం ఎలాగో

ఉందనీ, ఎలాగూ ఆంటీని చూడాలనుకుంది కాబట్టి గుంటూరు వస్తున్నాననీ రాసింది.

లెటర్ చదవడంతో రేవతికి సంతోషం వేసింది. గత పదిహేను రోజులుగా తనకు నోరారా మాట్లాడేందుకు మరో మనిషి దొరకలేదు. ఇలాంటి సమయంలో కల్పన వస్తే తనకూ కాస్త కాలక్షేపంగా ఉండడమే కాదు, కొంత హుషారూ వస్తుంది. మనసులో అనుకుంది ఆమె.

ఉత్తరం మడిచి చేతిలోనే ఉంచుకుని సెంటర్‌వైపు నడవసాగింది. సెంటర్‌కి కాస్త ఇవతలే ఉంది పబ్లిక్‌ఫోన్.

ఆమె పబ్లిక్ ఫోన్‌నుండి రామ్మోహన్ ఇంటికి ఫోన్‌చేసింది. అతడు ఇంట్లోనే ఉన్నట్టున్నాడు. అతడే లిఫ్ట్ చేసి "హలో" అన్నాడు.

"హలో డాక్టర్! నేను... రేవతిని" చెప్పిందామె.

"ఓహో మీరా? ఇప్పుడొస్తున్నారా?"

"రావాలనే అనుకుంటున్నాను డాక్టర్"

"రండి. సాయంత్రం ఐదింటివరకూ నేను ఇంట్లోనే ఉంటాను" చెప్పాడు అతడు.

"మరో ఇరవైమినిషాల్లో అక్కడ ఉంటాను డాక్టర్" ఆమె చెప్పింది.

"వెల్ కమ్"

అతడు ఫోన్ పెట్టేశాకే ఆమె రిసీవర్ హుక్‌మీద ఉంచింది.

అక్కడనుండి ఇంటికి తిరిగొచ్చాక తల్లితో చెప్పింది. "అమ్మా! నేనో గంటలో తిరిగిరాగలను. ఉండగలవా?"

శాదరమ్మ కళ్లు చికిలించింది. అంటే కూతురు ఏం చెబుతోందో అర్థం కాలేదని ఆమె భాషలో చెప్పడమన్నమాట.

"అదేనమ్మా! డాక్టర్ రామ్మోహన్ గారున్నారు చూడు. ఉదయం మనింటికొచ్చారు? ఆయన ఇంట్లో ఏవో టాబ్లెట్స్ ఉన్నాయట. నేనెళ్లి అవి తీసుకువస్తాను. ఓ గంటలో వచ్చేస్తాలే. అప్పటివరకూ నువ్వు ఒంటరిగా ఉండగలవా లేక పక్కింటి పెద్దమ్మను పిల్చుకొచ్చి ఉంచి వెళ్లనా?"

శారదమ్మ తలాడిస్తూనే ఆమెకు కావలసిన సమాధానం అందచేసింది.

తల్లి చూపులతోనే చేసిన సైగలు రేవతికి అర్థమయ్యాయి. ఆమె తలాడించింది.

రేవతి హాల్లోనుండి పెరట్లోకెళ్ళింది. ముఖం కడుక్కున్నాక కాసింత అలసట తీరినట్టనిపించింది. తిరిగి హాల్లోకి వచ్చాక ఆమె తన డ్రెస్‌కేసి చూసుకుంది. చీర బాగా నలిగిపోయి ఉండడమేకాదు. బాగా పాతచీర. ఇంట్లో కట్టుకోవడం, ఏదో అలా బజారువరకూ వెళ్ళిరావడమయితే పర్వాలేదుగానీ, మరీ మరొకరింటికి వెళ్ళేప్పుడు కూడా ఇలా వెళ్లడం ఏమంత బాగోలేదు కదా?

ఆమె బీరువా తెరిచి అందులోనుండి ఓ మంచి చీర సెలక్ట్ చేసుకుంది. చీర కట్టుకున్నాక ముఖానికి కాసింత పౌడరు రాసుకుంది. చివరిసారిగా మరోసారి అద్దంలో చూసుకుని సంతృప్తి పడ్డాక బయలుదేరింది. వెళ్లేముందు తల్లికి మరోసారి చెప్పి తలుపు దగ్గరగా వేసి బయటకు నడిచింది.

సెంటర్ చేరుకున్నాక రిక్షా ఎక్కింది.

రిక్షా ముందుకుపోతూ వుంటే ఆమె ఆలోచనలు వెనక్కువెళ్ళాయి. "తను డిగ్రీ చదివే రోజుల్లో అంజలి తన క్లాస్‌మేట్. అప్పట్లోనే ఆమె టూ వీలర్‌లో కాలేజీకి వచ్చేది. ఆడా, మగా తేడా లేకుండా అందరితో కలుపుకోలుగా మాట్లాడేది. అందుకే కాలేజీలో అందరూ ఆమెను చాలా ఫాస్ట్‌రా బాబు అనుకునేవాళ్లు. ఎందువల్లో తెలియదుగాని అంత ఫాస్ట్‌గర్ల్ తనతో చాలా క్లోజ్‌గా ఉండేది. ఏదో ఒకటి, రెండుసార్లు తనను ఇంటికి కూడా తీసుకెళ్ళి వాళ్లింట్లో వాళ్ళకు పరిచయం చేసింది కూడా. అదిగో అలా పరిచయం అయినవాడే రామ్మోహన్.

అంజలి ఫాస్ట్‌గర్ల్ మాత్రమే కాదు, ఆమె ఆలోచనలు కూడా మరీ మెటీరియలిస్టిక్‌గా ఉండేవి. అప్పట్లోనే ఏదో ఒక సందర్భంలో

ఆమె అంది, "ముసలితనం అంటే నాకు చాలా అసహ్యం రేవతీ! ఒక వయసొచ్చాక మనిషి ఇక సాధించేది ఏముంటుంది? అందుకే ఒక వయసొచ్చాక మనుషుల్ని గవర్నమెంటే కాల్చిపడేస్తూ ఉండాలి"

ఎంత దారుణమయిన స్టేట్‌మెంటు? మరెంత దుర్మార్గమయిన ఆలోచన? మనుషులు మరీ ఇంత ఘోరంగా ఆలోచించగలరా?

అనుమానం లేదు. ఇలా ఆలోచించే వాళ్ళు కూడా మన మధ్యనే వున్నారు. అయితే వాళ్ళు ఖచ్చితంగా రేపటి తమ పరిస్థితి గురించి కనీసం ఆలోచించనివాళ్ళే అయి వుంటారు. "నేటికోడలే రేపటి అత్త" అన్నట్టు 'నేటి యువతే రేపటి వృద్ధులు'. ఈరోజు మనం వయసులో వున్నాం కదా అని వృద్ధాప్యాన్ని అసహ్యించుకోవడం, వృద్ధులను నిర్లక్ష్యం చేయడం ఎంతవరకూ సబబు? !

ఈరోజు నువ్వు వయసులో వున్నావని ముసలాళ్ళందరినీ కాల్చి పారెయ్యాలని అనుకుంటున్నావే, రేపు నువ్వు ముసలిదానివయ్యాక నిన్ను 'పనికి'మాలిన మనిషిగా భావించి గవర్నమెంట్ కాల్చేయదలిస్తే అలాంటి ఆత్మాహుతిని నువ్వు భరించగలవా? మాటలు చెప్పడం చాలా సులభమే అంజలీ, కానీ ఆ స్థితిలో మనమున్నప్పుడే అందులోని బాధ ఏమిటో మనకు తెలుస్తుంది. అందుకని అలా మాట్లాడకే"

అంజలిమాత్రం తన వాదనను సమర్థించుకుంది. "అందరి సంగతేమోగానీ, నేను మాత్రం ముసలమ్మగా మారాక ఇంట్లోవాళ్ళకు బరువుగా మారను. చిన్నవాళ్ళచేత తిట్లు తినడం వాళ్ళచేత అసహ్యించుకోబడడం నాకు చేతకాదు. అలాంటి స్థితి వస్తే నేను సూసైడ్ చేసుకుంటాను"

వయసులోని ఆవేశంలో అలా అనుకోవడం సులభం. కానీ ఏ వయసులోనయినా మనిషి ప్రాణం తీసుకోవడం అంత సులభంకాదు. ప్రాణంమీద తీపి సర్వసాధారణమైన విషయం. అంత సులభంగా ప్రాణాలు తీసుకోగలిగివుంటే, ఈ ప్రపంచంలో బిచ్చగాళ్ళు, బాధితులు, పీడితులు... ఎవ్వరూ మిగిలేవారుకాదు.

అలా తను మనసులో అనుకుందేగానీ అంజలితో వాదించలేదు.

"ఏమ్మా, ఈ వీధిలో ఎక్కడ దించాలి? "

రేవతి ఆలోచనల్లోంచి తేరుకుంది. "అదిగో ఆ ఇల్లే", ఓ ఇల్లు రిక్షావాడికి చూపించింది. 'చాలా... చాలారోజుల తర్వాత ఈ వీధిలోకి అడుగుపెడుతున్నాను' అని మనసులోనే అనుకుందామె.

రిక్షా ఆ ఇంటిముందు ఆగింది.

రేవతి రిక్షాదిగి రిక్షావాడికి డబ్బులిస్తూ అటుచూస్తే, రామ్మోహన్ వరండాలో నిలబడి వుండడం కనిపించింది. అతడు అక్కడ నిలబడి వుండడం తనకోసం ఎదురు చూడడమే అని అర్థం కావడంతో ఆమె మనసులో అదోలాంటి భావం కదలాడింది. ఆ భావానికి అర్థమేంటో ఆమెకే తెలియదు.

ఆమె అతడిని పలకరింపుగా చూసింది. ఆ తర్వాత లోపలికి అడుగులేసింది.

అతడు ఆమెకు ఎదురుగా వచ్చాడు. "రండి... రండి... నేను మీ కోసమే ఎదురు చూస్తున్నాను"

"అయ్యయ్యో! ఎదురు చూడడమేమిటండీ?... ఇక్కడవరకూ వచ్చినదాన్ని ఇంట్లోకి రాకుండా ఎలా ఉండగలను? ఈ ఇల్లు నాకు బాగా పరిచయమైనదే కదా? " ఆమె కాస్త ఇబ్బందిపడుతూ, మరి కాస్త మొహమాటపడుతూ పలికింది.

అతడు చిన్నగా నవ్వాడు. "ఇంట్లో కూర్చుంటే ఏమీ తోచలేదు. కనీసం మీ కోసమయినా ఎదురుచూస్తూ ఉండొచ్చుకదా అని వరండాలో నిలబడ్డానులెండి"

ఇద్దరూ ఇంట్లోకి నడిచారు.

ఆమె హాలులో అడుగుపెట్టాక అటూ

ఇటూ చూసింది. ఆ వాతావరణంలో ఏదో మార్పు స్పష్టంగా కనిపిస్తుండడంతో కాస్త సంశయంగానే అడిగింది. "మీ మమ్మీ డాడీల అలికిడి వినిపించడంలేదు. వాళ్లు ఎక్కడికైనా వెళ్ళారా? "

అతడి నవ్వులో ఈసారి జీవం లేకుండా పోయింది. అతడు కేవలం పెదవులు వెడల్పు చేసి ఉంచే చెప్పాడు. "అవును... వెళ్ళిపోయారు. ఈ ప్రపంచంలో మరెవ్వ రికీ కనిపించకుండా అందరికీ అందనంత దూరం వెళ్ళిపోయారు."

"అలాగా" అనబోయి అప్పుడే అతనేమ న్నాడో అర్థం కావడంతో ఉలిక్కిపడి అతడి ముఖంలోకి ఆశ్చర్యంగా చూసింది. "అంటే... అంటే..." ఆ తర్వాత మరేం మాట్లాడాలో ఆమెకు అర్థంకాలేదు.

అతడు దీర్ఘంగా నిశ్వసించాడు. పెదవుల మీద కదలాడుతున్న నవ్వు ఒక్కసారిగా ఎగిరిపోయింది. అతడి గొంతు జీరగా పలి కింది. "అంజలి పెళ్ళయిన ఒక సంవత్సరం తర్వాత మమ్మీడాడీలు యాక్సిడెంట్‌లో చని పోయారు"

ఒక్కసారిగా గాఢమైన నిశ్శబ్దం ఏర్ప డింది.

రేవతి కొద్దిసెకనులపాటు నోటమాట రానట్టు అతడినే చూశాక, అతికష్టంమీద అడిగింది. "అంటే... అంటే... ఈ ఇంట్లో మీరొక్కరే ఉంటున్నారా? "

"అంతేకదా మరి" అతడీసారి నవ్వాలని కాబోలు ప్రయత్నించాడు కానీ నవ్వు రాలేదు.

ఆమె ఇక మాట్లాడలేకపోయింది. మాట్లా డడానికి ఇంకా ఏముంది? తను ఊహిం చని పరిస్థితులు అడుగుపెట్టడంతోనే కని పించాయి.

అతడు ఆమె ముఖంలోని భావాలను చూస్తూ చిన్నగా నవ్వాడు. ఏమిటలా షాక్ తిన్నట్టుండిపోయారు. ఈ ఇంట ఇలాంటి వాతావరణాన్ని మీరు ఎక్స్‌పెక్ట్ చేయలేదు కదూ? ... కానీ జీవితం అంటే అదే మేడమ్. మనకు కనిపించేదే నిజంకాదు"

రేవతి నెమ్మదిగా తలాడించింది. అప్పుడే ఆమె ఆ ఇంటి వాతావరణాన్ని మరింత పరిశీలనగా చూడసాగింది.

ఆ ఇంట్లో ప్రతి అంగుళంలోనూ రిచ్‌నెస్ కనబడుతోంది.

కాని...

అంత ఖరీదయిన వాతావరణాన్ని డామి నేట్ చేస్తూ ఆ ఇంట్లో శ్మశాన నిశ్శబ్దమూ కదలాడుతోంది. వాటే పిటీ!

ఆమె చూపులు క్రమంగా జాలిని సంత రించుకున్నాయి.

కొన్ని గంటలవరకూ తనదృష్టిలో అతడు చాలా అదృష్టవంతుడు. కాని తరచి చూడ గలిగితే అదృష్టవంతులనిపించే చాలామంది వ్యక్తుల వెనుక దాగిన ఏదో ఒక దుర దృష్టం వాళ్లను బాధపెడుతూనే ఉంటుం దేమో.

ఆ క్షణం ఏంమాట్లాడాలో కూడా ఆమెకు అర్థంకాలేదు. చాలాసేపటికి ఆమె తేరుకుని అంది. "నాకు... నాకీ విషయాలేవీ తెలి యవు"

"మీకు తెలిసే అవకాశం లేదుకదా? "

"ఎవ్వరూ తోడులేకుండా ఇలా ఒంటరిగా బతకడం చాలా బాధాకరమైన విషయం"

అతడిచూపు తిరిగి ఆమెమీద నిలిచింది. అతడు నవ్వలేక నవ్వుతున్నట్టుగా నవ్వి చెప్పాడు. "నవ్వుతున్న ప్రతి మనిషీ ఆనం దంగానే ఉన్నాడని అనుకోవడం తప్పు. చాలామంది నవ్వు వెనుక విషాదం కూడా దాగి ఉండొచ్చు"

ఆమె తలాడించింది.

ఇద్దరిమధ్యా నిశ్శబ్దం మెల్లగా గాఢతను సంతరించుకోవడం గమనించిన అతడు అలా జరగడం ఇష్టం లేదన్నట్టు తల తిప్పి కేకేశాడు "రాజమ్మా"

"వస్తున్నా బాబూ" కేకతోపాటే అడుగుల చప్పుడయింది.





రేవతి తలతిప్పి ఆవిడమీద దృష్టి నిలిపింది. యాభైఏళ్లు ఉంటాయి. ఆవిడ వినయం ప్రదర్శించడం చూస్తుంటే ఆ ఇంటి పనిమనిషి అన్న విషయం అర్థమయిపోతూ ఉంది.

అతడు ఆవిడతో చెప్పాడు. "స్వీట్స్‌లాంటివేవయినా పట్టుకురా రాజమ్మా"

"అలాగేబాబూ" ఆవిడ ఫ్రిజ్ వైపు అడుగు లేసింది.

"ఇప్పుడవన్నీ ఎందుకండీ? " మొహమాట పడిపోతూ అంది రేవతి.

"ఫర్వాలేదులెండి"

ఐదునిముషాల తర్వాత రాజమ్మ ప్లేట్ నిండుగా స్వీట్స్, కారప్పూస పట్టుకొచ్చి వారి ధ్దరిముందు ఉంచింది.

ఆవిడ అలా పెడుతున్నప్పుడే తనకేసి పరిశీలనగా చూడడం రేవతి గమనించింది. తనను చూసి ఆవిడ కళ్లు సంతృప్తితో మెరుస్తున్నాయి.

"తీసుకోండి" రాజమ్మ వెళ్లిపోయాక, రేవతితో చెప్పాడు రామ్మోహన్.

'వద్దు' అనడం ఇష్టంలేనట్టు రేవతి ప్లేట్ లోనుండి ఓ స్వీట్ తీసుకుని తినసాగింది.

రాజమ్మ ఈసారి ట్రేలో వాటర్ గ్లాసులు పట్టుకొచ్చి వారి ముందుంచి అడిగింది "కాఫీనా, టీనా బాబూ? "

రామ్మోహన్ రేవతి ముఖంలోకి చూస్తూ, రాజమ్మతో చెప్పాడు. "తనకు కాఫీనే ఇష్టమనుకుంటాను రాజమ్మా. ఎందుకంటే నేను వాళ్లింటికి ఎప్పుడెళ్లినా కాఫీనే ఇస్తుంది"

రాజమ్మ పెదవులు విడకుండా నవ్వి వెళ్లిపోయింది.

కాఫీ తాగాక అతడు లేస్తూ ఆమెతో అన్నాడు, "రండి ఇల్లు చూద్దురుగాని! టాబ్లెట్స్ నా రూమ్‌లో వున్నాయి ఇస్తాను"

రేవతి లేచి అతడి వెనక నడిచింది.

ఇద్దరూ పక్కనే ఉన్నగదిలోకెళ్లారు.

ఆ రూమ్ చాలా విశాలంగా ఉంది. అది అతడు ఎక్కువసేపు ఉండేగది కావడం వలన కాబోలు, చాలా నీట్‌గా సర్దుకుని ఉన్నాడు.

ఆమె ఆ గదికేసి పరిశీలనగా చూస్తూ ఉన్నప్పుడే గోడలకు వేలాడదీయబడివున్న కొన్ని ఫొటోలు దృష్టిని ఆకర్షించాయి. అందులో చాలా ఫొటోలు ఆమె పోల్చుకోగలిగింది. రామ్మోహన్, అంజలిల చిన్నప్పుడు అమ్మానాన్నలతో కలిసి వున్న ఫొటోలు అవి.

అయితే ఆ ఫొటోలన్నింటికీ దూరంగా, ఓ మూలగా వున్న ఫొటో ఆమెను మరింత ఆకర్షించింది. అరవైఏళ్ల ముసలావిడ కుర్చీలో కూర్చుని చిరునవ్వులు చిందిస్తోంది.

రేవతి అతడివైపు తిరిగి అడిగింది, "ఆవిడ మీ నాన్నమ్మగారా? "

"కాదు, అమ్మమ్మగారు"

సాధారణంగా ఏ ఇంట్లోనయినా ఆ ఇంటి హాలులోనే ఫొటోలు వేలాడదీస్తారు. అలాంటిది అతడు బెడ్‌రూమ్‌లో ఫొటోలు ఉంచుకోవడం ప్రత్యేకంగా ఉంది. పైగా ఏ మనుమడైనా తన నాయనమ్మ, తాతగార్లకు ఇచ్చిన ప్రాధాన్యత అమ్మమ్మ తరపు పెద్దలకు ఇవ్వడు. మరి ఇతడేంటి ఇలా? !

అతడు ఆమె ముఖంలోకి చూస్తుండడంతో ఆమె మనసులోని అనుమానం అర్థమయిందేమో చెప్పాడు. "నాకు మా అమ్మమ్మ అంటే చాలా ఇష్టం. నాకు ఊహ తెలిసీ తెలియని రోజులలో ఎక్కువకాలం ఆమె దగ్గరే పెరిగాను. అప్పట్లో అమ్మ 'లా' కోర్స్ పూర్తిచేస్తోంది. తన చదువుకి ఆటంకం అని నన్ను అమ్మమ్మ దగ్గర ఉంచింది. అమ్మమ్మ నన్ను గుండెలమీద పెట్టుకుని పెంచేది. ఆ స్మృతులన్నీ నాకు లీలగానయినా గుర్తున్నాయి. అమ్మ 'లా' పూర్తి చేయలేకపోయింది. అమ్మమ్మ మాత్రం జబ్బునపడింది. ఇప్పుడు నా చిన్ననాటి స్మృతులలో ఏ జ్ఞాపకమయినా



ముల్లులా గుచ్చుకుంటూ ఉందంటే, అది అమ్మమ్మ తాలూకా జ్ఞాపకమే"

చివరి వాక్యం చెపుతున్నప్పుడు అతడి గొంతులో వేదన తొంగిచూసింది. ఆ వేదన ఎదుటివాళ్ళను కదిలించేదిగా ఉంది.

"మీ అమ్మమ్మకేమయింది? "

"ఆమెకు వృద్ధాప్యంలో పక్షవాతం వచ్చింది. ఆ జబ్బుతో మంచానపడి అలాగే వెళ్ళిపోయింది"

"అయ్యో పాపం"

అతడు బెడ్‌మీద కూర్చున్నాడు. ఆమెకు ఎదురుగా ఉన్న కుర్చీ చూపించాడు. ఆమె మరేం మాట్లాడకుండా కూర్చుంది.

ఆ గదిలో గాలికూడా నెమ్మదిగా బరువెక్కుతున్న ఫీలింగ్ కలిగిందామెకు. ఆమె అతడికేసి చూడసాగింది.

అతడు చెప్పాడు, "ఆరోజు మీ అమ్మగారి పట్ల మీరు చూపిస్తున్న శ్రద్ధ, అభిమానం చూడగానే నాకెంతో ఆనందం కలిగింది. ఆ తర్వాత కారులో మీ మాటలు విన్నప్పుడు తల్లీకూతుళ్ళ అనుబంధం అంటే ఇలాగే ఉండాలనిపించింది. మా అమ్మ చేసిన ఘోరమైన తప్పు ఓసారి నాకు గుర్తొచ్చింది"

"మీ అమ్మగారు చేసిన తప్పేమిటి? "

"మీరోసారి కారులో అన్నారే, నేటి మన ఉనికికి కారణమైన తల్లిదండ్రులకు కష్టకాలంలో సేవచేయడం కష్టంగా భావించడం చాలా దారుణమైన విషయం అని ... అమ్మచేసింది అలాంటి దారుణమైన తప్పు

"మా అమ్మమ్మ ఓ పల్లెటూర్లో ఒంటరిగా ఉండేది. ఆస్తిపాస్తులకేమీ కొదువలేదు. అయితే ఆమెకు మగ సంతానం లేదు. ఉన్నదల్లా ఒక్క ఆడపిల్ల. మా అమ్మ! అమ్మకోసం అమ్మమ్మ కష్టపడి ఉండకపోవచ్చుగానీ, ప్రేమగా చూసుకున్నది నిజం. ఆమె కూతుర్నే కాదు, మనుమడైన నన్ను, మనుమరాలైన అంజలిని ఇంచుమించు




గుండెలమీద పెట్టుకుని పెంచింది. ఆ దృశ్యాలు ఇప్పటికీ నా కళ్ళముందు లీలగా కదలాడుతూనే ఉన్నాయి.

"అలాంటి అమ్మమ్మ పక్షవాతంతో మంచానపడింది. అందుకు అమ్మ పెద్దగా బాధపడలేదు. చాలా కాజువల్‌గా ఓసారి కారులో వెళ్ళి అమ్మమ్మను చూసి వచ్చేసింది. 'అదేమిటే! ఆవిడ దగ్గర కొద్దిరోజులు ఉండొచ్చు కదా'! అని నాన్నగారు అంటే 'ఎందుకండీ! ఆవిడను చూసుకునేందుకు ఇంట్లో పనిమనిషి ఉంది. బయట పనులు చూసుకునేందుకు పాలేర్లు ఉన్నారు' అనేసింది తేలికగా.

"పనివాళ్ళు ఉండొచ్చు కానీ వాళ్ళు అయినవాళ్ళు కాలేరుకదా? సరిగ్గా చూసుకునే వాళ్ళు లేక ఆరోగ్యం క్షీణించిందో లేక తన కూతురు నిరాదరణ తలచుకుని కుంగిపోయిందో తెలియదుగానీ ఆవిడ పరిస్థితి రోజురోజుకీ దిగజారిపోసాగింది. ఇలాంటి పరిస్థితిలోనే నాన్నగారు అమ్మతో అన్నాడు, "చూడవే! ఆ పల్లెటూర్లో ఆ ముసలావిడ ఒక్కతే ఎందుకు? ఆవిడ పరిస్థితి చూసొచ్చినవాళ్లు చెబుతుంటే గుండె తరుక్కుపోతోంది. పరిస్థితి అలాగే కొనసాగితే ఆవిడ ఎక్కువకాలం బతకదని వాళ్ళు అంటున్నారు. మనకి లంకంత కొంప వుంది. ఆవిడను ఏ మూలగదిలో పడేసినా ఉంటుంది. డాక్టర్‌గా ఆవిడకు నేను ట్రీట్‌మెంట్ ఇస్తాను. అందులోనూ కూతుర్ని చూసుకుంటూ ఉంటే ఆవిడకు కాస్త ఉత్సాహం వచ్చి త్వరగా కోలుకునే అవకాశం ఉంది" అన్నారు.

అప్పుడు మా అమ్మ ఏమన్నదో తెలుసా రేవతిగారూ? !

"ఏంటండి మరీనూ? ఆఖరికి ఇంటిని కూడా హాస్పిటల్‌గా మారుస్తారా? ఆవిడను ఇక్కడకు తీసుకువస్తే ఆమెకు చాకిరీ చేసే బాధంతా నా నెత్తిన పడుతుంది. అసలే ముసలికంపు. దానికితోడు బెడ్‌మీ

దనే అన్నీనూ! ఆవిడను ఇంట్లో పెట్టు కుంటే మనకు అన్నం సయిస్తుందా చెప్పండి? అందులోనూ పిల్లలున్న ఇల్లు. అలాంటి దృశ్యాలు చూస్తే వాళ్ళు రోజూ వాంతి చేసుకుంటారేమో... మీరింకేం మాట్లాడకండి. ఎవరి ఖర్మ వాళ్ళు అనుభ వించకతప్పదు. అదంతే! బహుశా ఇలాంటి పరిస్థితులలోంచి ఎస్కేప్ కావ డంకోసమే కర్మ సిద్ధాంతం సృష్టించుకు న్నారేమో!"

నాన్నగారు అమ్మ మాటలకు షాక్ తిన్నారని నాకు అర్థమయిపోయింది. అత్తారింటికి వచ్చాక తనకంటూ ఓ సంసారం ఏర్పడి తన భర్త పిల్లలమధ్య బతుకుతున్నప్పుడు ఆడది, జన్మనిచ్చిన తల్లిని అంత అపురూపంగా ప్రేమించగల దన్న విషయం ఆయనకు అప్పుడే తెలిసి నట్టుంది. బహుశా అంతటి నగ్నసత్యాన్ని ఆయన జీర్ణించుకోలేకపోయుండొచ్చు. ఆ తర్వాత ఆయన చాలారోజులు అనీజీగా ఉండడం, పరధ్యానంగా గడపడం నేను గమనించాను. అమ్మానాన్నలమధ్య అలాంటి సంభాషణ జరిగిన కొద్దిరోజులకే అమ్మమ్మ మరణించింది. అప్పుడుమాత్రం అమ్మ హడావుడిగా పల్లెకు వెళ్ళి అమ్మమ్మ శవంమీద పడి గుండెలు బాదుకుంటూ ఏడ్చింది. అదీ ఓ అర్థగంటే. అర్థగంట తర్వాత ఆ కంటిలో నీరుగానీ ఆమె ముఖంలో బాధగానీ కనిపించలేదు. అయితే అమ్మ మా అమ్మమ్మను కష్టకా లంలో చూడకపోయినా, ఆవిడకు వారసు రాలు ఈమే కాబట్టి ఆస్తిమాత్రం మాకే దక్కింది. ఎంత దారుణమయిన విష యమో చూడండి. పెద్దలపట్ల 'బాధ్యత' చూపించకపోయినా, పిల్లలకు మాత్రం 'ఆస్తిహక్కు' వుంటుంది. బాధ్యతలు అక్క ర్లేదు. హక్కులు మాత్రం ఖచ్చితంగా అమలుజరిగి తీరుతాయి. అదే లోకం తీరు"



అప్పటివరకూ రామ్మోహన్ మాటలు వింటూ అతడినే చూస్తుండిన ఆమె తల దించుకుంది. మనసు బరువయింది. మాట కరువయింది.

గతం తాలూకు బాధలో మునిగిపోయిన అతడూ మౌనాన్నే ఆశ్రయించాడు.

ఇద్దరిమధ్యా కొద్దిక్షణాలు నిశ్శబ్దం.

చాలా సేపటి తరువాత రేవతి తలెత్తి అతడికేసి చూస్తూ అంది, "మీ అమ్మగారు మరీ అంత దారుణంగా ప్రవర్తించకుండా ఉండాల్సింది కదూ? "

"అవును"

"నిజానికి ఎక్కువశాతం ఆడవాళ్ళకు కని పెంచిన తల్లిదండ్రులమీద ప్రేమ, పుట్టింటి మీద మమకారం ఉండి తీరుతాయి. అత్తా రింటిలో ఉన్నప్పటికీ పుట్టింట జరిగే సంబ రాలకు, ఇక్కడే వీళ్ళు పొంగిపోతుంటారు. అక్కడ కష్టం కలిగితే, ఇక్కడ వీళ్ళు కుంగి పోతారు. ఇది చాలా సహజమైన విషయం. అయితే అత్తారింటికి వెళ్ళిన ఆడ పిల్లకు కొన్ని పరిమితులుంటాయి. ఆడపిల్ల అత్తారింటికి ఆమె పుట్టింటివాళ్ళు వచ్చి శాశ్వతంగా వుండే అవకాశం ఉండదు. నిజానికి అది మన వారసత్వ సంప్రదాయం

కూడా కాదు. అల్లుడు ఇల్లరికం వెళ్ళడం సహజమే. కానీ ఆడపిల్ల అత్తారింటికి తన పుట్టింటివాళ్ళను తెచ్చిపెట్టుకోవడం అరుదైన విషయం. అలా జరగాలంటే అందుకు ఎన్నో అడ్డంకులు. ఆడపిల్లలను మాత్రమే కన్న తల్లిదండ్రులకు అదే దురదృష్టం అనీ అనుకోవచ్చు. అయితే మీ అమ్మగారికి అత్త మామల అడ్డంకి లేకపోయినా, భర్త సానుకూలంగా స్పందించినా ఆమె తన తల్లిని కష్టకాలంలో పట్టించుకోకపోవడమే ఘోరమైన విషయం"

"అదే నా బాధ రేవతిగారూ"

ఆరోజు హాస్పిటల్ ముందు కారు దిగినపుడు, "నా చిన్ననాటి సంఘటనలు కళ్ళ ముందు కదలాడేలా చేయగలిగారు" అని అతడు అనడం ఆమెకు జ్ఞాపకం వచ్చింది. "అతడి మదిలో బాధగా మిగిలిన చిన్ననాటి సంఘటనలు ఇవే కాబోలు" మనసులోనే అనుకుందామె.

ఏదేమైనా చిన్ననాటి సంఘటనలు మదిలో గాఢంగా ముద్రించుకుపోతాయి. ఆ జ్ఞాపకాలు ఎంతకాలానికీ మనల్ని వదలవు.

ఆమె కొద్దిసేపు మౌనాన్ని ఆశ్రయించడం చూసి అతడు అన్నాడు, "నా చిన్ననాటి అనుభవాలు చెప్పి నేను మిమ్మల్ని విసిగించినట్టున్నాను? "

"లేదు...మా అమ్మ పరిస్థితి గురించి నేను మరోసారి ఆలోచించుకునేలా చేయగలిగారు మీరు" ఆమె వెంటనే అంది.

అతడు తలాడించాడు, "ఒక్కోసారి కొందరి అనుభవాలు చూస్తుంటే, మన జీవితంలో మనకు ఎదురైన సంఘటనలు జ్ఞప్తికి వస్తాయి. అలా గత స్మృతులు మన మదిలో మెదలాడినప్పుడు అలాంటి అనుభవంతోనే సతమతమయ్యేవారితో మన జ్ఞాపకాలు పంచుకోవాలనిపించింది నాకు..."

రేవతి వెంటనే మాట్లాడలేకపోయింది. పక్షవాతంతో బాధపడుతున్న తల్లి తనకూ ఉండడంతో అతడికి అలా అనిపించి ఉండొచ్చు అనుకుందామె.

మరికొద్ది సేపటి తర్వాత అతడితో అందామె, "ఇంటిదగ్గర అమ్మకు తోడుగా మరెవ్వరూ లేరు. నేనిక బయల్దేరుతాను"

అతడు తలాడించి బెడ్ మీదనుంచి లేచాడు. పక్కనే వున్న బీరువాలోనుండి ఒక ప్యాక్ తీసి ఆమెకు అందిస్తూ చెప్పాడు, "ఇవే ఆ టాబ్లెట్స్. మీ అమ్మగారికి మూడు పూటలా వాడండి"

"అలాగే" టాబ్లెట్స్ తీసుకుని ఆమె బయటకు నడిచింది.

★ ★ ★

సంక్రాంతికి నాలుగురోజులు ముందుగానే కల్పన వచ్చింది.

స్నేహితురాల్ని చూడడంతోనే రేవతికి పోయిన ప్రాణం లేచొచ్చినంత ఆనందం కలిగింది. ఆమెను పట్టేసుకుని కుదిపేస్తూ అడిగింది "ప్రయాణం బాగా సాగిందా? "

"నో ప్రాబ్లమ్స్"

"ఇల్లు పట్టుకోవడం కష్టంకాలేదు కదా? "

"భలేదానివే! ఇంటర్వ్యూలకోసం హైదరాబాద్‌లోని మారుమూల గల్లీలలోని ఆఫీసులు కూడా వెతికిపట్టుకున్నవాళ్ళం. ఈ ఇల్లు పట్టుకోలేకపోతానా? "

రేవతి హాయిగా నవ్వింది.

కల్పన అప్పుడే మంచంమీద ఉన్న శారదమ్మను చూసి అటు నడిచింది. వెనకే వెళ్ళిన రేవతి తల్లితో చెప్పింది. "అమ్మా! నేను ఉత్తరాలలో రాస్తూ ఉండేదాన్ని, కల్పన అని నాకో మంచి ఫ్రెండ్ దొరికిందనీ... ఆమే ఈమె"

కల్పన ఆవిడకు నమస్కరించింది.

శారదమ్మ తలాడించింది. పలకరింపుగా పెదవులు కాసింత వెడల్పు చేసింది.

కల్పన రేవతివైపు తిరిగి అడిగింది, "ఆంటీకి ఇప్పుడెలా ఉంది? "

"ప్రస్తుతం ఫర్వాలేదు. కాకపోతే కోలుకుని లేచి తిరగడానికి కొంత టైమ్ పడు

తుంది" చెప్పింది రేవతి.

'ఆంటీ అసలిక లేచి తిరగ గలదా?' అన్న ప్రశ్న నోటిచివరివరకూ వచ్చింది గానీ అతికష్టంమీద ఆ మాటలు బయటకు రాకుండా నొక్కేసింది కల్పన. తను అలా అంటే రేవతితోపాటు, ఆమె తల్లి కూడా బాధపడే అవకాశం వుంది. నమ్మకం అన్నదే మనిషిని ముందుకు నడిపిస్తూ ఉన్నప్పుడు తను ఆ నమ్మకాన్ని అపనమ్మకంగా మార్చడం సబబుకాదు.

ఇద్దరూ కాసేపు అలా నిలబడ్డాక, అక్కడి నుండి కదిలి గదిలోని మరో మూలనున్న మంచంమీద కూర్చున్నారు.

అప్పుడే గుర్తొచ్చినట్టు రేవతి, కల్పనను అడిగింది, " మంచినీళ్లు తాగుతావటే? "

"కాసిన్ని ఇవ్వు"

రేవతి మంచంమీద నుండి లేచి పెరటి వైపు వెళ్లింది.

ఆమె తిరిగి ఇంట్లోకి వచ్చేసరికి కల్పన ఆ ఇంటిని పరిశీలనగా చూడడం కనిపించింది. ఆమె నవ్వుతూ అడిగింది, "ఏంటే! మా ఇంటిని పరిశీలిస్తున్నావా? "

"అవును"

"ఎలా వుంది? "

"నీట్‌గా వుంది"

"కాని చాలా చిన్ని ఇల్లు కదూ? "

"ఇల్లు ఎంత పెద్దది అన్నది కాదు ముఖ్యం. ఎంత నీట్‌గా ఉంచుకున్నామా అన్నదే ప్రధానం"

"నీకో నిజం చెప్పనా? " రేవతి కల్పన ముఖంలోకి చూస్తూ అంది.

"ఏమిటది? "

"నిజం చెప్పాలంటే ఈ నీట్‌నెస్ నా గొప్పతనంకాదు. మా అమ్మ చేస్తున్నది చూసి నేను ఫాలో అయిపోయాను. అలా... అలా ఇంటిని ఎలా శుభ్రంగా ఉంచుకోవడం అన్నది నాకు తెలిసిపోయింది. సో క్రెడిట్ గోస్ టు మై మదర్"

కల్పన మరోసారి తల తిప్పి శారదమ్మను చూసింది. 'తల్లిదండ్రులనుండి బిడ్డలు చాలా... చాలా నేర్చుకుంటారు. అది మంచి కావచ్చు లేదా చెడుకావచ్చు. ఈ తల్లి తన బిడ్డకు మంచిని పంచింది. అందు వల్లే ఆమె కష్టకాలంలో ఈ కూతురు ఆ తల్లిని నీడలా వుండి కాపాడుకుంటోంది.'

వాళ్లిద్దరూ మరికొద్దిసేపు అక్కడే కూర్చున్నాక రేవతి కల్పనతో అంది. "ఇక నువ్వు లేచి స్నానం గట్రా పూర్తిచేస్తే ఈలోపు నేను టిఫిన్ రెడీ చేసేస్తాను"

కల్పన తలాడించి మంచంమీద నుండి లేచింది. ఇద్దరూ పెరట్లోకి వెళ్లారు.

రేవతి ఆమెకు బాత్‌రూమ్ చూపించి, కావలసినవన్నీ అందించి ఇవతలికొచ్చింది.

కల్పన స్నానంచేసివచ్చేసరికి, రేవతి చుట్టింట్లో కూర్చుని కాఫీ పెడుతూవుంది.

"కాఫీ తయారు చేస్తున్నావా? వెరీగుడ్! ప్రయాణంలో అలసిపోయివచ్చి అలసట తీరేలా స్నానంచేశాక కాఫీ తాగుతూ వుంటే సూపర్‌గా వుంటుంది... కానీ...కానీ. కాఫీ ఇవ్వు"

రేవతి నవ్వుకుంటూ కాఫీ కలిపి కల్పనకు అందించింది.

కల్పన కాఫీ అందుకుని రేవతికి దగ్గర్లోనే పీటమీద కూర్చుంది.

మధ్యాహ్నానికి వంట ప్రయత్నాలు మొదలుపెడుతూ, రేవతి కల్పనతో అంది, "చెప్పవే, ఏమిటి విశేషాలు? ...మన హాస్టల్‌లో వాళ్లంతా బాగున్నారా? "

"మన హాస్టల్‌లోనివాళ్ల పరిస్థితికేంగానీ, నీ పరిస్థితి చూస్తుంటేనే నాకు చాలా బాధగా వుంది రేవతీ" ఆ మాటలు కల్పన మనసు లోతులనుండే వచ్చాయి.

"అదేంటి అలా అంటావ్? ... నా పరిస్థితికేం బాగానే వుందికదే? "

"ఏం బాగు? ... హాయిగా హైదరాబాద్‌లో వర్కింగ్ వుమెన్స్ హాస్టల్‌లో వుండి, వాళ్లు వండిపెట్టింది ఇంత తిని ఉద్యోగం చేసుకుంటున్న నువ్వు, ఇక్కడికొచ్చాక కుట్టు




మిషన్ మీద బతుకుతున్నావంటే అది గొప్ప పొజిషన్ అంటావా?... నిజంగా నీకొచ్చిన కష్టం మరే ఆడపిల్లకూ రాకూడదే రేవతీ"

"నేను మాత్రం ఇవేవీ కష్టాలనుకోవడం లేదు కల్పనా! ఇది జీవితం. మనం అనుకున్నట్టే ప్రతీదీ జరగదు. అలా జరగదు కాబట్టే ఇది జీవితమయింది. జీవితంలో ఒడిదుడుకులు సహజం. ఏదేమయినా ఇలాంటి స్థితిలో కూడా నేను మా అమ్మను కనిపెట్టుకుని దగ్గర వుండగలుగుతున్నందుకు ఆనందంగా వుంది. కాకపోతే ఎక్కడున్నా ఏదోపనిచేసి కడుపుకింత సంపాదించుకోవాలి కాబట్టి, అప్పట్లో హైదరాబాద్‌లో కంప్యూటర్ ఆపరేటర్ ఉద్యోగం చేశాను. ఇప్పుడు కుట్టుమిషన్ మీద కష్టపడుతున్నాను. అంతే తేడా"

కల్పన రేవతి ముఖంలోకి చూసింది. నిజంగానే ఆమె ముఖంలో దిగులు కనిపించడంలేదు. తనకేదో అన్యాయం జరిగిపోతోందన్న బాధ కదలాడడంలేదు. అది గమనించాక ఆమె కాస్త ఆశ్చర్యంగా అడిగింది. "అయితే నీ పరిస్థితిపట్ల నీకు బాధ కలగడం లేదా రేవతీ"

రేవతి తల అడ్డంగా ఆడించింది. "లేదు గానీ ఈ దేశ సంస్కృతి, వారసత్వ సంపదలను తలచుకుంటే మాత్రం చాలా... చాలా బాధగా వుంది కల్పనా"

"అదేంటి? " ఆశ్చర్యంగా ముఖం పెట్టింది కల్పన.

"కాకపోతే మరేంటీ? స్త్రీ, పురుషులిద్దరూ మనుషులే. బంధాలు, అనుబంధాలు ఇద్దరికీ సమానంగానే వుంటాయి. కాని పురుషుడు పెళ్లయితే తన తాలూకు ఏ బంధాన్ని, అనుబంధాన్ని తెంచుకోక్కర్లేదు. అయితే స్త్రీ... స్త్రీ మాత్రం పెళ్లితో చాలా బంధాలను తెంచుకోవాలి. చివరికి జన్మనిచ్చిన తల్లిదండ్రులతో సహా పాత మనుషులందరితోనూ అనుబంధాన్ని వదిలెయ్యాలి. మెడలో తాళిపడిన మరు నిముషం నుండి ఆమె తన పాత బాధ్యతలన్నింటినీ వదిలేసుకోవాలి. అలాంటి సమయంలో తను పుట్టి పెరిగిన ఇంటి పరిస్థితి బాగోలేకపోయినా, అక్కడి మనుషులు కష్టనష్టాలతో సతమతమవుతున్నా తను వాళ్లను పట్టించుకోకూడదు. చివరికి వాళ్లు చావుబతుకుల్లో ఉన్నా వాళ్లను కనిపెట్టుకుని ఉండాల్సిన అవసరం తనకు లేదు. తన మెడలో తాళి పడింది కాబట్టి అప్పటివరకూ తనను కళ్లల్లో పెట్టుకుని కాపాడిన వాళ్లందరినీ వాళ్ల కష్టాలకు వాళ్లను వదిలేసి తన మానాన తను వెళ్లిపోవాలి. ఇదెక్కడి న్యాయం? ఇంత గొప్పదా మన వారసత్వ సంపదా? ఇదేనా మన దేశ సంస్కృతి"

రేవతి అంత ఆవేశంగా మాట్లాడగలదన్న విషయం కల్పనకు అప్పుడే మొదటిసారి అర్థమయింది. ఆమె రేవతిని కాస్త చిత్రంగా చూస్తూ "అంటే నువ్వు ఆడపిల్ల అత్తారింటికి వెళ్లే సంస్కృతిని తప్పుపడుతున్నావా రేవతీ? " ప్రశ్నించింది.

"నేను ఆడపిల్ల అత్తారింటికి వెళ్లే సంస్కృతిలోని లోటుపాట్లను ప్రశ్నించడంలేదు. ఆడపిల్లలను మాత్రమే కన్న తల్లిదండ్రులకు నా తల్లి పరిస్థితిలాంటి పరిస్థితి ఎదురయితే ఆ ఆడపిల్ల ఏం చెయ్యాలి అని మాత్రమే అడుగుతున్నాను" రేవతి వెంటనే పలికింది.

కల్పనకు అప్పుడే ఓ అనుమానం మనసులో కదలాడింది. ఆమెకు సాయికృష్ణ గురించి కొంత తెలుసు. సాయికృష్ణ మనసేదయినా అతడితో పెళ్లి జరిగే అవకాశం ఎంత మాత్రమూ లేదని రేవతి తనతో చాలాసార్లు చెప్పింది. అందువల్లే ఆమె రేవతిని అడగగలిగింది. "అంటే.. అంటే సాయికృష్ణ నీ బాధ్యతల నుండి నిన్ను తప్పుకోమంటున్నాడా? "

"ఇంచుమించు అలాగే మాట్లాడుతున్నాడు. అతడికి నేనంటే ఇష్టమేనని అర్థమ

యిపోతూనే వుంది కాని అతడు తరతరాల సంస్కృతికి వారసుడిగానే ఉండాలనుకుంటున్నాడు తప్ప అవతలివాళ్ల కష్టసుఖాల గురించి ఆలోచించలేకపోతున్నాడు. తనకి ఇంట్లో వదినలున్నారు. అమ్మానాన్నలు హాయిగా తిరగగలుగుతున్నారు. అలాంటప్పుడు నేను ఆ ఇంటికెళ్లి చేసే సేవ ఏముంటుంది? అక్కడ అలాంటి సేవ చేయాల్సిన పరిస్థితే ఉంటే నేను ఆనందంగా అది నా బాధ్యతగా స్వీకరిస్తాను. కాని అక్కడ అలాంటి స్థితిలేదు. కాని ఇక్కడ మా అమ్మ పరిస్థితి దారుణమైనది. నేనీ ఇంట ఉండడం ఎంత అవసరమో అతడికి తెలుసు. అది తెలిసి కూడా అతడు నావైపు నుండి మా అమ్మ పరిస్థితి గురించి అసలు ఆలోచించడంలేదు. అతడు తన వైపు నుండే ఆలోచించుకుంటున్నాడు. నన్ను తనింటికి తీసుకెళ్లడానికి అమ్మ అడ్డంకి కాబట్టి ఆ అడ్డంకి వదిలించుకోమని నాకో సలహా ఇస్తున్నాడు. అలా వదిలించుకోవడానికి మనసుంటే మార్గాలు చాలా ఉంటాయట" చివరికొచ్చేసరికి రేవతి గొంతు చాలా కఠినంగా పలికింది.

కల్పన కొద్దిక్షణాలు ఆలోచించాక అంది "మనం మగవాళ్లవైపు ఆలోచిస్తే వాళ్లకూ కొంత ఈగో ఉంటుందికదే! ఇల్లరికం రావడం అంటే వాళ్లకు ఇబ్బందిగా అనిపిస్తుంది"

"ఇది ఇల్లరికం రావడం అని ఎందుకనుకోవాలి? కష్టాలలో ఉన్న ఆడపిల్లకు సహకరించడం అని ఎందుకనుకోకూడదు? "

నిజమేనన్నట్టు తలాడించింది కల్పన. తర్వాత అంది "ఏదేమయినా సాయికృష్ణకు నువ్వంటే ఇష్టం ఉండొచ్చుగానీ అతడు మంచి ప్రేమికుడు మాత్రంకాదు. మంచి ప్రేమికుడు తను ప్రేమించిన అమ్మాయి కోసం ఈగోని వదిలేయడమే కాదు. సర్వం సమర్పించి లోకాన్ని ఎదిరించడానికి సిద్ధపడతాడు"

రేవతి కల్పన స్టేట్‌మెంట్ మీద ఎలాంటి కామెంట్ చేయలేదు. నవ్వి ఊరుకుండిపోయింది. కాసేపటి తర్వాత ఆమెవైపు తిరిగి అంది "మనం ఇక లోపలికి వెళ్దామా? " అప్పటికి వంట పూర్తయింది.

"లోపలికెందుకు? ఇక్కడే కాసేపు కూర్చుందాం"

"నేనిక్కడ కూర్చుండిపోతే కుట్టడానికి బట్టలిచ్చిన అమ్మలక్కలు సాయంత్రం వచ్చి కుట్టలేదన్న నా మాట విని తిట్టుకుంటూ వెళ్లిపోతారు. అందులోనూ మొదట్లోనే అలాంటి చెడ్డపేరు రాకూడదు"

రేవతి నవ్వులో తనూ జతకలిపి "సరే లోపలికెళ్దాం పద" అంది కల్పన.

ఇద్దరూ లోపలికెళ్లాక రేవతి కుట్టుమిషన్ ముందు కూర్చుంది. కల్పన ఆమెకు దగ్గరగా కుర్చీ లాక్కుంది.

పని మొదలుపెట్టబోతున్నప్పుడు అప్పుడే గుర్తొచ్చిందేమో రేవతి కల్పనవైపు తల తిప్పింది "సారీ కల్పనా" అంది.

"ఎందుకు? " కల్పన కనుబొమలు ముడివేసింది.

"నువ్వు నాకోసం హైదరాబాద్ నుండి వస్తే నేను నీతో ఎక్కువసేపు గడపకుండా నా పనిలో పడిపోతున్నాను"

"బాధ్యత మీదపడ్డాక కాలక్షేపం చేయడానికి తీరికెలా దొరుకుతుంది? నీ పరిస్థితి నేనర్థం చేసుకోగలనుగానీ మరీ ఫీలవకుండా పని మొదలుపెట్టు. నాకు బోర్ కొట్టకుండా జాకెట్స్‌కి హుక్స్ కుట్టడం లాంటి పనులు అప్పగిస్తే మరీ మంచిది"

రేవతి నవ్వి "అలాగే" అంది.

స్నేహితురాళ్లిద్దరూ కబుర్లు చెప్పుకుంటూ పనిచేసుకుంటుంటే శారదమ్మ వాళ్లిద్దరినే చూస్తుండిపోయింది.

★ ★ ★

మర్నాడు భోగిపండుగ.

నిజానికి పండగ సంబరాల మీద మనసు పోవడంలేదు. తల్లి మంచం మీద




పడివుంటే తను పండుగ ఎలా చేసుకోగలు గుతుంది?

అయితే ఎంతో దూరం నుండి కల్పన తనింటికొచ్చింది. తనకు మనసులో బాధుం డొచ్చుగానీ ఆమెను పండుగ సంబరాలకు దూరం చేయడం ఇష్టంలేకపోయింది.

అందుకే ఆ రోజు రేవతి కల్పనను అడి గింది. "అరిసెలు లాంటి కష్టమైన పిండి వంటలు కాకుండా, సింపుల్‌గా మనం చేయగలిగిన స్వీట్స్ నీకిష్టమైన వేవో చెప్పు చేసి పెడతాను"

"అసలే ఊపిరి తీసుకోవడానికి టైం లేన ట్టుగా శ్రమపడుతున్నావ్. అలాంటిది ఇప్పుడు నీకు అదనంగా మరోపని చెప్ప మంటావా? "

"ఇది నాకు శ్రమ కాదు ఆనందం. మాకోసం ఇంత దూరం వచ్చిన నిన్ను పండుగరోజు కూడా ప్రత్యేకత లేకుండా గడి పేలా చేయడం నాకిష్టంలేదు. అందుకే సాయంత్రం బజారుకెళ్లి రెండు చీరలు కొనుక్కుందాం"

"ఇలాంటి పిచ్చిపిచ్చి వేషాలకు నేనసలు ఒప్పుకోను. పండుగ అంటే పిండివంటలు తినడం, కొత్త బట్టలు కట్టుకోవడం కాదు. పండుగ అంటే ఆత్మీయులతో ఆనందంగా గడపడం. ఇక్కడికి వచ్చిన మూడు రోజు లుగా నాకు ప్రతిరోజూ పండుగలాగే ఉంది. కాబట్టి ప్రత్యేకించి పండుగ అంటూ నన్ను ఇబ్బంది పెట్టొద్దు"

అయినా రేవతి ఒప్పుకోలేదు. ఆ సాయంత్రం బలవంతపెట్టి కల్పనను బజా రుకి తీసుకెళ్లింది. ఆమె చీర సెలక్ట్ చేసు కునేలా వత్తిడిచేసింది. బిల్లు తనే కట్టింది.

అయితే కల్పన ఆమెనూ ఓ చీర తీసుకో మని బలవంతపెట్టడంతో రేవతికి తప్ప లేదు. రేవతి తీసుకున్న చీరకు కల్పన బిల్లు చెల్లించింది.

ఇద్దరూ చీరల ప్యాకెట్స్ పట్టుకుని ఇంటి వైపు అడుగు లేస్తున్నప్పుడు కల్పన అడి గింది. "ఎలాగూ ఇంత దూరం వచ్చాం ఐస్‌క్రీమ్ పార్లర్‌కి వెళ్దామా? "

"మరి ఆలస్యమయితే ఇంటి దగ్గర అమ్మ..." రెండు సెకనులు సంశయంగా ఆగాక "సరే వెళ్దాం పదా" అంది రేవతి.

ఇద్దరూ ఐస్‌క్రీం పార్లర్‌కి వెళ్లారు. హైద రాబాద్‌లో ఉన్నప్పుడు వాళ్లు తరచుగా వెళ్లి తినే ఐటమ్ తెలుసుకాబట్టి సప్లయర్ దగ్గ రకు రాగానే కల్పన ఆర్డరిచ్చింది. "రెండు వెనీలా"

ఐదు నిముషాల తర్వాత సప్లయర్ ఐస్ క్రీమ్ తెచ్చి వాళ్ల ముందుంచి అవతలికి వెళ్లి పోయాడు.

ఇద్దరూ స్పూన్స్ అందుకుని తింటున్న ప్పుడు కల్పన చాలాసేపు మాట్లాడకుండా ఉండిపోవడం గమనించింది రేవతి. గలగ లాగోదారి హఠాత్తుగా ఆగిపోయినట్టు అని పించడంతో రేవతి అడిగింది, "ఏమిటీ కల్పనా! మరీ అంత పరధ్యాస? "

"ఏం లేదు" తల అడ్డంగా ఆడించింది కల్పన.

"ఏం లేకపోవడమేమిటీ? నీ స్వభావానికి విరుద్ధంగా ఇలాంటి సమయంలో నువ్వు మౌనంగా వున్నావంటే సమ్‌థింగ్ ఈజ్ రాంగ్. ఖచ్చితంగా నువ్వేదో ఆలోచిస్తున్నా వని అర్థమయిపోతూనే ఉంది"

కల్పన నవ్వి తలాడించింది. "నిజమే ఆలోచిస్తున్నాను"

"దేన్ని గురించి? కొంపదీసి రాబోయే మొగుడి గురించి కాదుకదా? "

"ఆడపిల్ల అసలు పెళ్లి చేసుకోకపోతే ఏమవుతుంది అన్న విషయం గురించి ఆలోచిస్తున్నాను" వెంటనే చెప్పింది కల్పన.

ఆ క్షణం రేవతి స్పూన్‌లోని ఐస్‌క్రీమ్ నోట్లో పెట్టుకోబోతూ వుంది. కల్పన మాట వినడంతోనే స్పూన్ మెల్లగా కిందికి దిగిపో యింది. ఈమధ్యకాలంలో తను తరచుగా ఆలోచిస్తున్న విషయం గురించే కల్పన కూడా ఆలోచిస్తోందని ఆశ్చర్యపోయింది.



అయినా తన ఆశ్చర్యాన్ని బయటపడనివ్వ కుండా గొంతు పెగుల్చుకుని అడిగింది, "నువ్వనేదేమిటే? "

"వినిపించలేదా లేక అర్థం కాలేదా? ఆడ పిల్ల పెళ్లి చేసుకోకపోతే ఏమవుతుందా? అని ఆలోచిస్తున్నాను"

కల్పన మనసులో అలాంటి ఆలోచన రావడానికి కారణం తనేనన్న విషయమూ రేవతికి అర్థమయింది. ఆమె మెల్లగా తేరు కుని చిన్నగా నవ్వేస్తూ ప్రశ్నించింది. "మరి ఇంతకీ ఏంతోచిందేమిటి? "

"ఎంత ఆలోచించినా జవాబు దొరకడం లేదే"

కల్పన కొద్దిక్షణాలు ఆలోచించాక చెప్పింది "ఎంత ముందు కెళ్లాలని ప్రయత్నించినా ఒక చోటుకెళ్లేసరికి ఆలోచన ఆగిపోతోందే. అదెక్కడంటే, స్త్రీగాని, పురుషుడు గాని తోడు లేకుండా బతకడం సాధ్యమేనా, అని. ప్రతి మనిషికి జీవితంలో ఓ తోడు కావాలి. కష్టసుఖాలు పంచుకునేందుకు స్త్రీకి పురుషుడి అండ అవసరం. అలాగే మగాడికీ అన్నీ తానై ఉండే ఆడది ఉండితీరాలి. ఇదిగో నా ఆలోచన ఈ స్థితిని దాటి ముందుకు వెళ్లడంలేదే"

రేవతి చిన్నగా నవ్వింది. కల్పన మీద నుండి చూపు మరల్చి రోడ్డువైపు చూసింది. జనం రోడ్డు మీద నడుస్తున్నారు. వారిలో కొందరు నెమ్మదిగా, కొందరు వడివడిగా, ఇంకొందరు హడావుడిగా ముందుకెళుతున్నారు. జీవితం ఒక అంతులేని ప్రయాణం. ఈ ప్రయాణంలో ప్రతిమనిషికీ ఓ తోడు కావాలా? ఎవరో కవి అన్నాడు 'నిన్ను నిన్నుగా ప్రేమించుటకు నీ కోసమే కన్నీరు నించుటకు నేనున్నానని నిండుగపలికే తోడొకరుండిన అదే భాగ్యము, అదే స్వర్గమూ...' నిజంగా ఈ భాగ్యం ప్రపంచంలో అందరికీ దొరుకుతుందా?

ఈ ప్రపంచంలో ఎక్కడో లక్షలో ఒకరిద్దరికి తప్ప ప్రతి మనిషికీ తోడు దొరుకుతూనే వుంటుంది. అయితే ఆ తోడు తన జోడీ కష్టసుఖాలలో ఎంత వరకూ పాలు పంచుకుంటుంది? ముఖ్యంగా స్త్రీ తోడు సంపాదించుకోవాలంటే కొంతవరకూ త్యాగం చేయక తప్పని పరిస్థితి ఏర్పడుతోంది. సో ఇలా రోడ్డు మీద నడిచే జనాలలో ఎంతమందికి నిజమయిన తోడు దొరుకుతుంది?

"ఏమిటే రేవతీ! నువ్వు కూడా తినడం ఆపేసి ఆలోచనల్లో పడిపోయావ్? "

రేవతి ఈ లోకంలోకి వచ్చింది. తలాడిస్తూ "ఏం లేదులేవే" అంది.

"మరి పెళ్లి గురించి నీ అభిప్రాయం చెప్పనే లేదే? "

రేవతి ఈసారి అదోలా నవ్వింది "ఏం చెప్పను? " అని పది సెకనులు ఆగాక చెప్పింది. "నా ఆలోచన మాత్రం నీ ఆలోచనాస్థాయిని దాటి వెళ్లిపోయింది"

"అంటే? "

"ప్రతి మనిషికీ జీవితంలో ఓ తోడు కావాలి. అలాగే స్త్రీకి కష్టసుఖాలు పంచుకునే పురుషుడి అండ అవసరం. కాని బాగా పరిశీలించి చూడు. ఈ ప్రపంచంలో ఎంతమంది మగాళ్లు స్త్రీ కష్టసుఖాలలో పాలుపంచుకుంటున్నారు? "

"నిజమే. ఈ విషయంలో ముఖ్యంగా ఈ దేశంలోని స్త్రీకి అన్యాయం జరుగుతోంది. నువ్వు అన్నట్టు ఆడది పెళ్లికావాలని కోరుకుంటే కొన్ని బంధాలను తెంచుకోక తప్పని పరిస్థితి ఇప్పుడు వుంది. కానీ ఈ విషయంలో స్త్రీ ఏం చేయగలదు? జీవితాంతం ఉండే తోడు కావాలనుకుంటే మనం కొన్ని బంధాలను త్యాగంచేసి తీరాలి. స్త్రీకి పెళ్లి చాలా చాలా అవసరం"

"నేను మాత్రం నీ అభిప్రాయంతో ఏకీభవించలేకపోతున్నానే? " తల అడ్డంగా ఆడించింది రేవతి.

"ఎందుకని" వెంటనే ప్రశ్నించింది కల్పన. స్త్రీకయినా పురుషుడికయినా పెళ్లి అవస

 

# విరిసిన ముత్యాలు

★ ఒక మంచి సాంప్రదాయబద్ధమైన ఇంటిని మించిన పాఠశాల లేదు. ప్రేమతో పిల్లలను పెంచి, విద్యాబుద్ధులు నేర్పే తల్లిదండ్రులకు మించిన ఉపాధ్యాయులు లేరు.

–గాంధీజీ

★ దైవం తనకిచ్చిన దానితో తృప్తి పడేవాడే శ్రీమంతుడు.

–వివేకానంద

★ నిన్నటి రోజును మరిచిపో ఈ రోజు కష్టించి పనిచెయ్యి. రేపటి రోజు కోసం ఆలోచించు

–అబ్రహం లింకన్

★ ఈ రోజే పశ్చాత్తాపపడి పొరపాటును సరిదిద్దుకో. రేపు చాలా లస్యం అవుతుంది.

–బెర్నాడ్‌షా

★ తొలిచూపు ప్రేమ ప్రేమకాదు. సంవత్సరాల తరబడి పరీక్షించి చూసిన ప్రేమే అసలైన ప్రేమ.

–సోక్రటీసు

★ ఈ ప్రపంచంలో బహు అరుదుగా లభించేదే లోకజ్ఞానం.

–డికెన్స్

★ ఒక చెడు పుస్తకం ఒక పెద్ద దొంగవంటిది. అది పాఠకుని విలువైన కాలాన్ని, ధనాన్ని దోచుకుంటుంది.

–బెర్నాడ్‌షా

★ నిత్యజీవితంలో కనిపించే దృశ్యాలనుంచి హాస్యాన్ని జుర్రుకోగలగడమే సిసలైన సంతోషం.

–విల్‌మేమో

★ నా బొమ్మలంటే నాకు చాలా ఇష్టం. అయితే వాటిని కొనగలిగేటంతటి వాడిని కాదు.

–పికాసో

★ కదిలే నాల్క చైతన్యాన్ని నిర్మించే కార్ఖానా
పలికే అక్షరం ప్రపంచాన్ని మేల్కొలిపే నౌబత్‌ఖానా!

–సి.నారాయణరెడ్డి

★ జీవితం నిప్పంటించిన సిగరెట్ వంటిది. అనుభవించినా, ఆదమరిచినా అది మాత్రం కాలిపోతుంది.

–ఆత్రేయ

సేకరణ: పట్నం శేషంశెట్టి

రమే. కొన్ని రకాల సుఖాలు మరికొన్ని అనుభూతులు పెళ్లిద్వారానే పొందగలం. కాని పెళ్లిలేనిదే జీవితం లేదనుకోవడం పొరపాటు. నిజం చెప్పాలంటే పెళ్లిద్వారా కొన్ని సుఖాలు, అనుభూతులు వున్నట్టే కొన్ని కష్టాలు, నష్టాలు కూడా వున్నాయి. మనందరికీ తెలిసిన విషయమే, పెళ్లితో ఆడది సెక్యూరిటీ ఫీలవుతుందిగానీ పెళ్లి ద్వారా ఆమెకు లభించే సెక్యూరిటీ ఎంత? పెళ్లితోనే స్త్రీకి సెక్యూరిటీ లభిస్తుందను కుంటే ఈ ప్రపంచంలో విడాకుల కేసులు, భర్త చేతిలో భార్యహత్య అన్న వార్తలు, వరకట్నం వేధింపులు, కష్టాలు అసలు ఉండవుగాక ఉండవ్. ఏమంటావ్ కల్పనా?"

"అది నిజమేననుకో కాని పెళ్లి కాకుండా జీవితం గడపటం ఎలా? హౌ ఇట్ ఈజ్ పాజిబుల్?"

రేవతి కొద్దిక్షణాలు మౌనంగా ఉండిపో యింది. కల్పన ప్రశ్నకు జవాబు గత కొద్ది రోజులుగా మనసులో మెదలాడుతూనే వుంది. కాని ఆ ఆలోచనను మాటలలో చెప్పడానికే మాటలు పేర్చుకోవలసిన పరి స్థితి ఏర్పడింది.

"ఏమిటే మాట్లాడవ్? అంటే పెళ్లికి ప్రత్యామ్నాయం లేదనేకదా?"

రేవతి తల అడ్డంగా ఆడించింది. "పెళ్లికి ప్రత్యామ్నాయం లేదని ఎందుకనుకోవాలి? ఉంది. పెళ్లికి ప్రత్యామ్నాయం ఉంది"

"ఏమిటది?"

"అది తప్పనిసరి మార్గం అనునుగానీ తప్పదని అనుకున్నప్పుడు వెళ్లడానికి అనువ యిన మార్గమనే అనుకుంటున్నాను"

"ఏమిటది, చెప్పమంటున్నాగా?"

"నన్‌గా మారడం"

కల్పన ఉలిక్కి పడింది. అప్పుడే నోట మాట రానట్టు ఆమె రేవతికేసే చూస్తుండి పోయింది.

ఆమె మాట్లాడకపోవడంతో రేవతే చెప్పింది. "నన్ అనగానే ఎందుకే అంతగా కంగారు పడిపోతున్నావ్? నన్ జీవితం అనగానే అదేదో కష్టాలమయం అయినట్టు అలాముఖం పెట్టావ్ ఎందుకు? మదర్‌థె రీసా లాంటి మహా తల్లులు గడిపిన జీవితం అది. మరోలా చెప్పాలంటే అదో జీవనవిధానం కూడా కాదు. అది అందరూ వెళ్లడానికి సాహసించలేని మహోన్నత మార్గం. కాదంటావా?"

"కాని ఆ జీవితంలో సుఖం, సంతోషం ఉండవుకదా?" గొంతు పెగల్చుకుని అడి గింది కల్పన.

బహుశా సుఖం అన్న పదానికి అర్థం తెలియకే నువ్విలా మాట్లాడుతున్నావను కుంటా సుఖం అంటే అర్థమేమిటో? భర్త చేత రోజూ తన్నులు తింటూ నాకేం నేను హాయిగా ఉన్నాను అనుకోవడమేనా సుఖ మంటే. అదికాదు. సాటి మనిషికోసం సర్వం త్యాగంచేయడానికి మించిన సుఖం లేదు. ఆ తరహా జీవితంలో పరిపూర్ణమైన ఆనందం లభిస్తుందన్నది నిజం. ఇతరుల దగ్గర నుండి తీసుకోవడమే తప్ప ఇవ్వడం తెలియని సాధారణ మానవులకు ఆ సంతృప్తి గురించి మాటల్లో చెప్పినా అర్థం కాదు"

కల్పన కళ్లు విస్మయంతో విప్పారితాల య్యాయి. "అంటే అంటే నువ్వు నన్‌గా మారిపోవాలనుకుంటున్నావా?"

రేవతి ఉలిక్కిపడింది. నిజానికి తన మనసులో అలాంటి కోరికలేవీ లేవు. కాక పోతే ఇలా కూడా ఎందుకు జరగకూడదు అనుకుని ఆ తరహా ఆలోచనా ధోరణిని పెంచుకుంటూ వస్తోందీమధ్య. అంతే తప్ప అలాగే చెయ్యాలని మాత్రం కాదు. కాని ఇప్పుడు కల్పన ప్రశ్న విన్నాక తను మాత్రం అలా ఎందుకు చేయకూడదన్న ఆలోచన క్షణకాలం మదిలో మెదిలి మాయమైంది.

ఆమె తల అడ్డంగా ఆడించి చెప్పింది.




"లేదే నేను నన్‌గా మారాలని అనుకోవడం లేదు. నా ఈ స్థితిలో అమ్మనే నమ్ముకుని పెళ్లికి దూరం అయితే భవిష్యత్తుకాలం గురించి కూడా ఆలోచించాల్సివస్తుంది. నాకై నేను ఆలోచించకపోయినా ఇతరులు ఆలోచించుకోమని చెపుతున్నారు. అలా నా భవిష్యత్ గురించి ఆలోచించుకుంటున్నప్పుడు ఈ మార్గం నాకు తోచింది. అందుకే చెప్పాను తప్ప అలాగే చేస్తానని నేను అనడంలేదు"

కల్పన దీర్ఘంగా నిశ్వసించింది. "నేనింకా అలాంటి నిర్ణయమేదయినా తీసేసుకున్నావే మోననుకుని కంగారు పడ్డానులే"

ఏమో ఎలా చెప్పగలం? జీవితంలో ఊహించని సంఘటనలెన్నో జరగొచ్చు నా జీవితంలో చివరి మజిలీ అదే కావచ్చేమో మనసులోనే అనుకుంది రేవతి.

ఐస్‌క్రీం తినడం పూర్తయింది. కల్పన బిల్లు చెల్లించింది.

ఇద్దరూ లేచి పార్లర్ నుండి బయటకు నడిచారు.

పదడుగులు ముందుకు వేశారోలేదో ఓ స్కూటర్ పక్కనే వచ్చి ఆగింది. స్కూటర్ మీద సాయికృష్ణ ఉన్నాడు.

స్కూటర్ పక్కనే ఆగడంతో ఉలిక్కిపడి తల తిప్పిన రేవతి అతడిని చూడడంతో హుషారుగా అంది. "హాయ్‌సాయి! ఏమిటీ హఠాత్ దర్శనం? "

"ఆఫీసునుండి ఇంటికెళుతుంటే కనిపించావ్. వెంటనే రోడ్‌క్రాస్ చేసి ఇలా వచ్చాను" అంటూనే ఆమె పక్కనే ఉన్న కల్పనకేసి ప్రశ్నార్థకంగా చూశాడు అతడు.

అతడి చూపులు గమనించి రేవతి, కల్పనను చూపిస్తూ చెప్పింది. "సాయీ! ఈమె నా స్నేహితురాలు కల్పన, హైదరాబాద్ నుండి వచ్చింది. కల్పనా! ఈయనే సాయికృష్ణగారు"

కల్పన అతడికేసి పరిశీలనగా చూస్తూనే చేతులు జోడించింది.

"నమస్తే" అతడూ ప్రతి నమస్కారం చేశాడు.

రేవతి అతడిని అడిగింది "వారం రోజుల నుండి ఇంటి వైపు రాలేదేమిటి సాయి? "

"ఆఫీసు డ్యూటీ, ఇతర పనుల వత్తిడివల్ల రాలేకపోయాను. రేపు సెలవు కాబట్టి రావాలనే అనుకుంటున్నాను"

"తప్పకుండా"

"సరయితే" అతడు తలాడించి స్కూటర్ తిప్పుకుని వెళ్లిపోయాడు.

వాళ్లిద్దరూ తిరిగి ముందుకు నడుస్తున్నప్పుడు కల్పన అడిగింది "సాయికృష్ణ అంటే ఇతడేనన్న మాట"

"అవును"

"మనిషి అందగాడే"

"మనసు మంచిది కాదని, నేను అనలేను. అతడు మాకన్నా చాలా గొప్ప స్థితిలో ఉన్నాడు. అయినా సరే నాతో స్నేహం చేశాడు. మా అమ్మ కష్టంలో ఉన్నప్పుడు వెనుకా ముందు చూడకుండా ఆదుకున్నాడు. ఆ రోజు అతడే కనుక హాస్పిటల్‌లో చేర్చకపోతే అమ్మ పరిస్థితి ఎలా ఉండేదో తలచుకుంటేనే భయంకలుగుతుంది. అలాంటి వ్యక్తి మంచివాడు కాదని నేననలేను. కాకపోతే అతడికో భయం. ఒక అమ్మాయిని ఇష్టపడుతున్నప్పటికీ ఆ అమ్మాయి కష్టాలలో ఉందని తెలిసి సహకరించలేకపోతున్న పిరికితనం అది. అంత మంచి మనిషిలోని ఆ చిన్న లోపమే మొత్తం వ్యక్తిత్వాన్ని నాశనం చేస్తోంది"

"అది నిజం" అంది కల్పన.

సాయికృష్ణ గురించి మాట్లాడుకుంటూనే ఇద్దరూ ఇల్లు చేరుకున్నారు.

★ ★ ★

భోగిపండుగ రోజు మధ్యాహ్నం వచ్చాడు సాయికృష్ణ.

అతడు లోపలికి అడుగుపెడుతున్నప్పుడే చూశాడు. రేవతి, తల్లిమంచం కింద ఉన్న కమోడ్‌ను తీస్తూ ఉంది.

ఆ దృశ్యం చూడడంతోనే అతడికి మనసులో ఇబ్బందికరమైన ఫీలింగ్ కదలాడింది. ఆ దృశ్యం అతడి ఊహాలోకానికి భిన్నంగా ఉండి ఉండొచ్చు.

ఈ ప్రపంచంలోని చాలామంది ఎక్కువగా ఊహాలోకంలోనే బతుకుతారు. జీవితమంటే ఓ అందమైన స్వప్నం. స్వప్నం లాంటి జీవితంలో ఆనందాన్ని ఆస్వాదించాలి. మన చుట్టూ సుందర వాతావరణం సృష్టించాలి.

ఊహలు తప్పుకాదు. జీవితంలో ఆనందాన్ని ఆస్వాదించాలనుకోవడం పొరపాటు కాదు. కాని మనిషి వాస్తవాన్ని మరిచిపోకూడదు. మానవ తత్వం, శరీరధర్మాలను విస్మరించకూడదు. ప్రతిమనిషికి జీవితంలో మరోదశ ఉంది. అది వృద్ధాప్యం. ఆ దశలో ఎక్కువమంది వృద్ధులు కొద్దిరోజులో, ఎక్కువ రోజులో మంచాన్న పడకుండా ఈ లోకం విడిచి వెళ్లడం జరగదు. మంచాన్న పడిన ముసలి వాళ్లను చూడవలసిన బాధ్యత పడుచువాళ్లదేకదా?

కానీ ఆ నిజం వయసులో ఉన్న చాలామంది గ్రహించలేరు. ఒకవేళ అలాంటి పరిస్థితి అనుభవంలోకి వస్తే వీలయినంత వరకూ తప్పించుకునేందుకే ప్రయత్నిస్తారు. ఇక తప్పనిసరి అనుకున్నప్పుడు తమ కలల ప్రపంచం కూలిపోయిందని ఫీలవుతారు.

సాయికృష్ణ మనసులోని ఫీలింగ్ అదే!

అప్పుడే తల తిప్పిన రేవతి అతడిని చూసింది. తల్లికి చేస్తున్న సేవ గురించి ఆమె ఎప్పుడూ ప్రత్యేకించి ఆలోచించలేదు. అందువల్లే కాబోలు ఆమె మనసులో ఎలాంటి ఇబ్బందికరమైన ఫీలింగ్‌లేదు.

అతడిని చూడడంతోనే ఆమె చాలా హుషారుగా నవ్వేస్తూ "హలోసాయి! అక్కడే నిలబడిపోయావేం? రా లోపలికి" ఆహ్వానించింది.

సాయికృష్ణ లోపలికి అడుగుపెట్టాడు.



కుట్టుమిషన్ ముందు కూర్చుని జాకెట్ హుక్స్ కుడుతున్న కల్పన అతడిని చూడడంతోనే మర్యాదపూర్వకంగా లేచి నిలబడింది.

అతడు తిన్నగా శారదమ్మ మంచం దగ్గరకెళ్లి పక్కనే నిలబడ్డాడు. "ఎలా ఉంది?" అడిగాడు ఆవిడను.

ఆవిడ తలాడిస్తూ కళ్లతోనే ఫర్వాలేదన్నట్టుగా సైగచేసింది.

రేవతి చాట తీసుకుని పెరట్లోకి వెళుతూ అతడితో చెప్పింది. "రెండు నిముషాలు కూర్చో సాయి! వచ్చేస్తాను"

అతడు తలాడించి గదిలో మరో మూల వున్న మంచంవైపు నడిచాడు.

అక్కడే ఉన్న కల్పన అతడిని చూసి పలకరింపుగా నవ్వింది. "కూర్చోండి" అంది మంచం చూపిస్తూ.

అతడు మంచం మీద కూర్చున్నాక ఆమెను అడిగాడు "మీరూ మా రేవతి హాస్టల్‌లో రూమ్మేట్సా?"

"అవునండి"

"ఒకసారి మాటల మధ్య తను చెప్పింది. అలా గుర్తుండిపోయారు"

ఇంతలో రేవతి పెరట్లో నుండి వచ్చింది. ఆమె చేతులు, ముఖం సబ్బుతో కడుక్కుని రావడం వలన కాబోలు చక్కని పరిమళం అతడి ముక్కుపుటాలను తాకింది. అప్పటి వరకూ ఉన్న అనీజీనెస్ కొద్దిగా తగ్గింది.

అతడు తన చేతిలో ఉన్న స్వీట్ ప్యాకెట్ ఆమెకు అందించాడు.

ఆమె ఆ స్వీట్స్ ప్యాకెట్ అందుకుని అడిగింది "ఎందుకిది సాయి? ఏమిటి విశేషం?"

"పండుగ రోజుగదా"

"పండుగరోజు కాబట్టే ఉదయం రెండు రకాల స్వీట్స్ చేశాను. ఉండు తీసుకొస్తాను" ప్యాకెట్‌తో సహా ఆమె పెరట్లోకెళ్లింది.

సాయికృష్ణ తడబడ్డాడు. పండుగరోజు ఆ ఇంట పిండివంటలు చేసే పరిస్థితి ఉంటుం

దని అతడు ఊహించలేదు. సర్వం చూసు కోవలసిన తల్లి జీవచ్ఛవంలా మంచాన పడివుంటే దిక్కుతోచని కూతురు దిగాలు పడి వుంటుందని అనుకున్నాడు. కాని ఇక్కడ తను ఊహించని పరిస్థితి ఎదుర యింది. అలాంటి పరిస్థితిని అతడు జీర్ణిం చుకోలేకపోయాడు. అయినా ఓ మనిషి మంచంమీద శవంలా పడివుంటే ఇంట్లో పండుగ చేసుకోవడమేంటి?

తన ఊహకు భిన్నంగా జరిగేదేదీ మనిషి జీర్ణించుకోలేడుకదా?

అతడు ఆ ఆలోచనల్లో వుండగానే రేవతి ప్లేట్‌లో రవ్వలడ్డు, గులాబ్‌జామ్ పట్టు కొచ్చి అతడి ముందుంచింది. "తీసుకోండి"

సాయికృష్ణ రవ్వలడ్డు అందుకోబోతుంటే కల్పన కంగారుగా అంది "ఆగండాగండి"

అతడు తీసుకోవడం ఆపి ఆమెకేసి చూశాడు.

"ఆ స్వీట్స్ తినబోయే ముందు మీకో విషయం చెప్పాలి"

"ఏమిటండీ? "

"రేవతి జీవితంలో మొట్టమొదటి సారి చేసిన పిండివంటలవి. ఆ విషయం మీకు ముందుగా తెలియజేయడం మంచిదికదా అని చెపుతున్నానంతే.. ఆ తర్వాత మీ ఇష్టం"

సాయికృష్ణ చెయ్యి వెనక్కు తీసేసుకు న్నాడు. రేవతి నవ్వును బిగపట్టుకుని కల్ప నకేసి సీరియస్‌గా చూసింది.

అతడు ఆమెవైపు చూడకుండానే కల్పన కేసి చూస్తూ అడిగాడు "ఇక్కడకి దగ్గర్లో ఓ టెలిఫోన్ బూత్ చూసినట్టు గుర్తు. ఉంది కదాండీ? "

"ఉందండి" జవాబిచ్చాక కల్పన ప్రశ్నిం చింది. "ఎందుకడుగుతున్నారు? "

"ఒకవేళ తిన్నాక తప్పనిపరిస్థితి ఏర్పడితే మీరు అంబులెన్స్‌కి ఫోన్ చేయొచ్చుకదా అని! అంబులెన్స్ ఫోన్ నంబర్ తెలుసు కదూ వన్‌నాట్‌వన్"

కల్పన సీరియస్‌గానే జవాబిచ్చింది. "తెలుసండీ! నో ప్రాబ్లమ్. ఐ విల్ డు మై లెవెల్ బెస్ట్"

రేవతి ఇక నవ్వును ఆపుకోలేకపోయింది. పకపకానవ్వేశాక వెంటనే బుంగమూతి పెట్టి చెప్పింది. "మరీ అలాంటి పరిస్థితి రాదులే. ఎందుకంటే అమ్మ చేస్తున్నప్పుడు చూస్తూ వుండేదాన్నిగదా! ఎలా చేయాలో నాకు తెలుసు"

శారదమ్మ ప్రస్తావన రావడంతోనే సాయి కృష్ణ తల తిప్పి ఆవిడను చూశాడు. ఆవిడ చూపులు తమ ముగ్గురి మీదే ఉన్నాయి.

అతడికి అర్థమైందోలేదోగాని వాళ్ల నవ్వులు చూస్తుంటే ఆమెకు తన పరిస్థితి తనకు గుర్తు రావడంలేదు. తనో పక్షవాత రోగినన్న విషయం ఆవిడ తాత్కాలికంగా మర్చిపోతుంది. నిజానికి జబ్బుపడిన మని షికి కావలసింది అదే. తన జబ్బు తనకు గుర్తురాకూడదు. తన జబ్బు వలన ఇంట్లోని వాళ్లంతా సుఖసంతోషాలు కోల్పో యారన్న ఫీలింగ్ వాళ్లకు కలగకూడదు. అలాంటి వాతావరణాన్ని కలిపించుకోవల సిన బాధ్యత తప్పకుండా కుటుంబసభ్యు లదే.

సాయికృష్ణ తల తిప్పుకున్నాడు. "అయితే తినమంటావా? " రేవతి మీద చూపు నిలిపి ప్రశ్నించాడు.

"నిర్భయంగా తినొచ్చు" రేవతి చెప్పింది.

అతడు రవ్వలడ్డుని అందుకుని తిన్నాక మనస్ఫూర్తిగానే మెచ్చుకున్నాడు. "చాలా బాగా చేశావ్ రేవతీ"

"థాంక్యూ... మరేమనుకున్నావ్. రేవతా, మజాకా? " రేవతి భుజాలెగరేసింది.

అతడు నవ్వాడు.

కల్పన అంది. "ఆయన నీ వంట మెచ్చు కున్నారు కాబట్టి మధ్యాహ్నం భోజనం కూడా తినిపించు. భోజనం కూడా రుచి చూసి చెపుతారు అంబులెన్స్‌కు ఫోన్ చెయ్యాలో వద్దో!"

"అది ప్రత్యేకించి చెప్పాల్సిందేమీకాదు. సాయి ఈమధ్యాహ్నం ఇక్కడే భోంచేయబో తున్నాడు" రేవతి వెంటనే అంది.

సాయికృష్ణ కంగారుపడ్డాడు. "లేదు లేదు... నేను మధ్యాహ్నం వరకూ ఉండబో వడంలేదు"

"ఏం ఎందుకని? " రేవతి ప్రశ్నించింది.

"మధ్యాహ్ననికి ఇంటికొచ్చేస్తానని చెప్పివ చ్చాను"

"చెపితేనేం రావడం లేదని ఇప్పుడు ఫోన్ చేసి చెప్పండి"

"చెప్పొచ్చు కాని పండుగ రోజు కాబట్టి ఇంట్లో వాళ్లు భోంచేయకుండా నాకోసమే ఎదురు చూస్తుంటారు. ఈ రోజు కాకుండా మరోరోజు ఖచ్చితంగా భోంచేస్తాను"

"అయితే ఖచ్చితంగా మీకు మా రేవతి వంటమీద అనుమానంగా ఉందన్నమాట" కల్పన నవ్వుతూ అంది.

"భలేవారే! నాకలాంటి భయాలేం లేవు... ఈ రోజుకాకపోతే మరోరోజు ఖచ్చి తంగా భోంచేస్తాను సరేనా? "

అతడిని ఇబ్బంది పెట్టడం ఇష్టం లేనట్టు రేవతి నవ్వుతూనే "నో ప్రాబ్లమ్" అంది.

సాయికృష్ణ రవ్వలడ్డు, గులాబ్ జామ్ తినడం పూర్తిచేశాడు.

రేవతి కాఫీ కలుపుకొచ్చేందుకు హాలులో నుండి పెరట్లోకి వెళ్లింది.

అతడు కల్పనతో మాటలు కలిపాడు. "మీరు మరో పది రోజులు ఉంటున్నారు కదా? "

"పదిరోజులు కాదుగానీ ఇంకో నాలుగు రోజులు వుంటానండి"

అతడు హైదరాబాద్‌లో ఆమె ఉద్యోగం గురించి అడిగాడు.

"స్టార్ హోటల్ కాబట్టి పెద్దగా సమస్య లేవీ ఉండవండి. కరెక్ట్‌గా ఎనిమిది గంటల డ్యూటీ మూడు వేల రూపాయలు జీతం ఇస్తారు. రిసెప్షన్‌లో కూర్చోవడం కస్టమ ర్స్‌కి సమాధానం చెప్పడం. రిజిస్టర్‌లు మెయిన్‌టెయిన్ చేయడం అంతే"

"అయితే హోటల్ రిసెప్షనిస్ట్ జాబ్ హాయిగా ఉంటుందన్న మాట"

"అలా అనేం కాదు. ప్రతి ఉద్యోగం లోనూ ఏవో కొన్ని సమస్యలున్నట్లే హోటల్ రిసెప్షనిస్ట్ ఉద్యోగంలోనూ కొన్ని ప్రాబ్లమ్స్ వున్నాయి. మాది స్టార్ హోటల్ కాబట్టి వచ్చేవాళ్లంతా ఖరీదయిన మను షులే అయి వుంటారు. అలాంటి వాళ్లలో మనం ఒకరకమైన మనస్తత్వం చూడొచ్చు. వాళ్లలో కొందరు మేము... ఐ మీన్ హోటల్ స్టాఫ్ ఎంత పెద్ద తప్పు చేసినా చిరునవ్వుతో ఇట్సాల్‌రైట్ అంటారు. అదే మరి కొందరు చిన్న తప్పుకే కసురుకోవడం విసుక్కోవటం చేస్తుంటారు. సో అవతలి వ్యక్తి అభినందించినా కసురుకున్నా ముఖం మీద నుండి చిరునవ్వు తొలగిపోకుండా చూసుకోగలగడమే స్టార్ హోటల్ రిసెప్ష నిస్ట్ ముఖ్యవిధి" చెప్పింది కల్పన నవ్వుతూ.

"అంతే కదామరి? అందులోనూ అలాంటి హోటల్స్‌లో కస్టమర్స్ అంటే వి.ఐ.పి.లే. వీలయినంత వరకూ వాళ్లకు ఎలాంటి ఇబ్బంది కలగకుండా చూసుకో వడం మేనేజ్‌మెంట్ బాధ్యతే"

"అంతేనండి"

"నాకు తెలిసినంతలో ఎయిర్‌హోస్టెస్ ప్యాసెంజర్స్ పట్ల, స్టార్ హోటల్ రిసెప్ష నిస్ట్ కస్టమర్స్ పట్ల చూపించాల్సినంత మర్యాద మరే ఉద్యోగి ప్రదర్శించనవసరం లేదనుకుంటాను"

"అదీ నిజమేనండి" చెప్పింది కల్పన.

అప్పుడే రేవతి కాఫీ కప్పులతో లోపలికి ప్రవేశించి వాళ్లిద్దరికీ కప్పులు అందిస్తూ అడి గింది. "ఏం మాట్లాడుకుంటున్నారు? "

"హోటల్ రిసెప్షనిస్ట్ ఉద్యోగం అనే ఏముంది? ఉద్యోగం చేసే ఆడవాళ్లకి ఏ ఉద్యోగంలోనైనా ఏవో కొన్ని కష్టాలు ఉండి తీరుతాయి" తన కాఫీ కప్పుతో వాళ్లకెదు రుగా కూర్చుంటూ అంది రేవతి.




"అయితే ఈ ఉద్యోగంలో మరింత ఎక్కువ వినయ విధేయతలు కావాలని అంటున్నాను"

"అది నిజమే" అన్నాక రేవతి అడిగింది. "ఇంతకీ కాఫీ ఎలా వుంది? "

"సూపర్‌గా ఉంది" కల్పన నవ్వుతూ అంది.

"నీ కాఫీ మీద నాకెలాంటి అనుమానమూ లేదులే రేవతీ" సాయికృష్ణ నవ్వుతూ అన్నాడు.

రేవతి కూడా నవ్వింది.

ఆ ముగ్గురూ మరికాసేపు కబుర్లు చెప్పుకుంటూ కూర్చున్నారు.

మాటల మధ్యలో సాయికృష్ణ రేవతిని అడిగాడు "డాక్టర్ రామ్మోహన్ ఈమధ్య వచ్చి చూశాడా? "

"నాలుగురోజుల క్రితం కూడా వచ్చారు. తనకు వీలయినపుడల్లా వచ్చి అమ్మను చూసి వెళ్తున్నారు" జవాబిచ్చింది రేవతి.

సాయికృష్ణకి ఆ టాపిక్‌ని పెంచడం ఇష్టంలేనట్టుంది. "అలాగా" అనేసి ఊరకుండిపోయాడు.

మరికాసేపటికి అతడు వెళ్లిపోయాడు.

అదేరోజు సాయంత్రం రామ్మోహన్ కూడా తమ ఇంటికి రావడం రేవతికి ఆశ్చర్యం కలిగించింది.

ఆ ఇంట పండుగ వాతావరణం కదలాడడం గమనించిన అతడు లోపలికి రావడంతోనే ఆనందంగా చెప్పాడు. "వెరీగుడ్! ఈ ఇంట నేను కోరుకున్న వాతావరణం కదలాడుతోంది'

అతడి రాక ఆశ్చర్యం కలిగించినా ఆనందమూ జనించేలా చేసింది "రండి రండి" ఆమె హుషారుగా అంది.

"నిజానికి నాకు సంతోషంగా ఉన్నా కాసింతకోపం కూడా వస్తోంది"

రేవతి కొద్దిగా కంగారుపడి అడిగింది "ఎందుకండి? "

"నేను ఒంటరివాడినని తెలిసీ ఇంత మంచి వాతావరణంలోకి నన్ను ఆహ్వానించకుండా ఉన్నందుకు"

ఆమెకు కొద్ది క్షణాలపాటు ఏం మాట్లాడాలో అర్థం కాలేదు. "మీరు... మీరు వస్తారని అనుకుని ఉంటే తప్పక పిలిచి ఉండేదాన్ని"

"పోనీలేండి. మీరు పిలవకపోయినా వచ్చేశాను" అతడు నవ్వాడు.

ఆమె కూడా నవ్వింది "కూర్చోండి"

అతడు మంచం మీద కూర్చుంటూ అప్పుడే కల్పనకేసి చూశాడు. రేవతి అతడి చూపులు గమనించి చెప్పింది "ఈమె నా స్నేహితురాలు కల్పన, హైదరాబాద్ నుండి వచ్చింది"

రామ్మోహన్, కల్పనలు ఒకరినొకరు విష్ చేసుకున్నారు.

రేవతి లోపలకెళ్లి తను తయారుచేసిన స్వీట్స్ తెచ్చి అతడి ముందుంచింది.

అతడు అవి తింటూ అడిగాడు "స్వీట్స్ చాలా బాగున్నాయి. ఎవరు చేశారు? "

"నేనే" చెప్పింది రేవతి.

"చాలా బాగా చేశారు. మరి సంక్రాంతి రోజు కూడా నాకిలాంటి స్వీట్స్ తినిపించే అదృష్టం కలిగించకూడదా? "

"దానికేం భాగ్యం. రండి"

"నేనిక్కడకు రావడం కాదు. మా ఇంట కూడా కాస్తపండుగ కళ కదలాడేలా చేయండి" అతడు నవ్వాడు.

"అంటే మీరనేది? "

"రేపు మీరు మా ఇంటి అతిథులు. అయితే ఈ ఆతిథ్యంలో ప్రత్యేకత ఏమిటంటే మీరే వంట చేసి మీరు తింటూ నాకింత పెడతారన్నమాట"

రేవతి వెంటనే సమాధానం చెప్పలేకపోయింది. ఆమె మెల్లగా తల తిప్పి తల్లిముఖంలోకి చూసింది.

శారదమ్మ చూపులతోనే అనుమతి మంజూరు చేసింది.

రేవతి అతడివైపు తిరిగి చెప్పింది

"అలాగే రేపు పదింటికి నేనూ కల్పన మీ ఇంటికొస్తాం"

"థాంక్యూ"

మరికాసేపటి తర్వాత అతడు లేచి శారదమ్మ దగ్గరగా వెళ్లాడు. ఆమెను పలకరించాక పరీక్షించాడు.

కల్పన వైపు తిరిగి "వెళ్లొస్తానండీ" అని చెప్పి బయటకు నడిచాడు.

అతడు బయటకు నడుస్తుంటే ఆమె అతడిని అనుసరించి వీధిగేటు వరకూ వచ్చింది.

రామ్మోహన్ కారువైపు కదలబోతూ ఆగి ఆమెతో చెప్పాడు. "జీవితంలో కష్టాలు రావచ్చు కాని కష్టాలలో కూడా సంతోషంగా ఉండాలని ప్రయత్నించడం చాలా గొప్ప విషయం. నేను మీ ఆలోచనా ధోరణిని మెచ్చుకుంటున్నాను"

"మీరే విషయం గురించి మాట్లాడుతున్నారో నాకర్థం కావడంలేదు"

"నేను చాలామంది పేషెంట్లను, వాళ్ల బంధువులను చూశాను. మనిషికి అనారోగ్యం అన్నది చాలా సహజమైన విషయం. తమ ఇంట్లో ఒకరు అనారోగ్యం పాలయితే దిగులు పడడం కనీస మానవ స్పందన. ఇతరుల మీద మనుకున్న ప్రేమకు నిదర్శనం అది. అయితే కొన్ని చోట్ల ఈ స్పందన లేదా ప్రేమ విపరీత చేష్టలకు దారితీస్తోంది. ఒక ఇంట ఓ వ్యక్తి అనారోగ్యం పాలయితే ఇక ఆ ఇల్లే ఓ బాధా ప్రపంచంలా మారిపోతుంది. ఆ ఇంట్లోని వాళ్లందరిలో దిగులు స్పష్టంగా కనిపించడం చూడొచ్చు మనం. ఇతరుల అభిప్రాయం ఎలావున్నా నా దృష్టిలో మాత్రం అది చాలా తప్పు. ఎందుకంటే దిగులన్నది ప్రదర్శించ అవసరంలేని వేదన. ఇలా ప్రదర్శించబడే దిగులు వలన ఆ

కుటుంబసభ్యులకు సమాజం దృష్టిలో గొప్పతనం ఆపాదించబడొచ్చుగానీ అనారోగ్యంలో మంచానబడి ఉన్న రోగి మాత్రం తన కుటుంబ సభ్యుల దిగులు కారణంగా మరింత కుంగిపోయే అవకాశం ఉంది. అందువల్లే ఏం జరిగింది? అసలేమీ జరగలేదు అన్నంత కాజువల్‌గా మన పనులు మనం చేసుకుంటూ మనం సంతోషంగా ఉంటూ రోగికి సంతోషం కలిగించడంవలన ఆ వ్యక్తి చాలా త్వరగా కోలుకునే అవకాశం ఉంది. ఇప్పుడు మీ ఆలోచనా ధోరణి అదే కదూ? ”

ఆమె నెమ్మదిగా తలాడించింది. తన మనసు తెలుసుకున్న మనిషి మరొకరు ఉండడంవలన కాబోలు ఆమెకు ఆనందం కలిగింది. ఆ ఆనందం తాలూకూ అనుభూతి కళ్లల్లో నీళ్లు తిరిగేలా చేసింది.

అయితే సుడులు తిరిగేకన్నీళ్లు అతడి కంట పడకుండా తలదించుకుని చెప్పింది “అమ్మ ముఖంలో దిగులు నేను చూడలేను. అందుకే ఈ ముసుగు. కాని ముసుగయితే వేసుకున్నానుగానీ నా ఈ ముసుగు చూసి ఇరుగుపొరుగు వాళ్లు తల్లి అలా ఉంటే ఆ కూతురు హాయిగా పండగ జరుపుకుంటోంది. అనుకుంటారేమోనన్న భయం కూడా ఉంది”

“లోకులు కాకులు అని ఏనాడో చెప్పారు”

“అదీ నిజమే”

“ఉంటాను” అంటూ అతడు కారువైపు నడిచాడు.

కారు కనుమరుగయ్యాక రేవతి ఇంట్లోకి వెళ్లింది.

★ ★ ★

మర్నాడు ఉదయమే రేవతి, కల్పనలు రామ్మోహన్ ఇంటికెళ్లారు.

వాళ్లను చూడడంతోనే రామ్మోహన్ ముఖం విప్పారింది.

వాళ్లకు సోఫాలు చూపించి కూర్చోమని చెప్పి తను వాళ్లకు ఎదురుగా కూర్చు న్నాడు. అలవాటుగా వంటగదివైపు తిరిగి "రాజమ్మా" అన్నాడు. అప్పుడే అసలు విషయం గుర్తొచ్చిందేమో నాలుక్కరుచుకు న్నాడు.

అది గమనించిన రేవతి అడిగింది "రాజమ్మ లేదాండీ"

"యజమాని ఒంటరివాడని తెలిసినప్ప టికీ పనివాళ్లు పండుగరోజు ఉండరుకదా రేవతిగారూ"

ఆమె కొద్దిక్షణాలు మౌనంగా వుండి అటుపైన అతడితో అంది "కిచెన్ ఎక్క డుందో చెప్పండి"

"అయ్యో! మా ఇంటికి అతిథులుగా వచ్చిన మీరు వచ్చీ రావడంతోనే కిచెన్‌లో దూరిపోతారా? కాసేపు ఇలా కూర్చుని మాట్లాడండి"

"మేము వంట చేస్తూ కూడా మీతో మాట్లాడొచ్చుకదండీ"

అతడు నవ్వి "సరే పదండి" అన్నాడు.

ముగ్గురూ కిచెన్‌లో ప్రవేశించారు.

రేవతి ఆ కిచెన్‌ని పరిశీలనగా చూసింది. ఆ గది తాము ఉంటున్న ఇంటి విస్తీర్ణంలో సగానికి పైగానే ఉంది. అక్కడ సుఖంగా వంటపని పూర్తి చేసే సౌకర్యాలన్నీ ఉన్నాయి. గ్యాస్ స్టవ్, కుక్కర్‌లు, మిక్సీ హీటర్‌లు, ఇంకా ఎన్నెన్నో.

రామ్మోహన్‌ని మొదటిసారి చూసిన పుడు అతడు స్థితిపరుడని అనుకుందేగానీ మరీ అంతటిస్థాయి ఊహించలేదు కల్పన. అందువల్లే కాబోలు ఆమె కాస్త ఆలస్యంగా పరిసరాలు గమనిస్తోంది.

అతడు ఆమె చూపులు గమనించినట్టుగా అన్నాడు. "రండి మా ఇల్లు చూపిస్తాను"

కల్పన రేవతి వైపు చూసింది. రేవతి ఆమెను వెళ్లమన్నట్టుగా కళ్లతోనే సైగ చేసింది. ఆమె రామ్మోహన్ వెంట నడి చింది.

రామ్మోహన్ కల్పనకు ఇల్లంతా తిప్పి చూపించాడు.

కల్పనకు ఆ ఇల్లంతా తిరిగి చూశాక రామ్మోహన్ వ్యక్తిత్వం అర్థం చేసుకున్నాక అనిపించింది. ఆ ఇంటికి ఇల్లాలిగా ఎవరొ స్తారోగానీ ఆమె చాలా అదృష్టవంతురాలు అని.

ఇల్లంతా చూపించడం అయ్యాక రామ్మో హన్ ఆమెను అడిగాడు "మా ఇల్లు ఎలా ఉందండీ"

"వర్కింగ్ వుమెన్స్ హాస్టల్‌లోని ఇరుకు గదుల్లో బతుకుతున్న నాకు ఈ ఇల్లు ఓ స్వర్గలోకంలా అనిపిస్తోంది"

రామ్మోహన్ భుజాలెగరేశాడు. "బ్రహ్మా చారిని పైగా బిజీలైఫ్. ఉదయం నుండి సాయంత్రం వరకూ పేషెంట్స్‌తో అలసి పోయి ఇంటికి చేరుతాను. ఇంటికొచ్చాక కూడా తీరిక ఉండదు. మర్నాటి కేసులు గురించి ఏవయినా ప్రాబ్లమ్స్ ఉంటే రిఫరె న్సులు చదువుకోవడం, ఇతరత్రా పనులతో సరిపోతుంది. అప్పటికీ ఉన్నంతలో నీట్ గానే ఇంటిని ఉంచుకునేందుకు ప్రయత్ని స్తాను"

కల్పనది రేవతిలా విని వూరుకునే మన స్తత్వం కాదు. ఏ మాత్రం ఆలోచించకుండా అనేసింది "అయినా మీకింత కష్టం ఎందు కండీ? హాయిగా పెళ్లి చేసేసుకుంటే మీ ఆవిడే ఇవన్నీ చూసుకుంటుందికదండీ?"

ఆమె అలాంటి ప్రశ్న అడుగుతుందని ఊహించకపోవడంవల్ల కాబోలు అతడు కాస్త కంగారుపడ్డాడు. కల్పనకూ తను అడి గేశాకే అతి చనువు తీసుకున్నానేమో అని పించి కింది పెదవి పై పంట నొక్కి పెట్టి తలొంచుకుంది.

కొద్దిక్షణాల నిశ్శబ్దం తర్వాత అతడు అన్నాడు. "మీరన్నది నిజమేననుకోండి. కాని కాని ఎందుకనో తెలియదు, నాకు పెళ్లి మీద ధ్యాసపోవడంలేదు"

తన ప్రశ్నకు అతడు ముభావంగా ఉండి




పోకుండా జవాబు చెప్పడంతో ఆమె గిల్టీఫీలింగ్ ఎగిరిపోయింది. దాంతో అలవాటు ప్రకారం తిరిగి నవ్వుతూ చనువుగా అడిగేసింది. "అదేమిటండీ! ముప్ఫయ్యేళ్లొచ్చినా పెళ్లి మీదకు ధ్యాసపోవడం లేదంటే చాలా చిత్రంగా వుంది. కొంపదీసి అలాంటి కేసేమయినా కాదుకదా? "

అతడు అర్థం కానట్టు ముఖం పెట్టాడు.

"అదేనండీ ప్రేమ ఫెయిల్ కావడం"

అతడి ముఖం ఎర్రగా మారిందిగానీ వెంటనే సర్దుకుని నవ్వేశాడు. కల్పన మనస్తత్వం అతడికి అర్థమయింది. రేవతికి పూర్తిగా భిన్నమయిన మనస్తత్వం ఆమెది. కొద్దిగా చనువిస్తే పూర్తిగా ఆరాలు తీసేస్తుంది.

అయితే ఆమె మనస్తత్వం ప్రస్తుతానికి తనకి ఇబ్బందిగా అనిపించలేదు. అందువల్లే అతడు చిరునవ్వుతోనే చెప్పాడు. "లాంటిదేమీలేదు"

ఆమె వెంటనే అంది. "అలాంటిదేమీ లేదంటే నేను ఒప్పుకోనండీ. అది ఖచ్చితంగా అబద్ధమేనని నా అభిప్రాయం"

అతడు ఆమె కేసి కాసింత ఆశ్చర్యంగా చూసి అడిగాడు "ఎందుకని? "

"ఎందుకంటే ఏ యువకుడయినా సరయిన కారణం లేకుండా పెళ్లికి విముఖత చూపడు. ఇలా విముఖత చూపే వ్యక్తులకు చాలావరకూ కారణం ఒకటే అయివుంటుంది. అది లవ్‌లో ఫెయిల్ కావడం. అందులోనూ డాక్టర్ ప్రొఫెషన్‌లో ఉన్నారంటే కాలేజీ లైఫ్‌లో కొంతమంది అమ్మాయిలతో తప్పకుండా చనువుగా వుండి వుంటారు. చనువుగా ఉన్నారంటే లవ్‌లో పడే ప్రమాదమూ తప్పకుండా వుంటుంది. సో... "

అతడు దీర్ఘంగా నిశ్వసించి చెప్పాడు. "నేను పెళ్లి చేసుకోకపోవడానికి కారణం మీరూహించుకునేది మాత్రంకాదు"

"మరేమిటి? "

అతడు చెప్పాడు. "నాకు నచ్చిన అమ్మాయి ఇంతవరకూ తారసపడలేదు"

"ఈ మాట మాత్రం నేను నమ్మలేనండి. ఈ దేశంలో కాదుకాదు ఈ రాష్ట్రంలోనే ఈ ఊళ్లోనే అందమైన అమ్మాయిలెందరో ఉన్నారు. వాళ్లలో ఒక్క అమ్మాయి...!! ఒక్క అమ్మాయి కూడా మీకు నచ్చలేదంటే ఏమనుకోవాలి? బహుశా మీరు ప్రయత్నించలేదనే నేను అనుకుంటున్నాను. ఏమంటారు? "

"అది కొంతవరకూ నిజమేకావచ్చు కానీ ఇక్కడ నాకు నచ్చడం అంటే మీరూహించినట్టు నేను అందం, ఐశ్వర్యం కోరుకోవడం లేదు"

"మరి? " ఆమె అతడికేసి ఆశ్చర్యంగా చూసింది.

అతడు ఆమె మీంచి చూపులు మరల్చుకున్నాడు. అతడి చూపులు కిటికీలోంచి సాగి కనిపించే నీలాకాశం మీద నిలిచాయి. అతడు పెదవి విప్పాడు. నాకు అందం, ఐశ్వర్యం అక్కర్లేదు. ఓ మంచి మనసు, అంతకుమించి చక్కని వ్యక్తిత్వం ఉన్న ఆడపిల్ల కావాలి. అంటే ఈ రాష్ట్రంలో మంచి మనసు, చక్కని వ్యక్తిత్వం ఉన్న ఆడపిల్లలే లేరనికాదు. ఉన్నారుగానీ అందం, ఐశ్వర్యం ప్రత్యక్షంగా కనిపిస్తాయి. మంచి మనసు, వ్యక్తిత్వాలు అలా కనిపించేవికావు. అవి దగ్గరగా మసలు కుంటే తెలిసేవి. ఈ విషయంలో నిన్నమొన్నటి వరకూ నిస్సహాయుడినే. ఎందుకంటే ఒక అమ్మాయిని మెచ్చి ఆమె గుణగణాలను పరిశీలించి పెళ్లిచేసుకునే ప్రయత్నం చేయలేదు"

"మరి ఇప్పుడు? "

తను మాట జారానన్న విషయం గమనించడంతోనే అతడు తొట్రుపడ్డాడు. "ఇప్పుడంటే ఇప్పుడూ కాదనుకోండి అంటే విషయం చెప్పాను"

"కాదండోయ్ మీ మనసులో మరేదో విషయం దాగి ఉంది"



"లేదండీ... అలాంటిదేమీ లేదు" అతడు మనసులోని భావం, బయటపెట్టకున్నా ముఖంలో కొత్త వెలుగు కదలాడడం గమనించిందామె. ఆ కొత్త వెలుగుకి అర్థం తెలియనంత అమాయకురాలు కాదామె.

ఆమె ఇక రెట్టించలేదు. ఒక వేళ రెట్టించి అడిగినా కోరిన జవాబు రాదని అర్థమయిపోయింది.

"ఓకే ఇక వెళ్దాం పదండి" అందామె ఆ చోటనుండి ముందుకు నడుస్తూ. అతడు అనుసరించాడు.

వాళ్లిద్దరూ కిచెన్ దగ్గర కెళ్లేసరికి రేవతి అప్పటికే ఆ డబుల్‌స్టౌమీద ఓ వైపు పాలను మరోవైపు సగ్గుబియ్యం వేసేసి ఉంచింది.

వాళ్లను చూసి ఆమెనవ్వుతూ "ఇల్లు చూడడం మరీ ఇంతసేపా?" అంది.

"ఇల్లు చూడడం కొద్దిసేపే. కాకపోతే ఏవో విశేషాలు మాట్లాడుకుంటూ ఉంటే కాస్త ఆలస్యమయింది" చెప్పింది కల్పన.

ఆమె తలాడించాక రామ్మోహన్‌వైపు చూసింది. సంక్రాంతిరోజు చేయాలి కాబట్టి పాయసం చేస్తున్నాను. పోతే మీకు ఇష్టమైన స్వీట్స్ మరో రెండు చెపితే చేస్తాను"

అతడు వెంటనే చెప్పాడు "అరిసెలు"

రేవతి చప్పున చెయ్యి గుండెల మీద వేసుకుంది. "అయ్యబాబోయ్. అరిసెలు చెయ్యాలంటే అర్థపూట పని. అవి చేయడం నాకు రాదు. ఏవయిన సింపుల్‌గా ఇన్‌స్టెంట్‌గా చేయగలిగిన స్వీట్స్ చెప్పండి"

ఏవి సులభంగా చేయొచ్చో నాకు తెలియదు కదా?"

"రవ్వలడ్డు, గులాబ్‌జామ్. మా ఇంట్లో కూడా అవే చేశాను నేను"

"అయితే ఇక్కడ కూడా అవే చేయండి"

రేవతి తలాడించి అల్మారాలో ఉన్న డబ్బాలు పరిశీలించింది. అన్నీ తిరగేశాక చెప్పింది. "నేను బజారువరకూ వెళ్ళిరావలసిఉంటుంది"

"ఎందుకు?"

"ఇంట్లో జామూన్ పౌడరు, జీడిపప్పు లేవు. నేను వెళ్ళొస్తాను"

"మీరు వెళ్లక్కర్లేదు. వీధి చివరే షాపు వుంది. నేను వెళ్లొస్తాలెండి. ఇంకేమయినా కావాలేమో చూసి లిస్ట్ రాసివ్వండి"

ఆమె డబ్బాలు వెతికి చూశాక మరో రెండుమూడు ఐటమ్స్ లేకపోవడం గమనించింది. లేని వస్తువుల జాబితా ఓ కాగితంమీదరాసి అతడికి అందించింది.

"ఇంకేం అక్కర్లేదా?"

"ప్రస్తుతానికి చాలు"

"పది నిమిషాల్లో వచ్చేస్తాను" అని అతడు బయటకు నడిచాడు.

అప్పటివరకు కిచెన్ గడప అవతలే నిలబడి వున్న కల్పన రేవతి దగ్గరగా వచ్చింది. ఆమెకేసి తదేకంగా చూడసాగింది.

కల్పన చూపులు గమనించిన రేవతి కళ్లెగరేస్తూ అడిగింది. "ఏంటీ ఆ లుక్కు? మరీ కాస్త ఓవర్‌గా ఉంది"

"ఎలా ఉందేమిటి?"

"పదేళ్లు జైల్లో వుండి బయటపడిన మగాడు ఆడదానికేసి చూసే చూపులా వుంది"

కల్పన వెంటనే అంది. "ఇవి ఆకలి చూపులు కాదు మేడమ్! ఆరాధనతో కూడుకున్న చూపులు"

"ఏడ్చినట్లుంది"

"అయితే నువ్వు నా చూపులను అర్థంచేసుకోవడంలేదు. నా మనసులోని భావం నా చూపుల్లో వ్యక్తమవుతోందన్న నిజం నీకు తెలియడంలేదు"

రేవతి ఈసారి కల్పనకేసి చిరాగ్గా చూసింది.

ఆమె చూపులు గమనించిన కల్పన విషాదంగా ముఖంపెట్టి, తలమీద ఓ చెయ్యి, వెన్నుపూస చివర మరో చెయ్యి ఉంచి సినిమా స్టయిల్లో ఫోజుపెట్టి చెప్పింది, "అంతే, ప్రేమించే మనసు యొక్క బాధ





ప్రేమించబడేవాళ్ళకు అర్థంకాదు. ప్రేమించే కదలికలు ప్రేమించబడేవాళ్ళకు ఇదిగో... ఇలాగే చిరాగ్గా ఉంటాయి"

అప్పటివరకూ రేవతి ఒకవైపు పనిచేస్తూనే కల్పనతో మాట్లాడుతోంది. కల్పన మాటతీరు, వేషాలు చూశాక ఆమె చేస్తున్న పని ఆపేసి పూర్తిగా అటువైపు తిరిగింది. "ఏమిటే...? ఏమయింది నీకు? ఉన్నట్టుండి పిచ్చిపట్టిందా ఏంటి? "

"అవును పిచ్చిపట్టింది... ప్రేమపిచ్చి పట్టింది"

"అలాంటి పిచ్చిపడితే ఇక్కడ ఉండడం అంత మంచిది కాదు. రోడ్డుమీదకెళ్ళి ఎవడయినా మగాడిని చూసుకో"

"వెళ్లను... ఇక్కడనుంచి అడుగయినా అవతలికి వేయను"

"ఎందుకని? "

"నా లవ్వంతా నీమీదే. నువ్వంటే నాకిష్టం. నువ్వంటే నాకు ఆరాధన, నువ్వంటే నాకు ఆప్యాయత, నువ్వంటే నాకు అభిమానం. నువ్వంటే నాకు ప్రాణం"

"తల్లీ ఆపవే ఆపు..." రేవతి రెండు చెవులూ మూసుకుంది.

దాంతో కల్పన మాటలాపింది.

రేవతి అంది, "చూడు తల్లీ! నువ్వు ప్రేమించు. ఆరాధించు. ఇంకా నువ్వు చెప్పినవన్నీ చెయ్యి. కానీ నన్ను మాత్రం వదిలెయ్యి. ఎందుకంటే ఆడవాళ్లను ఆడవాళ్లు ప్రేమించుకోవడం మీద నాకంతగా సదభిప్రాయంలేదు. మొన్నీమధ్య ఏదో సినిమా వచ్చింది ఆc! 'ఫైర్' అని! అలాంటి వింత పోకడలు నాకిష్టం వుండదు తల్లీ"

కల్పన కూడా వెంటనే వికారంగా ముఖం పెట్టింది. "ఛీఛీ! నేనేదో యాక్షన్ చేస్తే, నువ్వు ఎక్కడికో వెళ్ళిపోయావ్. అపార్థం చేసుకోవడానికైనా ఓ హద్దుండాలే"

"మరి హఠాత్తుగా మారిన నీ మాటలు వింటుంటే అనుమానం రాదా? "

"అబ్బా! అవి నా మాటలు కావే తల్లీ"

"మరెవరివి? "

"అలా అడిగావ్ బాగుంది. ఇప్పుడు చెపుతాను విను. కల్పన గొంతు సవరించుకుంది. మగాడిలా ఫోజుపెట్టి స్టయిల్‌గా చెప్పింది. "రేవతీ! నీ మనసు, వ్యక్తిత్వం నాకెంతో నచ్చాయి. అందం ఉన్నా ఐశ్వర్యం నీకు లేకపోవచ్చు. అయినా నేనెప్పుడూ అందం, ఐశ్వర్యాలను పెద్దగా పట్టించుకోలేదు. మొదటిసారిగా నేను ప్రేమలో పడ్డాను. నాకు నీ మనసు, వ్యక్తిత్వం నచ్చాయి. నీ అందం నన్ను ఆకర్షించింది. అయినా ఈ మాటలు నీకెలా అర్థమయ్యేలా చెప్పాలో తెలియక నేను సతమతమవుతున్నాను. ఈ వాయిస్ కల్పనదేగానీ, మనసు మాత్రం నాదే"

రేవతి అనుమానంగా కల్పనకేసి చూసింది. వెంటనే తల విదిలించేసింది. "అనుమానం లేదు. ఇది డాక్టర్‌గారి ఇల్లు కదా, ఏ సీసాలోని మత్తుమందో, జ్యూస్ అనుకుని తాగేసి వుంటావ్"

"నాకేం మత్తు ఎక్కలేదు. ఓ నిజం తెలిసింది. ఆ నిజం నీకెలా చెప్పాలా అన్నదే ఇప్పుడు నేను పడుతున్న తపనంతా"

"ఏంటి నీకు తెలిసిన నిజం"

"అది పూర్తిగా నిజమోకాదో, తెలియదుగానీ, కొంత అనుమానానికి దారితీస్తోంది"

"విషయాన్ని మరీ సాగదీయకుండా చెప్పు"

"విషయం చెప్పేముందు నాకు కొన్ని వివరాలు కావాలి"

"ఏమిటవి? "

"డాక్టర్ రామ్మోహన్‌తో నీకు అంతకుముందు పరిచయం ఉండొచ్చుగానీ, లేటెస్ట్‌గా కలిసింది హాస్పిటల్‌లోనేకదా? "

"అవును"

"ఆ తర్వాత నీకన్నా కూడా అతడే ఎక్కువగా నీ చుట్టూ తిరిగాడు. మీ అమ్మ ఆరోగ్యం పట్ల ప్రత్యేక శ్రద్ధ చూపించాడు. హాస్పిటల్‌లో నీకు అన్నివిధాలా సహాయప



డ్డాడు. అలా నీకు బాగా దగ్గరై చివరికి పండుగరోజు ఇంటికి వచ్చి తనతో కలిసి ఆనందంగా గడిపేలా చేశాడు. ఇంతవరకూ ఏ ఆడదాని పట్ల ప్రత్యేక శ్రద్ధ చూపించలేదని చెప్పుకునే డాక్టర్ రామ్మోహన్ నీ పట్ల ఇంత ప్రత్యేక శ్రద్ధ ఎందుకు చూపిస్తున్నాడు? "

కల్పన జవాబు కోసం అన్నట్లు చెప్పడం ఆపింది.

రేవతికి కల్పన చెప్పదలచుకున్నది కొద్దిగా అర్థమయింది. కొద్దిగా అర్థంకాలేదు. అందుకే అప్రయత్నంగానే ప్రశ్నించింది "ఎందుకు చేస్తున్నాడు? "

కల్పన గుండెల నిండుగా ఊపిరి పీల్చుకుంది. మధురానుభూతులు కలిగించే విషయం మరింత దగ్గరై చెప్పాలన్నట్టు రెండు అడుగులు ముందుకేసి రేవతి దగ్గరగా వచ్చింది. ఆమె భుజాలమీద చేతులేసింది. ముఖమంతా విప్పార్చుకుని మరెంతో సంతోషంగా చెప్పింది.

"డాక్టర్ రామ్మోహన్... నిన్ను... నిన్ను ఇష్టపడుతున్నాడే రేవతీ"

ఒక అందమైన నిజాన్ని అప్పుడే విన్నట్లు, ఆ ఆనందాన్ని వాళ్ళిద్దరితో కలిసి పంచుకుంటున్నట్టు ఆ గదిలోకి అప్పుడే ప్రవేశించిన గాలి కదలక మెదలక అక్కడే ఆగింది.

చెప్పడం పూర్తిచేశాక కల్పన చిరునవ్వుతో రేవతి ముఖంలోకి చూసింది.

అంతే... ఆమె ముఖంలోని నవ్వు వెంటనే మటుమాయమయింది. ఒక నమ్మలేని నిజాన్ని చూస్తున్నట్టు కల్పన రేవతి ముఖంలోకే కొద్దిక్షణాలు తదేకంగా చూస్తుండిపోయింది.

తను... తను చెప్పిన విషయానికి రేవతి చాలా సంబరపడాలి. సిగ్గుతో ఆమె బుగ్గలు ఎరుపెక్కాలి. సంతోషంతో ముఖం ట్యూబ్ లైట్‌లా వెలిగిపోవాలి. కాని రేవతి ముఖంలో అలాంటి భావాలేవీ కనిపించడంలేదు. ఆమె ముఖం నిస్తేజంగా వుంది.

కల్పన తేరుకుంది. చాలా కష్టంమీద గొంతు పెగల్చుకుని అడిగింది. "రేవతీ! నేను... నేను చెప్పిన విషయం నీకు సంతోషం కలిగించలేదా? "

రేవతి జవాబుగా నవ్వి తన భుజాలమీదున్న కల్పన చేతులను పక్కకు తప్పించింది.

కొద్దిక్షణాలపాటు ఆమె జవాబు కోసం ఎదురుచూసిన కల్పన కాసింత చిరాగ్గా అడిగింది. "నేను అడిగినదానికి జబాబు చెప్పకుండా నవ్వి ఊరుకుంటావేమిటి? జవాబు చెప్పు"

"ఏం చెప్పను? "

"రామ్మోహన్ నిన్ను ప్రేమిస్తున్నాడని తెలిస్తే నీకు సంతోషం కలగడంలేదా? "

"లేదు"

"ఎందుకని? "

"ఎందుకంటే ఏం చెప్పను? ఏదేమయినా ఇదేదో గొప్ప విషయంలా నేను ఫీల్ కావడంలేదు. అంతే"

"అదేమిటీ... ఇది నీకు గొప్ప విషయంలా అనిపించడంలేదా? "

"లేదు" వెంటనే అందామె.

కల్పనకు చాలా ఆశ్చర్యంగా అనిపించింది. "అదేమిటీ అలా అంటావ్? " అంది సీరియస్‌గా. అప్పటివరకూ ఆమెలో కదలాడిన చిలిపితనం మటుమాయమైంది.

"మరేమనమంటావ్? నీకు నా బాధ్యత గురించి తెలియదా? తెలిసి కూడా నువ్వు ఇదేదో గొప్ప విషయంలా మాట్లాడుతుంటే ఏమనాలో కూడా నాకర్థం కావడంలేదు"

కల్పనకు శారదమ్మ గుర్తుకొచ్చింది. రామ్మోహన్ మాటలు అర్థంచేసుకున్న ఆనందంలో కొద్దిసేపు తను రేవతికి ఉన్న ఓ బాధ్యతను మర్చిపోయింది. కాని రేవతి కలలో కూడా తన బాధ్యతను మర్చిపోయేలాలేదు. ఆమె తలపుల్లో అనుక్షణం తల్లే కదలాడుతూ ఉంటుంది కాబోలు.

"అది కాదు రేవతీ..." అప్పటికీ కల్పన




మరేదో చెప్పాలని ప్రయత్నించబోతే రేవతి అడ్డుకుంది.

"చూడు కల్పనా! నువ్వేదో గొప్పగా ఫీలై చెప్పబోయిన విషయం నేను చాలా సింపుల్‌గా తీసిపారేశానని నువ్వు బాధపడితే నేనేం చేయలేను. కాని నాకు ఈ మగ వాళ్లు, వాళ్ళ మనస్తత్వాలు ఎలా ఉంటాయో తెలుసు. వాళ్లకు భార్య కావాలి. కాని భార్య తరపు బంధువులు అక్కర్లేదు. ఆమె బరువు బాధ్యతలతో తనకు సంబంధం ఉండకూడదు. మగాడికి తన తల్లిదండ్రులు కావాలి. కాని ఆడపిల్లకు తల్లి దండ్రుల గురించి ఆలోచన ఉండకూడదు. ఇది ఎంత దారుణమైన విషయమో ఆలోచించి చూడు. నీకే అర్థమవుతుంది"

"కానీ రామ్మోహన్‌గారు అలాంటివాడని అనిపించడంలేదు రేవతీ! ఆయనకు నీ పరిస్థితి తెలుసు. అయినా నువ్వంటే ఇష్టం ప్రదర్శిస్తున్నారు"

"ఇష్టం ప్రదర్శించడంవేరు, కష్టాలను పంచుకోవడం వేరు కల్పనా! నిన్న మొన్నటివరకూ నేనంటే ఇష్టం ప్రదర్శించిన సాయికృష్ణ ఇప్పుడెలా మారిపోయాడో చూడు. ఒకప్పుడు నా కోసం ప్రతిరోజూ ఇంటికొస్తూ ఉండే అతడు ఇప్పుడు వీలయినంతవరకూ తప్పించుకుంటున్నాడు. బహుశా తన భవిష్యత్ గురించి ఆలోచించుకుంటున్నట్టున్నాడు. అతడి ఆలోచనలనూ నేను తప్పు పట్టలేకున్నాను. ఎందుకంటే ఈ ప్రపంచంలో ఏ మనిషైనా తను ఆనందంగానే ఉండాలని కోరుకుంటాడు. తన ఆనందాన్ని పాడు చేసే వ్యక్తులను దూరంగా ఉంచాలనే ప్రయత్నిస్తాడు. నా తల్లి బాధ్యత అతడి బాధ్యత కానప్పుడు అతడు తప్పించుకోవాలని ప్రయత్నించడం నాకు సహజమైన విషయంలానే అనిపిస్తుంది..... జనమంతా నాకు దూరం కావచ్చు నా భవిష్యత్తు శూన్యంగా మారవచ్చు అయినాసరే, నేను అమ్మను వదలలేను. నా బాధ్యతను నేను వదిలించుకుని, నా సుఖాలకోసం పరుగెత్తలేను...." చాలా ఆవేశంగా మాట్లాడడం వలన కాబోలు, ఆమె అలసటగా ఆగింది.

కొద్ది క్షణాలు అక్కడ గాఢమైన నిశ్శబ్దం పేరుకొంది.

కల్పన నెమ్మదిగా ఆమె భుజం మీద చెయ్యి వేసింది. నిశ్శబ్దాన్ని దూరం చేస్తూ అంది "సారీ"

రేవతి తలాడించి మౌనంగా ఉండిపోయింది.

అప్పటికి ఓ నిముషం ముందే వచ్చి రేవతి ఆవేశంగా అంటున్న మాటలు వింటూ నిలబడి పోయిన రామ్మోహన్ వడి వడిగా ముందుకు నడిచాడు. తాను అప్పుడే వస్తున్నట్టు వాళ్లకు భ్రమ కలిగిస్తూ "ఇవి గోండి. మీరు చెప్పిన వస్తువులు తెచ్చాను" అంటూ క్యారీబ్యాగ్ అక్కడ పెట్టాడు.

వాళ్ళిద్దరూ అతడి రాకతో తడబడి అక్కడ ఏమీ జరగలేదని అతడిని భ్రమలో పెట్టాలన్న ఆలోచనతో ముఖాలకు నవ్వు పులుముకున్నారు.

అతడు కూడా ఏమీ విననివాడిలాగే ప్రవర్తించాడు.

రేవతి తిరిగి వంటపనిలో మునిగిపోయింది. కల్పన ఆమెకు సహాయం చేయసాగింది.

వాళ్ళిద్దరూ అక్కడ ఉండగా తను వెళ్ళి హాలులో కూర్చోవడం ఎందుకనుకున్నాడేమో రామ్మోహన్ హాలులోనుండి ఓ స్టూల్ తెచ్చుకుని అక్కడే వేసుకుని కూర్చున్నాడు.

వాళ్లు ఒకవైపు వంట చేస్తూనే మరోవైపు అతడితో మాట్లాడసాగారు. ఆ మాటలలో ఎక్కువగా డాక్టర్ ప్రొఫెషన్‌లోని సాధక బాధకాల గురించే చర్చ జరిగింది. మధ్యలో అంజలి గురించి వివరాలు. తన తల్లిదండ్రులు చనిపోయినరోజు తను ఎక్కడో ఉండి మెసేజ్ అందుకుని రావడం,



వాళ్ళ శవాలు చూసి స్పృహతప్పి పడిపోవడం, అలాగే అమ్మమ్మ అంటే తనకెంతో ఇష్టమున్న విషయం. తనకెంతో ఆప్తులయిన వాళ్ళకు మనసులోని మాటలు చెప్పుకుని గుండె బరువు తగ్గించుకోవాలని చాలా రోజులుగా సాగిస్తున్న ప్రయత్నం ఆరోజు సఫలమయినట్టుగా అతడు ఫీలయ్యాడు.

ఓ రెండు గంటల్లో వంట పూర్తయింది.

రేవతి వెంటనే వంట పాత్రలు డైనింగ్ టేబుల్ మీద సర్దేస్తుంటే అతడు అడిగాడు "అప్పుడే భోజనం ఏమిటండీ? "

ఆమె కొద్దిగా ఇబ్బందిగా నవ్వింది. "నాకూ మరికాసేపు ఉండి రిలాక్స్‌గా భోంచేసి వెళ్ళాలనే ఉంది. కానీ అక్కడ అమ్మ"

అతడికి అర్థమయింది. మనసు ఆర్ద్రమయింది. కొద్దిక్షణాలు ఆలోచించుకున్నాక అతడు అన్నాడు, "పోనీ మీ అమ్మగారిని కారులో ఎక్కించుకుని ఇక్కడికే తీసుకురానా? "

"అయ్యయ్యో! అంతపని ఎందుకండీ? "

"ఇందులో కంగారుపడవలసిందేముంది? నేనో డాక్టర్‌ని. ఈ ఇల్లు హాస్పిటల్ అనే అనుకోండి. మీరు మీ అమ్మగారిని ఈ ఇంట్లోనే ఉంచి, ఆమెను కనిపెట్టుకుని ఉండండి. ఇక్కడ వుంటే ఓ డాక్టర్‌గా నేను ప్రతిరోజూ చెకప్ చేయడానికి వీలవుతుంది. మీ అమ్మగారు ఇక్కడ ఉంటే మీరూ ఏదయినా ఉద్యోగం చేసుకునేందుకు వీలవుతుందేమో ఆలోచించండి"

ఆమె వెంటనే తల అడ్డంగా ఆడించింది "వద్దండి"

"ఎందుకని? "

"ఇది ఇల్లు. ఈ ఇంటిని హాస్పిటల్‌లా ఎలా భావించమంటారు నన్ను? ఈ ఇంట్లో అమ్మ ఒక్కతే పేషెంట్‌గా వుండి, ఆమెకు సేవలు చేస్తూ నేనిక్కడ ఉండడం



నాకిష్టంలేదు"

"ఇతరులు ఏమనుకుంటారోనన్న భయమా? నేను మీకు ఎప్పుడో చెప్పాను. లోకులు, కాకులు. వాళ్ళ గురించి ఆలోచించడం అనవసరం"

రేవతి వెంటనే చెప్పింది. "నేను లోకుల గురించి ఆలోచించడంలేదు. ఈ ఇంట్లో అనారోగ్యంతో బాధపడుతున్న ఓ మనిషి ఉంటే, మీ ప్రశాంతత ఎగిరిపోతుంది. మీరు పనిచేసే హాస్పిటల్‌కి ఇంటికి తేడా లేకుండా పోతుంది"

"ఒక మనిషి రిలాక్స్ కావడమన్నది ఫలానాచోటే సాధ్యం అన్నది చాలా తప్పు. కొందరు తమ వృత్తిలోనే ప్రశాంతతను వెదుక్కోగలరు. నా వరకూ నా వృత్తే నాకు ధ్యానం. హాస్పిటల్ దేవాలయం. ధ్యానం చేసేవాళ్ళకు దేవాలయంలో ప్రశాంతత దొరికినట్టే నాకు రోగులున్న చోట రిలాక్సేషన్ లభిస్తుంది"

ఏం చెప్పాలో రేవతికి కొద్దిక్షణాలపాటు అర్థం కాలేదు. చివరికి కొంతసేపు ఆలోచించాకే చెప్పింది. "అయినా మా అమ్మకు ఇప్పుడు మా ఇంట ఎలాంటి ఇబ్బందీ లేదు. తను రోజురోజుకీ ఎంతో కొంత కోలుకుంటూనే వుందని నేను అనుకుంటున్నాను"

"ఆ విషయాన్ని నేనూ ఒప్పుకుంటున్నాను. మీరు చేసే సేవ చాలా గొప్పది. అలాంటి జబ్బుతో మంచానపడిన వాళ్ళకి ఆ సేవ ఎంతో అవసరం. ఆ సేవ వాళ్ళని త్వరగా కోలుకునేలా చేస్తుంది. మీ ఇంట మీ అమ్మగారు ఏ ఇబ్బందీ లేకుండా సంతోషంగానే వున్నారు. ఆమె త్వరగా కోలుకోవచ్చు కాని ఎంతయినా ఓ డాక్టర్ సంరక్షణలో ఉండడంవలన మరింత త్వరగా కోలుకునే అవకాశం వుంది. అది నా ఉద్దేశం" రామ్మోహన్ చెప్పాడు.



"అయినాసరే వద్దండి"

"అంటే... ఈ ఇంట మీ అమ్మగారు అడుగుపెడితే నా ప్రశాంతత ఎగిరిపోతుం దనేకదా మీరిలా మాట్లాడుతున్నారు? "

రేవతి నిలువుగా తలాడించింది "అవును"

అతడు ఏదో చెప్పబోయి ఆగిపోయాడు. అతడి ముఖంలో ఏదో అపురూపమైన భావం కొద్దిక్షణాల పాటు కదలాడింది. ఏదో ఆలోచనలో కొద్దిక్షణాలు మౌనంగా ఉండిపోయాక ఓ నిర్ణయానికి వచ్చినట్టు అతడు నెమ్మదిగా తలాడించి చెప్పాడు.

"సర్లెండి. ఈ రోజుకి ఈ విషయం గురించి చర్చించడం ఆపుదాం. మీరెలాగూ త్వరగా ఇంటికెళ్లాలనుకుంటున్నారు కాబట్టి రండి భోంచేద్దాం" అతడు స్టూల్ మీదనుండి లేచాడు.

ముగ్గురూ డైనింగ్ హాల్‌వైపు నడిచారు.

డైనింగ్ టేబుల్ ముందు కూర్చున్నాక, రేవతి వడ్డించబోతుంటే రామ్మోహన్ అన్నాడు, "మీరూ కూర్చోండి"

"ఎందుకండీ, మీరిద్దరూ భోంచేశాక"

"అంత సీనేం అక్కర్లేదు. నువ్వూ కూర్చో" ఆమె మాటలు మధ్యలో కట్‌చేసి చెప్పింది కల్పన.

రేవతి కల్పనకేసి చురుగ్గా చూసి, తనూ ప్లేట్ ముందుంచుకుంది.

మాటల మధ్యనే భోజనాలు ముగిశాయి.

అతడు చెయ్యి కడుక్కున్నాక రేవతివైపు సంతృప్తిగా చూస్తూ చెప్పాడు. "చాలా రోజుల తర్వాత చక్కని భోజనం తృప్తిగా తిన్నాను. అంతకన్నా ముఖ్యంగా పండుగ రోజు ఈ ఇంట పండుగ కళ కనిపించింది. అందుకే నాకీరోజు చాలా ఆనందంగా వుంది. సో! మీ ఇద్దరికీ థాంక్స్ చెప్పుకుంటున్నాను"

"అదేం మాటండీ... ఇందులో థాంక్స్ చెప్పాల్సిందేమీ లేదు" రేవతి నవ్వుతూ పలికింది.




ఆమె గిన్నెలన్నీ కడిగేసి, పాత్రలు సర్దేసింది.

"మేమిక బయల్దేరుతాం" ఆమె అతడి ముందుకొచ్చి చెప్పింది.

మనసులోని భావం ఏదయినా అతడు తలాడించాక చెప్పాడు. "పదండి, మిమ్మల్ని ఇంటి దగ్గర డ్రాప్ చేస్తాను"

"వద్దండి. మేము రిక్షాలో వెళ్ళిపోతాం"

"మొహమాట పడకండి"

"ఇందులో మొహమాట పడడమేమీ లేదు. మమ్మల్ని డ్రాప్ చేశాక మీరు వెనక్కు తిరిగిరావాలి. అదే మేము రిక్షాలో వెళ్లిపోయామనుకోండి. ఎవరికీ ఇబ్బంది లేదుకదా? " రేవతి నవ్వుతూనే చెప్పింది.

రామ్మోహన్ భుజాలెగరేశాడు. "సరే మీ ఇష్టం"

అతడు వాళ్ళ వెంట వీధిగేటువరకూ వచ్చాడు.

రేవతికి అతడి ప్రవర్తన కాస్త కొత్తగానూ, గమ్మత్తుగానూ వుంది. తను అతడి చెల్లెలికి స్నేహితురాలిగా ఉండినంత మాత్రాన ఏదో హాస్పిటల్‌లో సహాయం చేయడంవరకూ సబబుగానే ఉందిగాని మరీ ఇలా మితిమీరిన మర్యాద ఇస్తూ, ప్రత్యేక శ్రద్ధ చూపించడం... ఏమిటిదంతా? ఇంత ఉన్నతస్థానంలో వున్న అతడు తమవెంట వీధిగేటు వరకూ రావడం ఏమిటి?

"ఉంటామండి" రోడ్డుమీదకు అడుగుపెట్టబోతూ వాళ్ళిద్దరూ ఒకేసారి చెప్పారు.

రామ్మోహన్ తలాడించాడు.

ఇద్దరూ ముందుకు నడిచారు.

పదడుగులు ముందుకేశాక కల్పన రేవతితో అంది "గమనించావా? "

"ఏమిటి? " రేవతి తలతిప్పి కల్పన ముఖంలోకి చూసింది.

"డాక్టర్‌గారు మనపట్ల చూపించిన శ్రద్ధాసక్తులు"

"ఆc! గమనించాను" ఎలాంటి ఆసక్తి ప్రదర్శించకుండా క్లుప్తంగా పలికింది. రేవతి.

"ఇంట్రస్ట్ చూపించడమే కాదు, మరో

ప్రపోజల్ కూడా ముందు పెట్టాడు. ఆంటీని తన ఇంటికే తీసుకొచ్చి ఇక్కడే ఉంచమని కూడా చెప్పాడు. అతడి నోట ఆ ప్రపోజల్ వింటే నీకేమనిపించిందే రేవతీ"

రేవతి కల్పన ముఖంమీద నుండి చూపు మరల్చుకుంటూ చెప్పింది. "నాకయితే ఏమీ అనిపించలేదు. నీకు ఏమనిపించిందేం? "

"రామ్మోహన్ తన మనసులోని మాటను ఇన్‌డైరెక్ట్‌గా నీతో చెప్పాడేమోననిపించింది? "

"అంటే? "

కల్పన కొద్దిక్షణాల నిశ్శబ్దం తర్వాత మొదలుపెట్టింది. "చదువూ సంస్కారం ఉండి సమాజంలో ఓ గుర్తింపు, హోదా ఉన్న మగాడు ఓ కన్నెపిల్లను తన ఇంటికొచ్చి కాపురం పెట్టేయమని చెప్పడు, చెప్పలేడు. అలాంటి ఓ వ్యక్తి ఓ అమ్మాయితో అలా అనగలిగాడు అంటే దాని వెనుక ఖచ్చితంగా ప్రేమాభిమానాలో లేక జాలి, ఆప్యాయతలు వుండితీరుతాయి. నాకు తెలిసినంతలో అతడు నీమీద జాలిపడడం లేదు. అతడు నీమీద చూపిస్తున్నది ఖచ్చితంగా ప్రేమేనని నేను చెప్పగలను"

"అయితే ఇప్పుడేమంటావ్? " రేవతి చురుగ్గా కల్పన కళ్లలోకి చూసింది. "నీకు మంచి మాటలు చెప్పేంత గొప్పదాన్ని కాదు నేను. ఆ విషయం నాకూ తెలుసు. కాని ఒక్కోసారి ఎంత తెలివయిన వాళ్లయినా, ఆలోచనా జ్ఞానం వున్నవాళ్ళయినా ఎక్కడో తప్పటడుగు వేస్తుంటారు. నువ్వా ఇప్పుడు అలాంటి తప్పటడుగే వేస్తున్నావని నా ఉద్దేశం"

రేవతి ఆగడంతో కల్పన కూడా ఆగి అప్పుడే పరిసరాలు గమనించింది. అప్పటికే తామిద్దరూ సెంటర్‌కి చేరుకున్నారు. సెంటర్‌లోంచి రిక్షాలు దొరుకుతాయి. ఆమె తల తిప్పి రేవతి ముఖంలోకి చూసింది.

"చూడు కల్పనా! ఇక ఈ విషయాన్ని వదిలిపెట్టు. ఈ విషయంలో నాది స్థిరమైన అభిప్రాయం. ఎవరేం చెప్పినా ఆ అభిప్రాయం మారదు. నా అభిప్రాయమేమిటో నీకూ తెలుసు. మగాళ్లకు ప్రేమ కలగొచ్చు పెళ్లి చేసుకోవాలనే అనిపించొచ్చు కాని జీవిత భాగస్వామి బాధ్యతను మాత్రం స్వీకరించాలనుకోరు. ఈ విషయంలో సాయికృష్ణ అయినా రామ్మోహన్ అయినా ఒక్కటే. నేను ఈ ప్రపంచంలో ఎవరినయినా, దేన్నయినా వదులుకునేందుకు సిద్ధమేగానీ, మా అమ్మను వదులుకునేందుకు సిద్ధంగా లేను. ఈ విషయంలో మరో ఆర్గ్యుమెంట్‌కి తావేలేదు. కాబట్టి మరేం మాట్లాడకు"

అలా చెప్పాక రేవతి కల్పన ముఖంలోకి చూడలేదు. తలతిప్పుకుని రిక్షాకోసం చూసింది. రిక్షా కనిపించడంతో కేకేసి పిలిచింది. రిక్షా దగ్గరికొచ్చాక బేరమాడింది. ఇద్దరూ రిక్షాలో కూర్చున్నారు. రిక్షాముందుకు కదిలింది.

రిక్షా ముందుకు పోతూవుంటే రేవతి తల తిప్పి ఓరగా కల్పనకేసి చూసింది. కల్పన సీరియస్‌గా ముఖం పెట్టుకుని ఎటో చూస్తోంది.

కల్పనకి కోపం వచ్చిన విషయం రేవతికి అర్థమయిపోయింది. ఆమె నెమ్మదిగా తన ఎడమ చెయ్యి పక్కకు పోనిచ్చి కల్పన చెయ్యిమీద వేసింది. కల్పన ఆమె చేతిని విసిరికొట్టింది.

రేవతి సన్నగా నవ్వింది. "కోపమొచ్చిందా కల్పనా? "

కల్పన మాట్లాడలేదు. ఎప్పటిలాగే తలతిప్పుకుని చుట్టూ సాగిపోతున్న పరిసరాలను చూస్తోంది.

రేవతి కల్పన చెయ్యి తన రెండు చేతుల మధ్యకు తీసుకుని మనస్ఫూర్తిగానే చెప్పింది. "నీ మనసు నొప్పించి వుంటే రియల్లీ ఐయామ్ సారీ కల్పనా! కొద్దిగా కఠినంగా అనిపించినా, నిజం నిర్మొహమాటంగా చెప్పాలనే అలా చెప్పాను"

కల్పన చప్పున తలతిప్పి రేవతి ముఖం లోకి చూసింది. ఆమె ముఖంలోని బాధ చూడగానే అప్పటివరకూ కదలాడిన కోపం వెంటనే ఎగిరిపోయింది. "ఛా ఛా! నీ మీద నాకు కోపమేంటే? ఏదో మంచిదారి కని పించిందేమోనని నీ భవిష్యత్తుకు అది మలుపు అవుతుందేమో అనుకుని అలా మాట్లాడాను. నిజానికి ఆలోచిస్తే తప్పు నాదే. నేను నీ స్నేహితురాలిగానే ఆలోచి స్తున్నాను తప్ప నువ్వా తల్లికి 'కూతురి'వని మర్చిపోతున్నాను. కూతురు అన్న పదానికి సరికొత్త అర్థం చెబుతూ, నీ జీవితాన్ని అర్థ వంతం చేసుకుంటున్న నిన్ను అభినందించా ల్సిందిపోయి, తప్పుదారి తొక్కించాలని ప్రయత్నించినందుకు నేనే నీకు సారీ చెప్పాలి"

"హమ్మయ్య నీకు నామీద కోపం లేదన్న మాట. థాంక్ గాడ్" నవ్వేసింది రేవతి.

ఆమెను చూసి కల్పన కూడా హాయిగా నవ్వింది.

రిక్షా ఇంటిముందు ఆగింది.

రేవతి దిగి రిక్షావాడికి డబ్బులిచ్చింది. ఇద్దరూ చేతులు పట్టుకొని ఇంట్లోకి నడి చారు.

వాళ్లిద్దర్నీ చూసిన శారదమ్మ ముఖంలో సంతృప్తి కదలాడింది.

కల్పన వచ్చి వారంరోజులయింది.

ఆరోజు ఆమె తిరిగి హైదరాబాద్ ప్రయాణం అవుతుంటే రేవతి అంది. "మరో రెండు రోజులు వుండి వెళ్ళకూడ దటే"

"నాకూ ఉండాలనే ఉంది. కాని ఏం చేయను? అతికష్టంమీద వారంరోజులు మాత్రమే సెలవు దొరికింది. ఇప్పుడుగాని వెళ్ళకపోతే ఉద్యోగంపోయే పరిస్థితి వచ్చే స్తుంది"

"బోడి ఉద్యోగం. పోతే పోయింది. అయినా హైదరాబాద్‌లో ఉద్యోగాలకు కొరత లేదు. ఓ పదిరోజులు వాంటెడ్ కాలమ్స్ చూసి అప్లయ్ చేస్తే ఏదో ఉద్యోగం వచ్చే స్తుంది"

"అది నిజమేననుకో. అయినా అంత రిస్కు తీసుకోవడం ఎందుకూ అని! ఇదిగో ఇప్పుడు ఓ వారంరోజులున్నాను. మరో రెండు మూడు నెలల తర్వాత మళ్ళీ వచ్చి ఓ వారం పదిరోజులుండి వెళ్తానులే..."

"నిజమేకదా. సరేపద"

రేవతి కల్పన వెంట బస్టాండు వరకూ వెళ్లేందుకు తయారుకాసాగింది.

కల్పన శారదమ్మకు వెళ్తొస్తానని చెప్పాక బ్యాగ్ తీసుకుని ఇంట్లోంచి బయటకు నడి చింది. రేవతి ఆమెను అనుసరించింది.

సెంటర్‌లో రిక్షా ఎక్కి బస్టాండ్ చేరుకు న్నారిద్దరూ.

హైదరాబాద్‌కి టికెట్ తీసుకుని బస్సు వైపు నడుస్తున్నప్పుడు కల్పన అంది "నువ్విక హైదరాబాద్‌కి రావని పూర్తిగా తెలిసిపోయాక ఆ సిటీకి వెళ్లాలంటేనే నాకే దోలా ఉందే. మనిద్దరం కలిసి వున్నది కొద్దిరోజులే కావచ్చుగానీ రక్తసంబంధీకుల కన్నా ఎక్కువగా అభిమానాలు పెంచు కున్నాం. కానీ ఏం చేద్దాం. ఇది జీవితం బతుకు పయనంలో అభిమానాలు, ఆప్యా యతలను వదులుకుని కడుపు చేతపట్టు కుని పరుగెత్తవలసి ఉంటుంది"

కల్పన మాటలకు రేవతికి కూడా కళ్లల్లో నీళ్లు తిరిగాయి. అసలు కల్పన తనను వదలి వెళ్లిపోతుందంటేనే ఉదయం నుండి మనసు మనసులో లేదు. వారం రోజు లుగా తను పొందిన సంతోషం ఆ రోజుతో దూరమవుతుందన్న బాధ మొదలయింది. దానికి తగినట్టుగానే కల్పన ఇప్పుడు అలా అనేసరికి ఇక తట్టుకోలేకపోయింది. అయినా అతికష్టం మీద కళ్లనీళ్లు కల్పన కంటపడకుండా జాగ్రత్తపడుతూ "నువ్వు చెప్పింది నిజమేనే" అంది.

ఇద్దరూ బస్సు దగ్గరకు చేరుకున్నారు.





కల్పన ఎక్కేందుకు సిద్ధపడుతుంటే రేవతి ఆమె చెయ్యి పట్టుకుని ఆపి "ఇంకా బస్సు డ్రైవర్ రాలేదుకదా? బస్సు కూడా ఖాళీగానే వుంది. ఎక్కొచ్చులే" అంది.

ఆమె ఆగి రేవతి ముఖంలోకి చూసింది. రేవతి ముఖంలో దిగులు స్పష్టంగా కనిపించింది. అభిమానం, ఆప్యాయతలు పెంచుకున్న వ్యక్తులు వాళ్ల బంధం ఏదయినా సరే ప్రేమికులు, స్నేహితులు, తల్లీబిడ్డలు, అక్కచెల్లెళ్లు, అన్నదమ్ములు ఎవరయితేనేం విడిపోవలసి రావడం బాధాకరం.

ఆ బాధను అనుభవిస్తూ వాళ్లిద్దరూ కొద్దిసేపు నిశ్శబ్దంగా ఉండిపోయారు. బాధను పంచుకోవడానికి నిశ్శబ్దాన్ని మించిన మార్గం మరోటి లేదు.

బస్సు డ్రైవర్, కండక్టర్ బస్సువైపు రావడం కనిపించింది.

కల్పన రేవతి చెయ్యి నొక్కి వదిలింది. "వెళ్లొస్తానే".

"మళ్లీ ఎప్పుడొస్తావ్? "

"చెప్పాగా మరో రెండు మూడు నెలల్లో వచ్చి ఓ వారం పది రోజులుంటానని"

"సరే జాగ్రత్త! వెళ్లగానే ఉత్తరం రాయి"

"అలాగే రాస్తాను. నువ్వూ ఇక్కడ జాగ్రత్త"

రేవతి తలాడించింది.

కల్పన ఆ సమయంలోనూ రామ్మోహన్ ప్రస్తావన తీసుకురావాలనుకుందిగానీ మనస్కరించక తల తిప్పుకుని బస్సెక్కేసింది.

బస్సు కదిలింది.

కల్పన కిటికీవైపు సీట్లో కూర్చుని చెయ్యి వూపసాగింది.

రేవతి కూడా చెయ్యి వూపుతూ నిలబడి వుండగానే బస్సు కదిలి ముందుకెళ్లి కనుమరుగయిపోయింది. కనులముందు కల్పన రూపం కనుమరుగై మనసులో ఆమె తాలూకు జ్ఞాపకాలు మాత్రమే మిగిలాయి.

దీర్ఘంగా నిట్టూర్చి బస్టాండ్‌లో నుంచి బయటకు నడిచింది రేవతి.

ఆమెకు రిక్షా కూడా ఎక్కాలనిపించలేదు. అలా నడుచుకుంటూనే ఇంటి వైపు సాగింది.



రోజులు నెమ్మదిగా గడుస్తున్నాయి.

రేవతికి ఇప్పుడు ఉన్న పనులు రెండే. ఒకటి కుట్టుమిషన్ మీద సంపాదించుకోవడం. రెండు తల్లిని సంరక్షించుకోవడం.

ఆమె తన తల్లిని పసిపాపలానే చూసుకోసాగింది.

శారదమ్మకు అన్నీ మంచంలోనే. అయినాసరే ఓపికగా పని చేయడమేకాదు మనసులో కూడా బాధపడేదికాదు. ఆమె ఇలా అనుకునేది నాకు ఓ బిడ్డ పుడితే ఆ బిడ్డ మలమూత్రాదులను తీసివేయడానికి తను అసహ్యించుకుంటుందా? ఈ సృష్టిలోని ఏ తల్లీ తన బిడ్డ మలమూత్రాదులను అసహ్యించుకోదుగాక అసహ్యించుకోదు. మరి రేపు బిడ్డగా మిగిలి రుణం తీర్చుకుంటాడో లేక కష్టపెడతాడో తెలియని కడుపున పుట్టిన వాడికోసం అంతగా కష్టపడగా లేనిది పసితనంలో తనకు ఆ సేవలన్నీ చేసిన తల్లికి తిరిగి అవే సేవలు చేయడానికి ఎందుకు బాధపడాలి? ఈ ఋణం ఆనందంగా తీర్చుకోదగినది. అయితే ఈ

ప్రపంచంలో చాలామంది బిడ్డలు తల్లిదండ్రుల రుణం తీర్చుకోవడానికి చాలా బాధపడిపోతారు. వీలయినంత వరకూ వాళ్లను వదిలించుకోవడానికే చూస్తారు. మరికొందరు సమాజం తమను ఏమనుకుంటుందోనన్న భయంతో తల్లిదండ్రులను ఇంట్లో ఉంచుకుంటారు. ఇలా ఇష్టంలేకుండానే తల్లిదండ్రులను ఇంట్లో ఉంచుకున్నప్పుడు ఆ ఇంట్లో ఆ పెద్దల పరిస్థితి చాలా దారుణంగా ఉంటుంది. వాళ్లు చావాలేక బతకాలేక నరకం అనుభవిస్తూ ఉంటారు. అసలే ప్రపంచంలో తల్లిదండ్రులను ప్రేమగా, ఆప్యాయంగా వాళ్లు చిన్నతనంలో తమనెలా చూశారో అలాగే చూస్తున్న వాళ్లు ఎంతమందున్నారు?

అసలీ వ్యత్యాసం ఎందుకొస్తుంది? ఎక్కడొస్తుంది?

తల్లిదండ్రులు తమ బిడ్డలను ఎంతో ప్రేమగా చూసుకుంటారు. వాళ్లకోసం తమ సర్వం త్యాగం చేస్తారు. కాని ఆ బిడ్డలు తమ తల్లిదండ్రులను పట్టించుకోరు. తమ బిడ్డలతోనే లోకంగా బతుకుతారు.

ఇది ఎంతవరకూ న్యాయం?

కాకపోతే తరతరాల చరిత్రలో ఇది మానవ సహజ లక్షణంగా మారిపోయిందా?

ఈ అవలక్షణాన్ని మనిషి మార్చుకోవాలి. అతడిలో విచక్షణాజ్ఞానం రావాలి. నిన్న తన తల్లిదండ్రులకు జరిగిందే రేపు తనకు జరుగుతుంది కాబట్టి అలాంటి వారసత్వ సంపద తన పిల్లలకు ఇవ్వకుండా జాగ్రత్త పడాలి.

తన తల్లి గురించి ఆలోచిస్తున్నప్పుడు రేవతికి ఈ ప్రపంచంలోని తల్లిదండ్రులందరూ గుర్తుకు వచ్చేవారు. వాళ్ల కష్టాల గురించి ఆలోచనలు మొదలయ్యేవి. అసలిలా ఎందుకు జరుగుతుంది? అని తనను ప్రశ్నించుకునేది. ఇలా జరగకుండా ఉంటే బాగుణ్ను అని అనుకునేది.

అలా ఆలోచిస్తూనే ఆమె తనకు డాక్టర్ చెప్పిన జాగ్రత్తలన్నీ తూచా తప్పకుండా పాటించసాగింది.

తల్లి మంచం మీద ప్రతిరోజూ పక్క బట్టలు మార్చేది. అలాగే పడుకుని ఉంటే శరీరం మీద పుళ్లు పడతాయి కాబట్టి రెండు గంటలకోసారి శ్రమ అనుకోకుండా పొజిషన్ మారుస్తూ తల్లి శరీరాన్ని కాపాడేది. ఆమెకు బలమైన ఆహారం ఇవ్వడం కోసం తను కుట్టుమిషను మీద ఎక్కువగా శ్రమపడి ఆ డబ్బుతో పళ్లు, మందులు కొనేది. రోజుకు ఓ గంటయినా తల్లి దగ్గర కూర్చుని ఆమెచేత కాళ్లకు, చేతులకు కదలిక కలిగించేలా ఎక్సర్‌సైజ్‌లు చేయించేది. కాళ్లకు చేతులకు ఎక్సర్‌సైజ్ చేయిస్తూనే చిన్నపిల్లలకు అమ్మ, ఆవు అనే మాటలతో ఎలా చదువు నేర్పుతారో అలాగే ఒక్కో మాట పలికించి పలకడం అలవాటు చేయసాగింది.

కష్టం ఎప్పుడూ వృధాపోదు. ఆ తల్లిపట్ల కూతురు చూపించిన ప్రేమ కొంత ఫలితాన్నే ఇచ్చింది.

శారదమ్మ ఇప్పుడు ఆసరా ఇస్తే మంచం మీద లేచి కూర్చోగలుగుతోంది. ఆమె ఓ చేతిని తన భుజం మీద వేసుకుని పట్టుకుంటే శరీరాన్ని కొంత వరకూ బేలన్స్ చేయగలుగుతోంది.

ఆ ఇంటికి అప్పుడప్పుడూ వస్తున్న రామ్మోహన్ ఓరోజు రేవతితో అన్నాడు "ఈ వయసులో పక్షవాతం వస్తే కోలుకోవడం చాలా కష్టం. నేను ఈ వయసులో ఈ భయంకర జబ్బు బారిన పడిన ఎందరినో చూశాను. వాళ్లలో కోలుకున్న వాళ్ల సంఖ్య చాలా చాలా తక్కువ. ఎక్కువ మంది అలాగే మంచంలోనే ఎంతోకాలం లేదా కొంతకాలం గడిపి అలాగే వెళ్లిపోయారు. కాని ఇప్పుడు మీ అమ్మగారిని చూస్తుంటే నాకే ఆశ్చర్యంగా ఉంది. కేవలం ఆరు నెలల వ్యవధిలో ఈ మాత్రం కోలుకోవడం అంటే అది చాలా గొప్ప విషయమనే




అనుకోవాలి"

"మా అమ్మ మునుపటిలా లేచి తిరగాలి. నాతో మాట్లాడాలి. అదే... అదే నా కోరిక" రేవతి అతడితో చెప్పింది.

ఆమె కోరిక తీరడం చాలా కష్టమనీ, అలా పూర్తిగా కోలుకుని మునుపటి మని షిలా మారడానికి ఎన్నో ఏళ్లు పడుతుందనీ అప్పటికి మరింత వృద్ధాప్యపు బలహీనత మనిషిని కోలుకోకుండా చేస్తుందనీ, అందుకే వయసులో పక్షవాతం వస్తే మనిషి కోలుకుంటాడుగానీ వృద్ధాప్యంలో ఆ జబ్బు బారిన పడితే పూర్తిగా కోలుకోవడం దాదాపు అసాధ్యం అని అతడికి తెలిసినా ఆమెకు చెప్పడం ఇష్టం లేకపోయింది.

ఆమె నమ్మకాన్ని ఎందుకు కాదనాలి? ఒకరి నమ్మకం మరో మనిషికి మేలు చేస్తు న్నప్పుడు ఆ నమ్మకం తప్పు అని చెప్పడం అనవసరమే కదా?

ఒకవేళ అతడు ఆ క్షణం నిజం చెప్పినా రేవతి మాత్రం తన నమ్మకాన్ని వదులుకుని ఉండేదికాదు. తన తల్లి మళ్లీ అడుగులేస్తూ తనతో మాట్లాడగలదన్న నమ్మకం ఆమెకు ఉంది.

★ ★ ★

కుట్టుమిషన్ ముందు కూర్చుని ఏకా గ్రంగా పని చేసుకుంటున్న రేవతి సాయి కృష్ణ లోపలికి వచ్చి తన పక్కనే నిలబ డడం కూడా గమనించలేదు.

"ఎంత పనిలోబడితే మాత్రం మరీ ఇంత పరధ్యానమా? "

ఆ మాటలకు ఆమె ఉలిక్కిపడి తల తిప్పి చూసింది. తన పక్కనే సాయికృష్ణ నిలబడి ఉండడం చూసి ఆశ్చర్యపోయి "హాయ్ సాయి! ఎప్పుడొచ్చావ్? " అంది.

"వచ్చింది ఇప్పుడే! కాని ఇంట్లోకి మనిషి వచ్చిన శబ్దం కూడా నీకు వినిపించలేదంటే మీ ఇంట్లో దొంగతనం చేయడం చాలా సులభం అన్నమాట"

రేవతి నవ్వింది. "డబ్బున్నవాడికి రాత్రులు కూడా నిద్రపట్టదు. డబ్బు లేనివా డికి ఎప్పుడూ నిశ్చింతేనన్నమాట నువ్వు వినలేదా సాయి"

"అంటే? "

"దొంగలుపడ్డా దోచుకునేందుకు ఈ ఇంట్లో ఏమీ లేదు కాబట్టే నేనింత నిర్భ యంగా ఉండగలుగుతున్నాను. సరేనా? "

ఈసారి అతడు నవ్వలేక నవ్వాడు.

ఎందుకనో తెలియదుగానీ ఈ ఆరు నెలల కాలంలో సాయికృష్ణ తమింటికి రావడం చాలావరకూ తగ్గించేశాడు. ఎప్పుడో పది రోజులకో పదిహేనురోజులకో ఓసారి వచ్చినా అలా వచ్చి కనపడి వెంటనే ఏదో పని వున్నట్టు హడావుడిగా వెళ్లిపోతు న్నాడు.

రేవతి కూర్చున్న చోటునుంచి లేచి అత డికి కుర్చీ చూపించింది. అతడికి ఎదురుగా కూర్చున్నాక అడిగింది. "ఈమధ్య తమరి దర్శన భాగ్యమే కరువవుతోంది. మరీ అంత బిజీనా? "

"బిజీ అంటే మరీ బిజీ ఏం కాదుగానీ పనుల వత్తిడి ఎక్కువగానే ఉంది. ఈ రోజు ఆదివారం కాబట్టి కాస్త వీలు చూసు కుని ఇలా వచ్చాను"

"పోనీలే అప్పుడప్పుడయినా వస్తున్నావ్ అదేచాలు" రేవతి ఆ మాట వ్యంగ్యంగా అనలేదు చాలా క్యాజువల్‌గానే అన్నాక అడిగింది. "మరి ఈ రోజు కాఫీ తాగి వెళ్లే టైమయినా వుందా లేదా? "

"ఇస్తే తాగుతాను" అతడు నవ్వుతూ అన్నాడు.

రేవతి లేచి పెరటివైపు వెళ్లింది.

అతడు కుర్చీలో నుండి లేచి శారదమ్మ దగ్గరికెళ్లాక మంచం మీద కూర్చున్నాడు. "ఆంటీ ఎలా వుందిప్పుడు? "

ఆవిడ నుండి జవాబు రాదని తెలుసు. అయినా అడగడం సహజం.

బదులుగా శారదమ్మ నోరు వంకరగా చేసింది.

అప్పుడే రేవతి మంచినీళ్ళు తెచ్చి అతడికి అందించి చెప్పింది. "పాలు పొయ్యిమీద పడేసి వచ్చాను. ఓ అయిదు నిముషాలు జస్ట్ ఐదు నిముషాలలో రడీ అయిపోతాయిలే"

"మరీ అంత తొందరేం లేదులే" అంటూ ఏదో చెప్పబోయి ఆగిపోయాడు. వెంటనే గ్లాసులోని మంచినీళ్ళు గటగటా తాగేసి గ్లాసు ఆమెకు అందించాడు.

రేవతి గ్లాసు అందుకుంటూ మరో చేత్తో నుదుటన పట్టిన స్వేదాన్ని తుడుచుకోసాగింది. అది చూసిన అతడు అడిగాడు "పని మరీ ఎక్కువగా వున్నట్టుంది రేవతీ?"

"ఎక్కువగా ఏమీ లేదుగానీ బాగానే వుందని మాత్రం చెప్పొచ్చు"

"అయితే నేను మరో రోజు వస్తాలే" అతడు తటపటాయింపుగా అన్నాడు.

అతడి తటపటాయింపుని గమనించి ఆమె కాస్త ఆశ్చర్యంగానే అడిగింది "మరో రోజు రావడం ఏమిటి సాయి? నువ్విప్పుడు ఏదయినా పని వుండి ఇక్కడకొచ్చావా?"

"ఆఁ" అతడు తల నిలువుగా ఆడించాడు.

"ఏం పని అది?"

"అది... అది నీతో ఓ పావుగంట మాట్లాడాలి"

శారదమ్మ వాళ్ళిద్దరికేసి నిస్తేజంగా చూస్తోంది.

రేవతి నవ్వింది. "పావుగంట మాట్లాడడానికి అంత తటపటాయింపు ఎందుకు? చెప్పు ఏమిటా మ్యాటర్?"

"అది... అది ఇక్కడ కాదు. నాతో ఓ అర్ధగంట అలా బయటకు రాగలవా?"

రేవతి అతడికేసి వింతగా చూశాక తల తిప్పి తటపటాయింపుగా తల్లి ముఖంలోకి చూసింది తన తల్లి కళ్ళల్లో తన పట్ల నమ్మకమే కదలాడుతోంది.




"సరే! కాఫీ తాగి బయల్దేరుదాం"

"అలాగే"

రేవతి పెరట్లోకి వెళ్లి అయిదు నిముషాల తర్వాత కాఫీగ్లాసులతో ఇవతలికొచ్చింది.

సాయికృష్ణకి ఎదురుగా నిలబడి అతడికో కాఫీగ్లాసు అందించి తనో గ్లాసు వుంచుకుంది.

కాఫీ తాగడం పూర్తయ్యేసరికి ఐదు నిముషాలయింది.

రేవతి తల్లి దగ్గరగా నడిచి ఆమెతో చెప్పింది "అమ్మా సాయి నాతో ఏదో మాట్లాడాలట. నేనో అర్ధగంట అలా బయటకెళ్లొస్తాను ఉండగలవా? "

ఉండగలను అన్నట్టు ఆవిడ నిలువుగా తలాడించింది.

"జ్యూస్ తాగించి వెళ్లనా? "

ఆవిడ తల అడ్డంగా ఆడించిందీసారి.

రేవతి అక్కడినుండి కదిలి బీరువావైపు నడిచింది బీరువాలో నుండి చీర, జాకెట్ తీసుకుని పెరటివైపు వెళ్లింది.

చుట్టింట్లో బట్టలు మార్చుకుని హాల్లోకి వచ్చాక అతడితో అంది "ఇక వెళ్దామా? "

అతడు "అలాగే"అన్నాడు.

రేవతి తల్లికి మరోసారి చెప్పి ముందుకు నడిచింది. ఇంట్లోంచి బయటకు నడిచాక తలుపు దగ్గరగా లాగింది.

ఇద్దరూ రోడ్డుమీద పడ్డారు.

రోడ్డెక్కేవరకూ మౌనంగా వున్న రేవతి అప్పుడే పెదవి విప్పింది. "ఈ రోజు నీ ప్రవర్తన కాస్త కొత్తగా వుంది తెలుసా సాయి"

"అంటే"

అమ్మ ముందు ఎన్నో విషయాలు మాట్లాడుకున్న మనం ఇప్పుడు మాట్లాడుకోవడం కోసం మరెక్కడికో వెళ్తున్నాం"

"నిజమే" అతడు ఒప్పుకున్నాడు. అంతలోనే అన్నాడు "నేనిప్పుడు నీతో కొన్ని విష

యాలు చాలా సీరియస్‌గా మాట్లాడదలచుకున్నాను. అలాంటి విషయాలు ఇంట్లో మాట్లాడడం నాకిష్టంలేదు. అందుకే నిన్ను ఇలా బయటకు తీసుకొచ్చాను"

రేవతి సాయికృష్ణ ముఖంలోకి పరిశీలనగా చూసింది. అతడి మాటలు కాస్త కొత్తగా వున్నాయి. అతడిప్పుడు తనతో సీరియస్‌గా మాట్లాడబోయే విషయాలేంటి? ఆమెకు కొంతవరకూ అర్థమయినట్టుగానే అనిపించింది. కాని పూర్తిగా అర్థంకాకుండానూ ఉంది. అందుకే కొంత క్యూరియాసిటీగానూ అనిపించింది.

"సరే! ఇంతకీ మాట్లాడదలచుకున్నదేమిటో చెప్పు"

"చెపుతాను. అయితే మనం ఇలా నడుస్తూ మాట్లాడుకోవడంకన్నా ఎక్కడయినా ప్రశాంతంగా కూర్చుంటే బాగుంటుంది"

"అదీ నిజమే"

"మరెక్కడికెళ్దాం"

"అది నీ ఇష్టం" ఆమె చెప్పింది.

అతడు కొద్ది సెకనులు ఆలోచిస్తూ నడిచాక అప్పుడే గుర్తొచ్చినట్టు చెప్పాడు "ఇక్కడికి దగ్గర్లో పార్క్ ఉండాలికదా? "

"అవును ఉంది"

"మనం ఆ పార్కులోకెళ్లి కూర్చుందామా"

"అలాగే" అంది.

వాళ్లిద్దరూ అప్పటికి సెంటర్‌కి చేరుకున్నారు.

ప్రతి మనిషీ జీవిత పయనంలో చాలా సార్లు సెంటర్ చేరుకుంటూ వుంటాడు. ఆ చోటకు చేరాక ఏ మార్గాన వెళ్లాలన్నా అతడి నిర్ణయమే అతడి భవిష్యత్తును నిర్ణయిస్తూ వుంటుంది. సెంటర్ చేరిన మనిషి ఎప్పుడూ మంచి మార్గాన వెళ్లాలనే నిర్ణయించుకోవాలి.

వాళ్లిద్దరూ పార్కుగేటు దాటి లోపలికి వెళ్లాక చుట్టూ పరికించి చూశారు. పార్కులో జనం రద్దీ ఎక్కువగా లేదు. ఎదురుగా కనిపించే సిమెంట్ బెంచీలు చాలావరకూ ఖాళీగానే ఉన్నాయి. రెండు మూడు బెంచీల మీద మాత్రం హోటళ్లల్లోనో, మరే ఫ్యాక్టరీలలోనో పనిచేసి అలసిపోయి వచ్చిన కుర్రాళ్లు పడుకుని నిద్రపోతున్నారు. దూరంగా ఓ పొదచాటున ఓ ప్రేమజంట కూర్చుని వుంది. వాళ్లు లోకాన్ని మరిచి స్పర్శసుఖానందంలో మునిగి తేలుతున్నారు.

రేవతి ఎంట్రన్స్‌కి ఎదురుగానే ఉన్న బెంచీవైపు నడిచింది. ఆ బెంచీమీద కూర్చుని కాస్త సెటిల్ అయ్యాక రేవతి అడిగింది "ఇప్పుడు చెప్పు. ఏమిటి అంత అర్జంట్ మ్యాటర్? "

"నాన్న ఈ సంవత్సరం నా పెళ్లి చేయాలని చాలా పట్టుదలతో ఉన్నాడు. నా కోసం సంబంధాలు చూస్తున్నారు"

ఆమె ఫక్కున నవ్వింది.

అతడు ఆమె ముఖంలోకి ఆశ్చర్యంగా చూశాడు.

"ఈ విషయం చెప్పడానికా ఇంత దూరం తీసుకొచ్చింది"

"నేను చాలా సీరియస్‌గా మాట్లాడుతున్నాను రేవతీ"

ఆమె నవ్వడం ఆపింది. "నేనూ సీరియస్‌గానే చెపుతున్నాను సాయి" అందామె.

అతడికి ఆమె మాటలు కోపం కలిగించాయి. అందుకే ముఖమంతా ఎర్రగా మారుతుండగా అన్నాడు. "అసలు నీ గురించి నువ్వేం అనుకుంటున్నావ్ రేవతీ"

చాలా రోజులుగా ఆశనిరాశల మధ్య ఊగిసలాడుతున్న తమ మానసిక అనుబంధం కలిసి నడవడమో లేక విడిపోవడమో తేల్చుకోవాల్సిన రోజు దగ్గరపడిందని ఆమెకు అర్థమయింది.

చాలా నెమ్మదిగానే అయినా స్థిరంగా చెప్పింది. "ఇప్పటివరకూ నా గురించి నేనేమీ ఎక్కువగా ఊహించుకోలేదు సాయి. కాకపోతే ఓ తల్లికి ఒక్కగానొక్క కూతురుని




అనే విషయం ఎప్పటికీ మరిచిపోలేను"

"ఇదుగో నువ్వు మాట్లాడే ఈ మాటలే నాకు సరిపడనిది"

"ఏవి? మా అమ్మ గురించిన మాటలేనా నీకు నచ్చంది?"

"అవును"

"ఎందుకని?"

"అమ్మా, అమ్మా అని కలవరిస్తూ నువ్వు నీ భవిష్యత్తుని నాశనం చేసుకుంటున్నావు కాబట్టి"

"చూడు సాయి, మన పుట్టుకకు మూల కారణం అమ్మానాన్నలు. ఈ తనువు వాళ్లిచ్చిన ప్రసాదం. ఈ బతుకు వాళ్ల ధర్మం. వాళ్లు అందించిన బతుకును బతుకుతూ వాళ్లనే విస్మరించడం అంటే సృష్టికర్తనే విస్మరించడంలాంటిది. నేను అంతటి కృతఘ్నత చూపలేను. ఈ ఒక్క విషయంలో నువ్వు నన్ను క్షమించితీరాలి"

ఆమె మాటల ప్రభావం వలన కాబోలు అతడు కోపాన్ని కొద్దిగా తగ్గించుకున్నాడు. "మా వాళ్లు పట్టుపట్టేది ఆ విషయంలోనే కదా రేవతీ"

"అంటే మీవాళ్లు అనేది నేను మా అమ్మను వదిలి మీ ఇంటికి రావాలి. అంతే కదూ సాయి?"

"వాళ్లు అలా కోరడంలో నాకూ తప్పేం కనిపించడంలేదు రేవతీ"

"నిజంగానా?"

"చూడు రేవతీ! ఏదో ఊహా ప్రపంచంలో బతకడం కాదు. ప్రాక్టికల్‌గా ఆలోచించు. నేను గొప్పకోసం చెప్పబోవడం లేదు. కొన్ని నిజాలు నిర్మొహమాటంగా మాట్లాడుకోవడం అవసరం అని చెపుతున్నాను. నిజానికి మీకన్నా మా కుటుంబం ఆర్థికంగా చాలా ఉన్నత స్థితిలో ఉంది. నేను పెళ్లి చేసుకోవాలంటే ఎంతోమంది ఆడపిల్లల తల్లిదండ్రులు మంచి కట్నంతో అమ్మాయిని ఇచ్చేందుకు సిద్ధంగా ఉన్నారు. అయినా సరే నేను మా వాళ్లకు నీ గురించి చెప్పి అతికష్టంమీద ఒప్పించాను. వాళ్లు తమ ఇంటికి తమ కుటుంబస్థాయికి తగిన మరో ఉన్నత కుటుంబంలోని ఆడపిల్ల రావడాన్ని, లక్షల కట్నాన్ని కూడా కాదనుకున్నారు. వాళ్లు కోరింది ఒక్కటే. 'పేదింటి ఆడపిల్ల ఈ ఇంటికివస్తే కొంతలో కొంత బాధపడి ఊరుకుంటాం. కాని ఆడపిల్ల వెంట మరో పేషెంట్ రావడాన్ని మాత్రం మేం ఒప్పుకోం. అలా కోడలి వెంట వియ్యపురాలు కూడా రావడం ఈ ప్రపంచంలో ఎక్కడా జరగని విశేషం. అలాంటి సాంప్రదాయ విరుద్ధమయిన పని జరగడానికి వీల్లేదు. ఈ ఇంట్లో ఇప్పటివరకూ ఎవరి పనులు వాళ్లే చేసుకుంటున్నారు. అలాంటి ఈ ఇంట్లోకి ఒక పేషెంట్ రావడం అంటే మనం మన సుఖసంతోషాలను దూరం చేసుకోవడమే' ఇవీ వాళ్ల మాటలు" అతడు చెప్పడం ఆపాడు.

ఆమె వెంటనే అడిగింది. "మరి నీకేమనిపించింది సాయి"

"వాళ్ల వాదనలో చాలా నిజం వుందని అనిపించింది" అతడు మాటలకోసం తడుముకునే ప్రయత్నం చేయలేదు.

పొంగుకొస్తున్న ఆవేశాన్ని అదిమిపెట్టి ఆమె ప్రశ్నించింది. "మరి నన్నిప్పుడు ఏం చేయమంటావ్?"

"ఆ విషయం కూడా నేను ఆలోచించాను. మన రాష్ట్రంలో వృద్ధుల శరణాలయాలు చాలా వున్నాయి. ఎలాంటి స్థితిలో ఉన్న ముసలివాళ్లనయినా వాళ్లు చేర్చుకుని చాలా ఓపికతో చూస్తారు. కాకపోతే మనం అక్కడ చెప్పాల్సింది ఒక్కటే. ఆవిడతో మనకెలాంటి సంబంధంలేదు. ఆవిడ ఓ అనాథ. మనం మానవత్వంతో ఆమెను అక్కడ చేరుస్తున్నాం అని. అంతే! వాళ్లు ఆ శరణాలయంలో చేర్చుకున్నాక మనం అప్పుడప్పుడూ వెళ్లి చూసి వస్తూ ఉండొచ్చు"

అప్పటికి కూడా ఆమె కంట్రోల్‌లోనే ఉంది.

"ఇది ...ఇది తప్పేమోకదా సాయి. మానవత్వం ఉన్న మనుషులెవ్వరూ ఇలా చేయరుకదా? "

ఆమె తన మాటలకు కన్విన్స్ అవుతున్నట్టే అనిపించి హుషారొచ్చేసింది. "భలే దానివే రేవతీ! ప్రస్తుత కాలంలో ఇది పెద్ద తప్పేంకాదు. ఇది తప్పుగా భావించేలా ఉంటే ఇన్నేసి ఆశ్రమాలు, అనాథశరణాలయాలు ఎందుకు పుట్టుకొస్తాయి. ఆ శరణాలయంలో ఉండేవాళ్లు నిజమైన అనాథలని నువ్వు అనుకుంటూ ఉంటే అది చాలా పొరపాటు. అక్కడున్న వాళ్లందరికీ బిడ్డలు ఉంటారు. అయితే ఆ బిడ్డలే తమ సొంత సమస్యల కారణంగా తల్లిదండ్రులను అక్కడ చేర్చేస్తారు. కొంతమంది ముసలి వాళ్లు బిడ్డలతో గొడవపడి అక్కడికి చేరుకుంటారు. నిజం చెప్పాలంటే మీ అమ్మలాంటి వాళ్లకు అక్కడే అన్నివిధాల సౌకర్యంగా ఉంటుంది"

"అలా అని ఎలా చెప్పగలవ్ సాయి"

"అక్కడంతా ముసలివాళ్లే ఉంటారు. తమ వయసు వాళ్ల మధ్య ఉన్నప్పుడు సరికొత్త ఉత్సాహం పుట్టుకొస్తుంది. ఆ ఉత్సాహమే వాళ్ల ఆరోగ్యానికి ఎంతో మేలు చేస్తుంది"

నాలుగయిదేళ్ళ క్రితం తను ఓసారి గవర్నమెంట్ హాస్పిటల్‌లో ఉన్న తన ఫ్రెండ్‌తోపాటు ఆమె నాయనమ్మను పరామర్శించడానికి వెళ్ళింది. తన ఫ్రెండ్ నాన్నగారు వ్యాపారి. ఎంతో కొంత స్థితిపరుడే. అయితే ఆ గవర్నమెంట్ హాస్పిటల్లో తను స్థితిపరుడని తెలిస్తే, బిల్లు చెల్లించవలసి వస్తుందేమో మందులు ఫ్రీగా దొరకవేమో అన్న అనుమానంతో ఆ ముసలావిడకు, తనకూ ఏ సంబంధం లేదని, ఆవిడ ఎవ్వరూలేని పక్కింటి ముసలిదనీ ఆ పుత్రరత్నం హాస్పిటల్‌వాళ్ళకు చెప్పాడని తెలిసింది. కేవలం ఓ వెయ్యిరూపాయలు మిగుల్చుకోవడంకోసం ఓ వ్యక్తి ఆమె తన తల్లేకాదని చెప్పడం అప్పట్లో తనకు ఆశ్చర్యం కలిగించింది. 'డబ్బు' కోసం మనిషి బంధాలను కూడా తెంచేసుకుంటున్నాడని ఆరోజు బాధపడింది.

కానీ ఇప్పుడు... మనిషి తన సుఖం కోసం కన్నవాళ్ళను అనాథుల్ని చెయ్యడానికి కూడా సిద్ధపడుతున్నాడని తెలిశాక, ఆవేశం పొంగుకొచ్చింది. అదేపని చేయమని మరొకరు తనను ప్రేరేపిస్తుంటే ఆమె ఇక ఆగలేకపోయింది.

"నువ్వు... నువ్వు అసలు మనిషివేనా? "

అతడు అదిరిపడి ఆమెకేసి చూశాడు. అప్పటివరకూ ఆమె తన మాటలకు కన్విన్స్ అవుతోందనే అనుకుంటూ ఉన్నాడు. అది తన భ్రమ మాత్రమేనని తేలిపోయింది. ఆమె మాటలకు అతడిముఖం ఎర్రబడింది.

"సాయి! ఎప్పుడో ఓ శతకకారుడు చెప్పాడు, 'తల్లిదండ్రులమీద దయలేని పుత్రుండు పుట్టనేమి వాడు గిట్టనేమి, పుట్టలోని చెదలు పుట్టవా గిట్టవా...' అని! తల్లిదండ్రులమీద దయలేని పుత్రుడేకాదు, పుత్రికకూడా ఉన్నా ఒకటే లేకున్నా ఒకటే. దయలేని పుత్రికగా నేను బతకలేను. దయచేసి ఇక నన్ను వదిలిపెట్టి కట్నకానుకలు తెచ్చే మీ కుటుంబస్థాయికి తగిన ఉన్నత కుటుంబంలోని అమ్మాయిని పెళ్ళి చేసుకో... గుడ్‌బై"

ఆమె చప్పున లేచి ముందుకు అడుగులేసింది.

రేవతినుండి అలాంటి రెస్పాన్స్ ఊహించకపోవడం వల్ల కాబోలు అతడు షాక్ తిన్నాడు. ఆ షాక్‌లో ఆమెను పిలవాలన్న ఆలోచన కూడా రాలేదు. అలాగే కూర్చుండిపోయాడు.

ఆమె పార్కునుండి బయటపడింది.

'తెగిపోయింది. అపురూపంగా పెనవేసుకుని శాశ్వతంగా ఉండిపోతుందనుకున్న ఓ బంధం తెగిపోయింది. అమ్మా? పెళ్ళా?, అన్న బంధాలలో తను అమ్మవైపు




మొగ్గింది."

ఆమె మనసంతా అల్లకల్లోలంగా ఉంది. తనచుట్టూ శూన్యం మాత్రమే మిగిలినట్టుగా ఉంది. ఎంత సులభంగా తెంచేసుకోగలిగినా తెగిన ఆ బంధం ఎంతోకొంత బాధను కలిగిస్తూనే ఉంది.

రేవతి ముందుకు నడుస్తూనే ఉంది. కానీ ఎటువైపు నడుస్తుందో తనకే తెలియడంలేదు.

తనకు చాలా దగ్గరగా కారు హారన్ వినిపించింది. అప్పటికానీ ఆమె ఈ లోకంలోకి రాలేదు. ఆమె తల తిప్పి చూసింది. ఆ కారు డ్రైవింగ్ సీట్లో రామ్మోహన్ కూర్చుని ఉన్నాడు. అతడిని చూడడంతో ఆమె ఆగింది.

రామ్మోహన్ కారు ఆమెకు దగ్గరగా వచ్చింది. అతడి ముఖంలో ఆశ్చర్యం కదలాడుతోంది. "రేవతీ! ఇటు... ఇటు...! ఎక్కడికెళ్తున్నావ్?"

రేవతి అప్పుడే తల తిప్పి పరిసరాలను గమనించి చూసింది. తను ఇంటివైపు నడవడం లేదన్న విషయం అప్పుడే అర్థమయింది. హైవేమీద నడుస్తోంది తను. ఆ రోడ్డులోనే గవర్నమెంట్ హాస్పిటల్ ఉంది.

పరిసరాలు గమనించడంతోనే రేవతి కంగారుపడింది. "ఇదేంటి... నేను ఇంటివైపు కాకుండా ఇటు ఎందుకెళ్తున్నాను?" తనలోతాను గొణుక్కుంటున్నట్టుగా అంది.

రామ్మోహన్ ఆమె ముఖంలోకి పరీక్షగా చూశాడు. "రేవతీ! ఎనీథింగ్ రాంగ్?" అన్న ప్రశ్న నోటి చివరివరకూ వచ్చింది. అయితే అతడు అతికష్టమ్మీద ఆ ప్రశ్న అడగకుండా జాగ్రత్తపడి చెప్పాడు.

"సరే! కారెక్కు. ఇంటిదగ్గర డ్రాప్ చేసివెళ్తాను"

"వద్దండి. నేను వెనుతిరిగి నడిచి వెళ్ళిపోతాను"

"నువ్వు మీ ఇంటిదగ్గరనుండి నాలుగయిదు కిలోమీటర్లు నడిచొచ్చేశావ్. ఆ విషయం నీకింకా అర్థమవుతున్నట్టులేదు"

ఆమె మరేం మాట్లాడకుండా కారెక్కింది. కారు కదిలి ముందుకు సాగింది.

అతడు ఓరగా ఆమెకేసే చూడసాగాడు. అయితే ఆమెను మాట్లాడించే ప్రయత్నం చేయలేదు. ఆమె కూడా మాట్లాడే ఉద్దేశ్యం లేనట్టు మౌనంగా వుండిపోయింది.

ముఖ్యంగా ఆమె కొద్దిగా సిగ్గుపడుతోంది. అందుకు కారణం తను రోడ్డమ్మట తనువు మరిచి వెళ్ళిపోవటం, అతడు గమనించడమే!

పది నిముషాల తర్వాత కారు ఆ ఇంటి ముందు ఆగింది.

కారు దిగిన రేవతి అతడిని లోపలికి పిలవాలా వద్దా అన్నట్టు కొద్దిక్షణాలపాటు తటపటాయింపుగా ఉండిపోయాక చివరికి పిలవడానికే నిర్ణయించుకుంది. "లోపలకి రండి"

అతడు కారు దిగాడు. ఆమె వెంట ఇంట్లోకి నడిచాడు.

తలుపు దగ్గర చప్పుడు కావడంతో తల తిప్పి చూసిన శారదమ్మ, సాయికృష్ణతో కలిసి బయటకు వెళ్ళిన కూతురు రామ్మోహన్‌తో కలిసి ఇంట్లోకి రావడంతో కళ్ళు చికిలించింది. ముఖంలో కదలాడుతున్న దిగులు ఇట్టే అర్థమయిపోయింది. అయితే ఏంజరిగి వుంటుందో మాత్రం ఊహించలేకపోయింది.

రామ్మోహన్ ఇంట్లోకి నడిచాక తను కూర్చోలేదు. "కూర్చోండి" అంటూ రేవతికి కుర్చీ చూపించాడు.

నిజానికి అతడు అతిథి. అతడిని కూర్చోమని చెప్పాలన్న ఆలోచన కూడా ఆమెకు రాలేదు. మరేదో లోకంలో ఉండిపోయింది.

రామ్మోహన్ రెండు అడుగులు ముందుకేసి, టేబుల్‌మీదున్న జగ్‌లోని మంచినీళ్ళు గ్లాసులో పోసి ఆమెకు అందించాడు.

ఆమె వద్దనలేదు. గ్లాసు అందుకుని గట

గటా తాగేసింది.

అప్పుడు అతడు ఆమె ఎదురుగా కూర్చుని నెమ్మదిగా అడిగాడు, "ఇప్పుడు చెప్పు రేవతీ! అసలేం జరిగింది? ఎందుకలా పరధ్యాసగా ఎక్కడికో వెళ్ళిపోతున్నావ్? "

ఆమె సర్దుకుంది. "ఏం జరిగింది? ఏమీ జరగలేదు... జస్ట్ ఏదో ఆలోచనల్లో అలా వెళ్ళిపోతూ కనిపించానంతే"

"నువ్వలా అన్నప్పటికీ నేను ఒప్పుకోను. ఎందుకంటే, నీ మాటలు వేరుగా వున్నా ముఖంలోని బాధ స్పష్టంగానే కనిపిస్తోంది. ఏదో... ఏదో జరిగింది? బహుశా అది నీకు షాక్‌లా తగిలి వుంటుంది. అందుకే... నువ్వు నిన్ను నువ్వు మరిచిపోయి, రోడ్డమ్మట పడి ఎక్కడికో వెళ్ళిపోతున్నావ్? "

అతడు వత్తిడి చేయడంతో ఆమెకు ఇక తప్పదని అర్థమయింది. దాంతో అప్పటివరకూ ఆపుకున్న దుఃఖం ఇక ఆగలేనంటూ పొంగుకొచ్చింది. ఆమె దుఃఖం వరదపొంగులా మారి అతడిని ముంచేసింది.

'సాయికృష్ణ గురించి... అతడీరోజు పార్కుకి తీసుకెళ్ళి చెప్పిన సలహా, అందుకు తను చెప్పిన సమాధానం... అక్కడినుండి బయటపడి రోడ్డెక్కాక, తనకు ఒక్కసారిగా పిచ్చిపట్టినట్లుగా అనిపించి, ఎటు నడుస్తోందో చూసుకోకపోవడం...' అంతా చెప్పేసింది.

చెప్పడం పూర్తయ్యాకే తను ఎంత తప్పు చేసిందో అర్థమయిందామెకు. ఆమె కంగారుగా తల్లికేసి చూసింది.

శారదమ్మ చూపులు పైకప్పుకేసి చూస్తుండడంతో ఆవిడ ముఖంలోని భావాలు ఆమెకు అర్థంకాలేదు. అయితే తల్లి తన మాటలు వినేసిందన్న విషయం అర్థమయిపోయింది. ఆమెకు గుండెవేగం పెరిగిపోయింది.

అంతలో రామ్మోహన్ ఆమెతో చెప్పాడు, "ప్రతిమనిషి జీవితంలో అనుకున్నవన్నీ జరగవు. అనుకోనివి చాలా జరుగుతుంటాయి. మనం కోరింది అందినా, అందకపోయినా జీవితం గడపాలి తప్పదు"

ఆమె దీర్ఘంగా నిట్టూర్చింది. "జరిగినదానికి ఇప్పుడు కూడా నేనేం బాధపడడంలేదు డాక్టర్‌గారూ! అమ్మకు అనారోగ్యం కలిగినప్పుడే నేను ఈ ప్రేమలు, పెళ్ళిళ్ళకు దూరంగా ఉండిపోదలుచుకున్నాను. ఇప్పుడైనా నాకు బాధ ఎందుకు కలిగిందంటే అతడు మా అమ్మ గురించి ఇచ్చిన సలహా వలన..."

"అతడేమన్నాడు? "

"అమ్మను అనాథ శరణాలయానికి పంపించమని సలహా ఇచ్చాడని చెప్పాను కదా? "

"అతడు నీకిచ్చింది కేవలం సలహానే! ఆదేశించలేదుకదా? ఈ ప్రపంచంలోని ప్రతి ఒక్కరికీ తన మనసులోని అభిప్రాయం చెప్పే హక్కు ఉంది. అతడి మనసులోని మాట నీకు చెప్పాడు. అంటే అతడి మనసేమిటో నీకు అర్థమయిందని సంతోషడాలేగానీ, ఇలా బాధపడడం అమాయకత్వమనే నా అభిప్రాయం"

నిజమేనన్నట్టు తలూపింది.

అతడు మరికాసేపు కూర్చున్నాక, ఆమెకు చెప్పాడు, "నేనిక వెళ్ళొస్తానూ"

ఆమె తలాడించింది.

అతడు శారదమ్మ దగ్గరగా వెళ్ళి ఆవిడతో కూడా చెప్పాడు, "నేను వెళ్లొస్తాను ఆంటీ"

ఆవిడ తన ఎడమచెయ్యి లేపింది. ఆ చెయ్యి అతడి తలమీద ఉంచింది. ఆవిడ పెదవులు కదల్లేదు. కళ్ళు చెప్పాయి 'వెయ్యేళ్ళు వర్ధిల్లు నాయనా' అని.

అతడికి సంతృప్తిగా అనిపించింది.

రామ్మోహన్ వెళ్ళిపోయాక రేవతి తల్లి మంచంపక్కనే కూర్చుంది. తల్లితో ఏంమాట్లాడాలో ఆమెకు అర్థంకాలేదు.

తల్లి జరిగినదానికి బాధపడి ఏడుస్తూ




ఉంటే తను ఓదార్చవచ్చు. 'అలా ఎందుకు చేశావ్?' అని తిడితే సర్దిచెప్పొచ్చు. కానీ మనసులోని భావాలను మాటల్లో చెప్పలేని ఈ 'ముసలిపాపను' తనెలా ఓదార్చగలదు, మరెలా సర్దిచెప్పగలదు?'

రేవతి తల్లి తలను తీసుకుని గుండెలకు హత్తుకుంది.

"ఎవరేం చెప్పినా, ఎన్నిరకాలుగా ప్రలోభ పెట్టినా నిన్ను వదిలివెళ్ళనమ్మా, వెళ్ళలేనమ్మా" ఆమె గుండె లోతుల్లోంచి పెగిలి వచ్చాయామాటలు.

తనెంతోమంది తల్లీకూతుళ్ళను చూస్తున్నా, ఇంతగా ప్రేమాభిమానాలు పెంచుకున్న తల్లీకూతుళ్లను చూడలేదన్నట్టు ఆ చోట కదలాడే గాలి గొప్పగా సంబరపడింది. ఆ తల్లీకూతుళ్ళను ఆశీర్వదించాలనే కోరికతో ముందుకు సాగి వారిద్దరినీ తాకింది.

శారదమ్మ కళ్ళల్లోనుండి ఒకేఒక కన్నీటి ముత్యం కిందికి జారి కూతుర్ని తాకింది.

ఇద్దరిమధ్యా నిశ్శబ్దప్రవాహం నిర్మలంగా సాగిపోసాగింది.

వాళ్ళిద్దరూ తల్లీకూతుళ్ళ అనుబంధానికి ప్రతీకలుగా ఆప్యాయతానుబంధాలకు బద్ధులై చాలాసేపు అలా ఉండిపోయారు.

ఆ సంఘటన జరిగిన పదిరోజుల తర్వాత సాయికృష్ణ మళ్ళీ ఆ ఇంటికి వచ్చాడు.

అప్పుడే పెరట్లోంచి ముందు గదిలోకి వస్తున్న రేవతి గడపదాటబోతూ అతడిని చూడడంతోనే అడుగు ముందుకు పడక ఆగిపోయింది. సాయికృష్ణ మళ్ళీ తన ఇంటికి రాగలడని ఆమె అనుకోలేదు. అందువల్లే అతడిని చూడగానే ఆమె షాక్ తింది.

అయితే అది కొద్దిసేపే! ఆమె వెంటనే తేరుకుని పెదవుల మీదకు నవ్వు తెచ్చుకుని అంది, "హాయ్ సాయి! వాటే సర్‌ప్రైజ్... రా... రా... కూర్చో"

సాయికృష్ణ కూర్చోలేదు. తన చేతిలోని బ్యాగ్‌లోనుండి ఓ కార్డ్ తీసి ఆమెకు అందిస్తూ చెప్పాడు. "రేవతీ! వచ్చే నెల మొదటివారంలో నా పెళ్ళి... మీరు... మీరు ఆ పెళ్ళికి తప్పకుండా రావాలి"

మామూలుగా అయితే ఆమె బాధతో పెదవులు బిగపట్టాలి. గుండెలోతుల్లోనుండి దుఃఖం పెల్లుబికి రావాలి. కానీ... కానీ చిత్రంగా ఆమెకు అలాంటి ఫీలింగ్సేమీ కలగలేదు. చాలా... చాలా క్యాజువల్ విషయం వింటున్నట్టుగా అనిపించింది. బహుశా ఆమె ఇప్పుడిప్పుడే ఆవేశానికి బాధకు అతీతురాలవుతున్నట్టుంది.

"కంగ్రాట్స్ సాయి... అయితే త్వరలో ఓ ఇంటివాడివి కాబోతున్నావన్నమాట" అంది నవ్వుతూనే. ఆ మాటల్లో ఎలాంటి వ్యంగ్యమూలేదు.

అతడు మాట్లాడలేదు. నవ్వలేకనవ్వాడు. నిజానికి ఆ సమయంలో అతడి ముఖంలో సంతోషం, గర్వమూ, మిళితం కావాలి కానీ అతడి ముఖంలో ఏదో తప్పు చేశానన్న ఫీలింగ్ మాత్రమే కనిపిస్తోంది. ఆ విషయం ఆమె గమనించింది.

"కూర్చో సాయి..."

ఆమె మరోసారి చెప్పాక ఇక తప్పదనుకున్నాడేమో అతడు కుర్చీలో కూర్చున్నాడు. అయితే అతడు ముళ్ళమీద కూర్చున్నట్టు ఇబ్బందిగా కదలడం మొదలుపెట్టాడు.

రేవతి అప్పుడే వెడ్డింగ్‌కార్డ్ బయటకు తీసి చూసి "పెళ్ళి కూతురి పేరు స్వప్న!... పేరు చాలా బాగుంది. అమ్మాయి ఎలా వుంది?" ప్రశ్నించింది.

"బాగానే వుంటుంది"

"తెలుపా, నలుపా?"

"చామనఛాయ... రంగు తక్కువయినా అందంగానే వుంటుంది"

"అమ్మా! మన సాయికి పెళ్ళంట. వెడ్డింగ్ కార్డ్ ఇచ్చివెళ్ళేందుకు వచ్చాడు. ఇదిగో చూడు" రేవతి వెడ్డింగ్‌కార్డ్ తల్లి

కళ్ళముందు వుంచింది.

శారదమ్మ ఆ శుభలేఖకేసి చూడలేదు. అయిష్టంగా తల పక్కకు తిప్పుకుంది.

అటే చూస్తున్న సాయికృష్ణ మనసు బాధ పడింది.

రేవతి అప్పుడే అతడివైపు చూసింది. ఆమె కూడా కొద్దిగా బాధపడింది. తన తల్లి మరీ అలా ప్రవర్తించి ఉండకూడదనిపించింది.

ఆమె తల్లి దగ్గరనుండి వచ్చి అతడికి ఎదురుగా నిలబడి నవ్వలేక నవ్వుతూ పలికింది. "అమ్మకు మూడ్ బాగోలేనట్టుంది. అందుకే అలా...

"ఫర్వాలేదు... ఇందులో బాధపడాల్సిందే మీలేదు"

ఆ నిశ్శబ్దాన్ని ఛేదిస్తూ అతడు అన్నాడు, "నేనిక బయల్దేరుతాను"

"అయ్యో! కూర్చో... కూర్చో... కాఫీ పెట్టుకొస్తాను"

"వద్దు. నేనింతకుముందే తాగాను. ఇంకా చాలా చోట్లకువెళ్ళాలి. నేను వెళ్తాను"

"పెళ్ళిపనులు కాబట్టి బిజీగా ఉండటం సహజమే. అయినా సరే, మరీ ఇంత హడావుడిగా వచ్చి వెళ్ళిపోవడం ఏమీ బాగోలేదు సాయి"

ఆమె అలా అనడంతో అతడికి కూర్చోక తప్పలేదు.

అతడికి మంచినీళ్ళు అందించాక, లోపలికెళ్ళి ప్లేట్‌లో స్వీటు, కారప్పూస పట్టుకొచ్చి ముందుంచింది. "తింటూ వుండు. ఐదు నిమిషాల్లో కాఫీ పట్టుకొస్తాను"

సాయికృష్ణ తలాడించాడు. స్వీటు అందుకుని నోట్లో పెట్టుకోబోతూ యధాలాపంగా అటు చూస్తే శారదమ్మ తనకేసి సీరియస్‌గా తినేసేలా చూడడం కనిపించింది. అతడికి స్వీటు మింగుడు పడడం కష్టమయింది.

అతడు ఆవిడ చూపుల్లో చూపు కలిపే ధైర్యం చేయలేకపోయాడు. మెల్లగా చూపు మరల్చుకుని **అటూఇటూ** చూడసాగాడు. 'ఎప్పుడొచ్చినా ఆ ఇంట ఆనందంగా ఉండగలిగేవాడు. కానీ ఇప్పుడు ఇబ్బందిగా ఫీలవుతున్నాడు. ఎందుకిలా? ... తనేమయినా తప్పు చేశాడా?

'లేదు' అని అంతరాత్మకు కూడా అతడు సర్దిచెప్పుకోలేకపోయాడు.

రేవతి కాఫీ పట్టుకుని రావడంతో అతడికి చాలా రిలాక్స్‌డ్‌గా అనిపించింది. ఆమె చేతిలోని కప్పు అందుకుని చాలా త్వరగానే 'తాగడం' అనే పని పూర్తిచేశాడు. లేచి నిలబడి "నేనిక వెళ్ళొస్తాను... రేవతీ... మీరు తప్పకుండా పెళ్ళికి రావాలి"

"తప్పకుండా వస్తాను" ఆమె గట్టిగానే చెప్పింది.

అతడు ముందుకు అడుగు వేయబోతూ ఆమె ముఖంలోకి చూశాడు. రేవతి ముఖంలో బాధ కనిపించలేదు. ఈ పెళ్ళివలన తనకే నష్టమూ లేనట్టు తనతో మాట్లాడుతోందని కూడా అతడూహించలేదు.

"వెళ్ళొస్తాను"

ఆమె తలాడించి అతడి వెనకే ఇంట్లోంచి బయటకు నడిచింది. అతడు గేటుదగ్గర ఆగాడు.

ఇద్దరూ ఒకరికి ఒకరు ఎదురుగా నిలబడి వున్నప్పుడు అతడు కళ్ళెత్తి ఆమె ముఖంలోకి చూసి అడిగాడు, "బాధపడుతున్నావా? "

ఆమె అతడి ముఖంలోకి ఆశ్చర్యంగా చూసింది. "ఎందుకు? "

అతడు తడబడ్డాడు. నిజానికి అతడు ఆమె బాధగా ముఖం పెడితే చూడాలనుకున్నాడు. కానీ అతడి ఆశ నిరాశయింది. పోనీ తను అడిగినప్పుడయినా ఆమె ముఖం బాధగా పెడితే బాగుణ్ణు. అలా కాకుండా 'ఎందుకు? ' అంటూ ఎదురుప్రశ్నిస్తే తడబడడం తనవంతు కాదా? !

"అది. అది.

"చూడు సాయి! నిజంగా చెపుతున్నాను.

నీ పెళ్ళి జరిగిపోతోందని తెలిసి నాకు చాలా చాలా సంతోషంగానే వుంది. నా స్నేహితుడు ఓ ఇంటివాడు కాబోతున్నాడని ఆనందపడుతున్నానే తప్ప, మరే రకమయిన బాధా నాలో కలగడంలేదు. అందుకే నేను నీ పెళ్ళికి రావాలని నిర్ణయించుకున్నాను"

అతడు మరేం మాట్లాడాలో తెలియనట్టు మాట్లాడలేకపోయాడు. ఎప్పటికో తేరుకుని, "వెళ్ళొస్తా"నంటూ ముందుకు సాగిపోయాడు.

సాయికృష్ణ వీధి మలుపు తిరిగేవరకూ అక్కడే నిలబడిన రేవతి, వెనుదిరిగి ఇంట్లోకి నడిచింది.

అప్పుడే ఆమె మనసులో ఓ ప్రశ్న ఉదయించింది. "అవునూ...! సాయికృష్ణ పెళ్ళి జరిగిపోతుంటే నాకు బాధ కలగడం లేదు ఎందుకని?" నిజంగానే, ఎందుకో తెలియదు. తనకి సాయికృష్ణ పెళ్ళి చేసుకుంటున్నాడన్న వార్త పెద్దగా బాధను కలిగించలేదు. అలా ఎందుకని? నిజానికి అతడిని తను ఇష్టపడుతున్నప్పుడు అతడి పెళ్ళి వార్త తనకు ఎంతో కొంత బాధను కలిగించాలి. కానీ అలా అనిపించడంలేదు.

ఇలా ఎందుకు అని ఆమె తన మనసును ప్రశ్నిస్తే దొరికిన సమాచారం ఒక్కటే. నేను తీసుకున్న నిర్ణయం తప్పుకాదు.

కొన్ని నిర్ణయాలు మనిషిని డైలమాలోనే ఉంచుతాయి. తను నిర్ణయం తీసుకున్నప్పటికీ మనసు మూలల్లో ఎక్కడో తను తీసుకున్న నిర్ణయం సరైనదా, కాదా అన్న అనుమానం కదలాడుతూనే ఉంటుంది.

ఆమె మనసులో తను తీసుకున్న నిర్ణయం పట్ల ఎలాంటి డైలమాలేదు. పైగా సంతృప్తితో మనసు నిండిపోయింది. ఆ సంతృప్తి బాధను పూర్తిగా పక్కకు నెట్టేసింది. అదీ జరిగింది.

సాయికృష్ణమీద కోపం మిగలకపోవడంతో ఆమె అతడి పెళ్లికి వెళ్లాలనే నిశ్చయించుకుంది.

అయితే తనతల్లి ఈ సంఘటనను సులభంగా తీసుకోలేకపోయిందని, ఆమె ఏమాత్రం ఊహించలేకపోయింది. ఆమె చాలా కొద్దిసేపటిలోనే సాయికృష్ణ విషయం మరిచిపోయి, తనపనిలో పడిపోయింది.

శారదమ్మకు మనసు ఉడికిపోతూ ఉంది. ఏదో చేయాలన్న కసి పుట్టుకొస్తోంది. కానీ ఏమీ చేయలేని తన నిస్సహాయతమీద తనకే అసహ్యం వేస్తోంది. ముఖ్యంగా తన అనారోగ్యంవలననే తన కూతురు పెళ్లికి దూరమయిపోతూ ఉందన్న విషయం అర్థమయిపోతూనే ఉంది. తన కారణంగా తన కూతురికి పెళ్లి కాకపోవడాన్ని ఏ తల్లి భరించగలదు?

ఏంచెయ్యాలి?

ఎలా చెయ్యాలి?

తనేదో చెయ్యకపోతే, ఇప్పటికే ఇష్టపడిన వ్యక్తికి దూరమయిన ఆమె, రోజులు గడిచే కొద్దీ పెళ్లికి కూడా దూరమైపోవలసి వస్తుందన్నది నిజం. తనకీ జబ్బు పూర్తిగా నయమవడానికి ఎన్ని సంవత్సరాలు పడుతుందో తెలియదు. ఒకవేళ పూర్తిగా తగ్గినా మరో మనిషి అండలేనిదే బతకడం కష్టం. అంటే... తనకు జీవితాంతం తనకూతురు తోడుగా ఉండాలి. ఆమె తనకు తోడుగా ఉండటమంటే ఆమె తన సర్వసుఖాలు త్యజించడమన్నది తప్పనిసరి. ఓ ఆడపిల్ల చేయదగిన త్యాగానికి పరాకాష్ట అది.

తన కూతురు వ్యక్తిత్వం ఎంత గొప్పదంటే, తనేదో కోల్పోతున్నానన్న ఆలోచన అసలు ఉన్నట్టే కనిపించదు. చివరికి ఈరోజు సాయికృష్ణ పెళ్లి పత్రిక ఇచ్చివెళ్లినా ఆమేదో పోగొట్టుకున్నానన్నట్టుగా కనిపిస్తే తనకు బాధ కలుగుతుందని, అసలేమీ జరగనట్టుగా ప్రవర్తించడం... ఇలాంటి కూతుర్ని కన్నందుకు నిజంగా తనే అదృష్టవంతురాలు.



కాని తన అదృష్టం కూతురు పాలిట దురదృష్టంగా మారకూడదు.

ఆవిడ ఆలోచించడం మొదలుపెట్టింది.

అలా ఆలోచిస్తూ ఉండగా ఓ పరిష్కార మార్గం తోచింది.

అది కష్టసాధ్యమే తప్ప అసాధ్యంకాదు.

చివరికి ఆవిడ తనకు తోచిన పరిష్కార మార్గాన్ని నిర్ణయంగా మార్చుకుని, ఆ నిర్ణయం ఆ రాత్రికే అమలు పరచాలను కుంది.



రాత్రి రెండు గంటలు.

మనిషి గాఢమైన నిద్రలో మునిగే సమయం అదే.

శారదమ్మ తల తిప్పి పక్కనే ఉన్న మంచంకేసి చూసింది. రేవతి గాఢనిద్రలో ఉన్నట్టుగానే అనిపించింది.

ఆవిడ అతికష్టంమీద ఎడమ చెయ్యిని, ఎడమకాలుని నేలకు జార్చింది. ఆ చెయ్యి, కాలు పట్టుతోనే శరీరమంతా బలవంతాన మంచం అంచున లాగింది. ఆ మంచం ఎత్తు తక్కువకావడం ఆవిడ అదృష్టమనే చెప్పుకోవాలి. ఎంత ఒకకాలు, ఒక చెయ్యి నేలకు తాకించి బలం ఉపయోగించినా సగం శరీరం తన ఆధీనంలో లేకపోవ డంతో కిందకు జారేప్పుడు 'దభ్' మనే చప్పుడయింది.

శారదమ్మ కంగారుగా కూతురి మంచం కేసి చూసింది. ఆ శబ్దానికి కూడా రేవతి మేల్కోలేదు. పగలంతా కుట్టుమిషన్ ముందు కష్టపడడం, ఇంటిపని, వంటపని చేయడంతో బాగా అలసిపోయి ఉందేమో ఆదమరచి నిద్రపోతోంది.

ఆవిడ ఒక చెయ్యిని ఆధారంగా చేసుకుని, ఒక కాలుని కదిలిస్తూ ముందుకు పాకసా గింది. నాలుగు అడుగులు పాకేసరికి అల సట వచ్చింది. ఆవిడ ఇక ముందుకు సాగ లేనట్టు రొప్పసాగింది.

అలా రొప్పుతూ కూడా వీలయినంతవ రకూ శబ్దం రాకుండానే జాగ్రత్తపడసా గింది.

అయినాసరే, ఆమె తన ప్రయత్నం విర మించదలచుకోలేదు. ఎంత కష్టమయినా పెరట్లోకి వెళ్లగలిగితే అంతేచాలు.

పెరట్లో 'బావి' ఉంది.

వంట్లోని శక్తినంతా కూడగట్టుకుని శార దమ్మ మళ్ళీ ముందుకు పాక సాగింది.

పెరటివైపు తలుపు గడియను శబ్దం రాకుండానే తీయగలిగింది.

అక్కడినుండి ముందుకు పాకసాగింది.

అంత శ్రమను తట్టుకోలేనట్టు శరీరం సహకరించడంలేదు. గుండె వేగం పెరిగిపో యింది. ఏదో తెలియని ఆవేశంలో అర్థంకా వడం లేదుగానీ, కొన్నిచోట్ల చర్మం చీరుకు పోయి ఉంటుంది.

శారదమ్మ అవేవీ ఆలోచించే స్థితిలో లేదు. ఆమె కళ్లముందు 'బావి' కదలాడు తోంది. ఎలాగయినా అక్కడకు చేరుకోవ డమే తన 'లక్ష్యం'గా ఆమె భావించింది.

ఆవిడ ముందుకు సాగింది.

బావి దగ్గరకు చేరుకుంది. ఎత్తయిన పిట్టగోడను ఓ చేత్తో పట్టుకుని లేవాలని ప్రయత్నించింది కానీ బలం చాల్లేదు. వంట్లోని అణువణువునందలి శక్తిని కూడగ

ట్టుకుంది. అయినా ఆమె శక్తి ఆ పని చేయ డానికి సరిపోలేదు.

చుట్టూ ప్రకృతి ఆ తల్లికేసి జాలిగానూ బాధగానూ చూస్తోంది.

ఆమె ఎంతో ప్రయత్నించింది. ఆ ప్రయ త్నంలో సఫలీకృతురాలు కాలేకపోయింది గానీ స్పృహమాత్రం తప్పింది.

తెల్లవారు ఝామున మేల్కొన్న రేవతి యధాలాపంగా తల్లి మంచంకేసి చూడగానే ఉలిక్కిపడింది. ఆమె గుండె లయ తప్పింది.

కదలలేని స్థితిలో మంచంమీద పడివున్న తల్లి ఎక్కడకూ వెళ్ళలేదని తెలుసు. అయినా పని చేయని మెదడు కొద్దిక్షణాల తర్వాత పని చేయడం మొదలుపెట్టినప్పుడు రేవతి గది అన్ని మూలలకూ తల తిప్పి చూసింది. ఆమె కళ్లు తల్లికోసం గదంతా వెతికి చూశాయి.

మంచం దిగలేని తల్లిని గదిమూలలంతా వెతికి చూడడం పిచ్చితనం కాకమరేంటి?

క్షణంలోనే ఏవేవో అనుమానాలు మన సులో కదలాడి గుండె వేగం పెరిగేలా చేశాయి. అంత ఉదయాన్నే కూడా ఆమెకు అరచేతుల్లో చెమటలు పట్టేశాయి.

అలా ఏం చేయాలో తోచక దిక్కులు చూస్తున్నప్పుడు కనిపించిందా దృశ్యం.

పెరటి తలుపు తెరిచి వుంది.

రేవతి వేగంగా కదిలింది.

ఇంకా తెల్లవారలేదు. ఆకాశంలో చీకటి ఇంకా తొలగిపోలేదు. అయితే ఇంట్లో వెలు గుతున్న ట్యూబ్‌లైట్ కాంతి పెరట్లోకి పడు తోంది. ఆ వెలుగులోనే ఆమెకు పరిసరాలు స్పష్టాస్పష్టంగా కనిపిస్తున్నాయి. ఆ వెలుగు లోనే చుట్టూ పరిశీలించి చూస్తున్న ఆమె కళ్లకు కనిపించిందా దృశ్యం.

శారదమ్మ ఒక చెయ్యి బావి పిట్టగోడ అంచుని అలాగే పట్టుకుని వుంది. ఆవిడ ఆ పిట్టగోడకు శరీరాన్ని మోపి అలాగే కళ్లు మూసుకుని శిలా ప్రతిమలా కనపడు తోంది.

ఆ క్షణం రేవతికి కలిగిన అనుమానం ఒక్కటే! అయితే ఆ అనుమానం గురించి పూర్తిగా ఆలోచించడానికి కూడా భయప డింది.

తన తల్లి...?

ఆమె మెదడు స్థంభించిపోవడంతో కలలో కదిలినట్టుగానే అడుగులు ముందు కేసింది.

తల్లి ముందు మోకాళ్ల మీద కూర్చున్నాక వణికే చేతులతో ఆవిడను తాకింది.

శరీరం ఓ వైపు చల్లగానే వుంది. మరో వైపు వెచ్చగా తగిలింది. శరీరం వెచ్చగా ఉందంటే ఆమె గుండెల మీద చెవి ఉంచి నిర్ధారించుకుంది.

జీవితం మొత్తం మీద రేవతికి అంత ఆనందం ఎప్పుడూ కలగలేదు.

ఆ ఆనందంలో కొద్దిక్షణాలు అలాగే ఉండిపోయాక అప్పుడు ఆలోచించింది. తనిప్పుడు ఏం చేయాలి? ఏదో ఆవేశంలో తన తల్లి ఇక్కడివరకూ పాక్కుంటూ వచ్చి నట్టుంది. మరి ఇప్పుడు ఈమెను ఇంట్లోకి చేర్చడం ఎలా?

కొద్దిక్షణాలు... కొద్దిక్షణాలే సందిగ్ధంగా నిలబడ్డాక రేవతి ఒక నిర్ణయానికి వచ్చింది. ఆ నిర్ణయాన్ని అమలుపరచడా నికి ఆమె తనకు శక్తి సరిపోతుందో లేదో ఆలోచించలేదు.

రేవతి రెండు చేతులతో తల్లిని ఎత్తు కుంది.

చిన్నప్పుడు ఆ తల్లి ఈ కూతుర్ని ఇలాగే ఎత్తుకుని జోలాలి... జోలాలి అంటూ పాట పాడింది. చెట్టుకు కాయభారమా? కనిపెంచే తల్లికి బిడ్డ భారమా? అను కుంది.

గతం తిరగబడింది. కూతురి చేతుల్లో ఆ తల్లి పసిబిడ్డగా మారింది.

ఒక భర్త భార్యను ఇలా చేతుల్లోకి తీసు కుని ఉండొచ్చు ప్రియుడు ప్రియురాలిని

ప్రేమతో ఇలా ఎత్తుకోవచ్చు. అనారోగ్యం తోనో, ఆరోగ్యంతోనో వున్న తల్లిని ఆప్యాయంగా చేతుల మధ్య పసిపాపలా ఉంచుకుని ముందుకు నడిచి ఉండొచ్చు. కాని ఒక కూతురు తన తల్లిని అలా చేతుల మధ్య పసిపాపలా మార్చుకుని ముందుకు నడవడం చరిత్ర ఎప్పుడయినా చూసిందా?

అదొక అపురూప దృశ్యం.

ఆ దృశ్యాన్ని చూడాలన్నట్టు చంద్రుడు మబ్బుల చాటు నుండి బయటపడ్డాడు.

గాలి ఊపిరి బిగపట్టి అటు చూడసాగింది.

ఆమె తల్లిని రెండు చేతుల మధ్య వుంచుకుని ముందుకు నడిచింది.

బిడ్డకు తల్లి భారమా?

రేవతి తల్లిని ఇంట్లోకి తీసుకొచ్చి మంచం మీద పడుకోబెట్టింది.

అంత బరువు కొంత దూరం మోసుకు రావడం వలన అలసటగా అనిపించి మంచం పక్కనే కూర్చుండిపోయింది.

అలా కూర్చునే తల్లి ముఖంలోకి చూస్తే ఆవిడ పసిపాపలాగే ఈ లోకం గురించిన స్పృహలేకుండా కళ్ళు మూసుకుని ఉంది.

కొద్దిక్షణాల తర్వాత తేరుకున్న రేవతికి ప్రస్తుతం తన కర్తవ్యం ఏమిటో ఎంత ఆలోచించినా బోధపడలేదు.

తన తల్లి స్పృహలోలేదు. చాలా దూరం పాకుతూ వెళ్లడం వలన వళ్లంతా చీరుకుపోయి రక్తపుమరకలు కనిపిస్తున్నాయి. ఇప్పుడు తనేం చేయాలి?

ఏం చేయాలో బోధపడలేదుగానీ ఆ క్షణం ఆమెకు రామ్మోహన్ గుర్తుకువచ్చాడు. అతడు గుర్తుకు రావడంతోనే కొంత ధైర్యం వచ్చింది.

అది తెల్లవారుఝాము అని కూడా ఆమె ఆలోచించలేదు. వీధి తలుపు తెరుచుకుని ఒక్క అంగలో రోడ్డెక్కింది.

రోడ్డు నిర్మానుష్యంగా ఉంది. అయినా ఆమెకు భయంగా అనిపించలేదు. ఆమెకు ఆ క్షణం బాధ్యత మాత్రమే గుర్తుంది.

అలా నడుచుకుంటూనే ఆమె సెంటర్‌కి చేరుకుంది.

అక్కడ ఇరవై నాలుగు గంటల సర్వీసుతో నడిచే యస్టీడి బూత్ ఉంది. ఆమె లోపలికెళ్లి రామ్మోహన్ ఇంటికి డయల్ చేసింది.

ఆ సమయంలో అతడు గాఢనిద్రలో ఉన్నట్టున్నాడు. ఎంతోసేపు ఫోన్ రింగ్ అయ్యాక అతడు లైన్‌లో కొచ్చి "హలో" అన్నాడు.

"హలో డాక్టర్! నేను రేవతిని"

అతడికి ఒక్కసారిగా నిద్రమత్తు ఎగిరిపోయినట్టుంది. "రేవతీ! ఏమిటి? ఏమిటీ వేళప్పుడు ఫోన్ చేశావ్?"

"అమ్మకు స్పృహ తప్పింది. మీరు వెంటనే రాగలరా?"

అతడు కనీసం వివరాలు అడిగే ప్రయత్నం కూడా చేయలేదు. "పావుగంటలో అక్కడుంటున్నాను" అంటూ ఫోన్ పెట్టేశాడు.

రేవతి రెండు రూపాయలు అక్కడ ఉంచి బయటకు నడిచింది. అక్కడినుండి వడివడిగా ఇంటివైపు సాగింది.

ఆమె ఇంటికి చేరుకుని అటుచూస్తే తల్లి పరిస్థితిలో ఎలాంటి మార్పు కనిపించలేదు. తల్లి మంచంపక్కనే కూర్చుని ఆవిడ ముఖంలోకే చూస్తూ కూర్చుంది.

పావుగంట గడవక ముందే ఆ ఇంటి ముందు కారాగింది.

కారులోనుండి దిగిన రామ్మోహన్ లోపలికి వచ్చి ఓసారి శారదమ్మకేసి చూశాక రేవతివైపు తిరిగి అడిగాడు "ఏం జరిగింది? ఈ రక్తపు మరకలేవిటి?"

రేవతి తనకు తెలిసిన వరకూ చెప్పింది.

అతడు తలాడిస్తూ కొద్దిక్షణాలు మౌనంగా వుండిపోయాడు. తర్వాత బయటకు నడిచి కారులో నుండి ఫస్ట్ ఎయిడ్ కిట్ తెచ్చాడు. అందులోనుండి ఇంజక్షన్స్




తీసి ఆమె చేతికి చేశాడు. సెలైన్ బాటిల్ ఎక్కించాడు.

పేషెంట్‌కి మెడికల్ ట్రీట్‌మెంట్ ఇచ్చాక అతడు తీరికగా కూర్చుని సాలోచ నగా రేవతిని చూస్తూ అడిగాడు "ఇది, ఇదెలా జరిగింది? "

"ఎలా జరిగిందో నాకూ అర్థం కావడం లేదు. నేను నిద్రలేచి చూసేసరికి అమ్మ బావి దగ్గర పడివుంది"

అంత అర్ధరాత్రి వేళ మీ అమ్మగారు బావివరకూ ఎందుకెళ్లినట్టు"

ఏం చెప్పాలో అర్థం కానట్టు ఆమె మౌనంగా ఉండిపోయింది.

"పోనీ నిన్న ఆమె మనసుకు బాధకలిగే సంఘటన ఏదయినా జరిగిందా? "

"అలాంటిదేమీ లేదు" అనేసింది రేవతి. అలా అన్న పది సెకనుల తర్వాత ఫ్లాష్‌లా వెలిగింది "ఆ... మర్చేపోయాను. నిన్న సాయికృష్ణ వెడ్డింగ్‌కార్డు ఇవ్వడానికి మా ఇంటికొచ్చాడు. ఒకవేళ అమ్మ ఈ విష యాన్ని సీరియస్‌గా తీసుకుని..." అంటూ ప్రశ్నార్థకంగా అతడి ముఖంలోకి చూసింది.

రామ్మోహన్ ఆసక్తిగా ముందుకు వంగాడు. "ఏంటి? సాయికృష్ణకు పెళ్లా? " అతడి గొంతులో ఆశ్చర్యం కదలాడింది.

"అవును" ఆమెకు అతడు ఎందుకంతగా ఆశ్చర్యపోతున్నాడో అర్థంకాలేదు.

ఆ విషయం జీర్ణించుకోవడానికి అన్నట్టు అతడు కొద్దిసేపు మౌనంగా వుండిపో యాడు. అయినా ఇప్పటి సమస్య సాయి కృష్ణ పెళ్లికాదని, శారదమ్మ అనారోగ్య పరి స్థితికి కారణం తెలుసుకోవడం అని గుర్తుకొ చ్చాక ఒక నిట్టూర్పు లాంటిది వదిలి తర్వాత అడిగాడు. "సాయికృష్ణ ఈ విషయం చెపుతున్నప్పుడు మీ అమ్మగారి ఫీలింగ్‌ని గమనించారా? "

"గమనించడం అంటే..." ఆమె నిన్నటి సంఘటనను గుర్తు తెచ్చుకుంటున్నట్టు కొద్ది క్షణాలు నేలచూపులు చూశాక. చెప్పింది. "అమ్మ ఆ విషయం వినగానే అప్‌సెట్ అయిందని మాత్రం అర్థమయింది నాకు"

అతడు తలాడించాడు. అప్పటికే అతడికి విషయం అర్థమయినట్టుంది. అయితే ఆ విషయం ఆమెకు ఎలా చెప్పాలో అర్థం కావడం లేదు. కాని చెప్పడమే మంచిదనిపి స్తోంది. అందుకే కొద్దిసేపటి తర్వాత అతడు ఆమె ముఖంలోకి చూస్తూ అన్నాడు. "రేవతీ! మీ అమ్మగారు లేవలేని స్థితిలో కూడా ఎలా వెళ్లగలిగిందో తెలియ దుగానీ బావి దగ్గరకు ఎందుకెళ్లిందో నీకు తెలుసా? "

"ఎందుకు? "

"ఆత్మహత్య చేసుకోవడానికి"

అతడేమన్నాడో మొదట ఆమెకు అర్థం కాలేదు. అర్థంకాగానే అడుగు దూరంలో బాంబు పేలినట్టు అదిరిపడి అలాగే నిలబ డిపోయింది. కొద్దిసేపు నోటమాట రాలేదు. ప్రపంచమంతా తన చుట్టూ గిర్రున తిరుగు తున్నట్టనిపించింది.

కొద్దిక్షణాలపాటు ఇద్దరిమధ్యా నిశ్శబ్ద ప్రవాహం.

ఆమె ఎప్పటికో తేరుకుంది. "మీరు... మీరు చెప్పేది నిజమా? "

"అది నా అనుమానం. కాని... ఖచ్చి తంగా అలా జరిగి ఉండాలనేది నా నమ్మకం"

"అలా చేయడానికి అమ్మకు అంత అవస రమేమొచ్చింది"

"అవసరంకాదు. తను అడ్డు తప్పుకుంటే నువ్వు సుఖంగా వుంటావేమోనన్న ఆలోచ నతో అలా చేసి ఉండొచ్చు"

"అమ్మలేకపోతే నేను సుఖంగా ఉంటానా అదెలా సాధ్యం? " ఆ తల్లి విషయలో ఆమె రెండో ఆలోచనకు కూడా తావివ్వలేదన్న దానికి ఆ ప్రశ్నలే సాక్ష్యం.

రామ్మోహన్ చెప్పాడు. "నీ సుఖం గురించి ఆవిడ ఏ కోణంలో ఆలోచించి వుంటుందో నువ్వా ఆ కోణంలోకి వెళ్లి

ఆలోచించు అర్ధమవుతుంది"

రేవతి ఆలోచించింది. తల్లి బాధ ఆమెకు అర్థమయింది. అప్పటి వరకూ నిలబడి వున్న ఆమె ఇక నిలబడలేనట్టు మంచం మీద కూలబడింది.

పావుగంట తర్వాత శారదమ్మకు స్పృహ వచ్చింది.

ఆవిడకు స్పృహరావడంతోనే రేవతి తల్లి దగ్గరికెళ్లి పక్కనే నిలబడి మెల్లగా "అమ్మా" అంది.

శారదమ్మ కూతురి ముఖంలోకి చూడలేనట్టు చూపులు మరోవైపుకు తిప్పింది. దాంతో అప్పటివరకూ రేవతికి ఏకాసింత అనుమానం ఉన్నా అది కాస్తా ఎగిరిపోయింది. రామ్మోహన్ చెప్పినట్టు అమ్మ నిజంగానే ఆత్మహత్య చేసుకోబోయింది.

ఆమె తల్లి మంచంమీద కూలబడింది. ఈసారి ఆమె మరింత ఆర్తిగా పిలిచింది "అమ్మా"

ఆ పిలుపులో కదలాడిన ఏ భావమో మనసును కదిలించగా శారదమ్మ తల తిప్పి కూతురి ముఖంలోకి చూసింది.

"అమ్మా... అమ్మా! నేను సుఖంగా ఉండాలని నువ్వు నీ జీవితాన్నే అంతం చేసుకోవాలని అనుకున్నావా? "

తను చేయబోయింది తప్పేనని ఒప్పుకుంటున్నట్టు ఆవిడ కళ్లల్లో నీళ్లు సుడులు తిరిగి బుగ్గలమీదుగా కిందికి జారసాగాయి.

"అయినా నువ్వు లేకపోతే నేనెలా బతకగలననుకున్నావమ్మా! నా ఆశ, ఆశయం, గమ్యం అన్నీ నీ సుఖమేకదా? ఒకవేళ నువ్విలా నాకు దూరమైపోతే తల్లి రుణం తీర్చుకోలేకపోయాననే బాధ నన్ను జీవితాంతం పట్టిపీడిస్తుంటుంది. నన్నలా బాధ పెట్టడం నీకు సబబేనా అమ్మా? "

ఆవిడ రెండు చేతులూ చేతనావస్థలో వుండి ఉంటే తన బిడ్డను రెండు చేతులతో గుండెలకు హత్తుకుని తనివితీరా ఏడ్చి ఉండేది. అలా చేసేందుకు వీలులేకుండా ఒక చెయ్యి కదలనని మొరాయిస్తోంది. అందుకే తన కదిలే చేతితోనే కూతురుని పట్టుకుంది.

"చెయ్యకమ్మా! ఇంకెప్పుడూ ఇలా చేయకమ్మా! నువ్విలా చేస్తే నేనూ బతకను. అదే రోజు నేనూ నీ వెంట వచ్చేస్తాను. మరో లోకంలోనయినా నేను నీకు సేవచేసుకుని తల్లిరుణం తీర్చుకుంటాను. సరేనా" రేవతి వెక్కివెక్కి ఏడవసాగింది.

ఆవిడ ఒక్క చేత్తోనే కూతుర్ని గుండెలకు హత్తుకుంది. తల్లీకూతుళ్లిద్దరూ ఒకరు నిశ్శబ్దంగా మరొకరు పెద్దగా ఏడవసాగారు.

వాళ్లిద్దరినీ చాలాసేపు ఏడవనిచ్చాక రామ్మోహన్ రెండడుగులు ముందుకేసి మంచం దగ్గరగా వెళ్లాడు.

"రేవతీ! కంట్రోల్ యువర్ సెల్ఫ్. జరిగిందేదో జరిగిపోయింది. ఏదో ఆవేశంలో మీ అమ్మగారు అలా చేసి ఉంటారు. ఇప్పుడు తన తప్పు తెలుసుకున్నారు. ఇక ఎప్పటికీ అలాంటి తప్పు చేయరు" రేవతితో చెప్పాక శారదమ్మ వైపు తిరిగి అడిగాడు. "ఏమంటారు ఆంటీ"

తనిక అలాంటి తప్పు చేయనన్నట్టుగా ఆవిడ తల అడ్డంగా ఆడించింది.

అతడు రేవతి దగ్గర సెలవు తీసుకుని ఆ ఇంట్లో నుండి బయటకు నడిచాడు.

రామ్మోహన్ ఇంటికొచ్చాడేగానీ మనసు మనసులో లేదు. ఏవేవో ఆలోచనలు అతడిని చుట్టుముడుతున్నాయి.

ఆ తల్లీ కూతుళ్లను తలచుకుంటే మనసంతా సంతృప్తితో నిండిపోతుంది. మనిషిలో స్వార్థం పెరిగిపోతూ తన సుఖం కోసం రక్తసంబంధాలు కూడా బలిపెడుతున్న ఈ కాలంలో అలాంటి అపురూపమైన ప్రేమాభిమానాలు చూడగలగడం చాలా అరుదయిన విషయం.

తల్లిదండ్రులను పెళ్లి చేసుకుని పెళ్లాం పిల్లలతో ఉన్న కొడుకులే సరిగా చూడని ప్రస్తుత పరిస్థితుల్లో ఓ పెళ్లిగాని ఆడపిల్ల

తన భవిష్యత్తు పూర్తిగా వదిలేసుకుని తల్లే లోకంగా బతకడం ఎంత గొప్ప విషయం.

అతడికి తన తల్లి, అమ్మమ్మలు గుర్తుకు వచ్చారు. తన అమ్మమ్మను తలచుకోగానే అతనికి మనసంతా అదోలా అయింది. ఇప్పుడు రేవతి తన తల్లి అమ్మమ్మను పట్టించుకోనట్టే పట్టించుకోకపోతే శారదమ్మ పరిస్థితి కూడా తన అమ్మమ్మ పరిస్థితిలాగే ఉండేదికదూ? ఆవిడ దిక్కులేనిదానిలా ఏ అనాథ ఆశ్రమంలోనో మంచాన్న కరుచుకుని ఉండిపోయి మానవత్వం లేని మానవసంబంధాలను తిట్టుకుంటూ అలాగే...

ఏదేమయినా రేవతి బాధ్యత కలిగిన బిడ్డ. మంచి మనసున్న ఆడపిల్ల.

అలా అనుకుంటూ ఉంటే అతడికి ఏవేవో ఆలోచనలు కలుగుతున్నాయి.

ఆ ఆలోచనలు క్రమంగా రూపుదిద్దుకోసాగాయి.

ఆలోచనలు ఓ నిర్ణయంగా మారగానే అతడి పెదాలపై చిరునవ్వు ఉదయించింది.

ఒక అపురూపమైన భావం మనసులో కదలాడడంతో మనసు పులకించింది.

ఆ ఉదయం హాస్పిటల్‌కి వెళ్లేముందు అతడు రాజమ్మతో చెప్పాడు. "రాజమ్మా! రేపటినుండి మన వంట, పడక అన్నీ ఫస్ట్ ఫ్లోర్‌లోకి మార్చేస్తున్నాం"

"అదేంటి బాబూ!" ఆవిడ ఆశ్చర్యంగా అడిగింది.

"ఈ క్రింది అంతస్తుని హాస్పిటల్‌గా మార్చేయబోతున్నాను రాజమ్మా"

రాజమ్మ అతడికేసి అదోలాచూసింది.

ఆవిడ చూపులలోని భావాలు చదివినట్టుగా అతడు అన్నాడు. "ఏమిటీ మనిషికి ఇంత హఠాత్తుగా డబ్బుమీద ఇంత ప్రేమ పుట్టుకొచ్చిందే అని ఆశ్చర్యపోతున్నావా? కేవలం డబ్బు సంపాదన కోసమే నేను ఈ హాస్పిటల్ ప్రారంభించి ఇంటిని హాస్పిటల్‌గా మార్చేస్తున్నానని అనుకోకు. వీలయినంత వరకూ ఉచిత వైద్యం చేయాలనే ఉద్దేశ్యంతో ఈ హాస్పిటల్ ప్రారంభించబోతున్నాను. ఎలా ఉంది నా ఆలోచన? "

"ఆలోచన బాగానే ఉందిగానీ" అంటూ నసగసాగింది రాజమ్మ.

"నీ అనుమానం ఏమిటో చెప్పు రాజమ్మా? " అడిగాడు అతడు.

ఆవిడ కొద్ది క్షణాలు తటపటాయించినా తర్వాత చెప్పింది. "ఈ ఇంటిని హాస్పిటల్‌గా మార్చేస్తే కష్టాలలో ఉన్నవాళ్లంతా ఈ ఇంట్లో చేరుతారు. అలాంటి వాళ్లకు మీరు సేవ చేస్తారుకాని ఇంట్లోనూ మిమ్మల్ని పీడించే జనం చేరిపోతే అప్పుడు మీరు ప్రశాంతంగా ఉండగలరా బాబూ"

"ప్రశాంతత అనేది మనసుకు సంబంధించింది. ఇక్కడ చేరే జనం నన్ను పీడించొచ్చు అని నీ అనుమానం. అదే నా దృక్కోణం నుంచి చూడు. ఆ జనం వాళ్లకు సేవ చేసుకునే అవకాశం నాకు కల్పిస్తున్నారని నేనంటాను. అలా మనం చేస్తున్న పని పట్ల అభిమానం పెంచుకుని సంతృప్తి పడితే ప్రశాంతత దానంతట అదే వచ్చేస్తుంది"

రాజమ్మకు అతడి మాటలు ఎంతవరకూ అర్థమయ్యాయోగానీ మరేం మాట్లాడలేదు. అయితే అతడు చెయ్యబోతున్న పని చాలా గొప్పదని మాత్రం అర్థమయింది.

ఒక మనిషి మీద పెంచుకున్న అభిమానం, ఆ మనిషి సుఖంగా ఉండాలనే కోరుకుంటుంది. అతడు వేసే ప్రతి అడుగు సరయినదేనయినా తప్పటడుగు పడుతుందేమోనని భయపడడం సహజం.

రామ్మోహన్ హాస్పిటల్‌కెళ్లిపోయాడు.

అక్కడ తనతో క్లోజ్‌గా మూవ్ అయ్యే ఇద్దరు ముగ్గురు డాక్టర్లకు తన మనసులోని మాట చెప్పాడు. అతడి మాట వినగానే వాళ్లు అతడికేసి పిచ్చివాడిని చూసినట్టుగా చూశారు. ఒక సీనియర్ డాక్టర్ అనేశాడు "రామ్మోహన్! నీకేమయినా పిచ్చెక్కిందా? "

"అలా ఎందుకనుకుంటున్నారు" అతడు

తాపీగా ఎదురు ప్రశ్న వేశాడు.

"డాక్టర్ ప్రొఫెషన్ అంటే ఈ రోజు అన్ని వ్యాపారాలలోకెల్లా లాభసాటి వ్యాపారం. అలాంటి లాభసాటి వ్యాపారాన్ని ఉచితసేవగా మారుస్తానంటే నిన్నేమనుకోవాలి"

అతడు చిన్నగా నవ్వి ఊరుకున్నాడు.

"ఎందుకు నవ్వుతున్నావ్? " అతడి నవ్వు చూసి ఆయన ప్రశ్నించాడు.

"మీరేమీ అనుకోనంటే నా మనసులోని మాట చెపుతాను"

"అనుకోను చెప్పు"

అతడు చెప్పాడు. "నేనెక్కడో చదివాను. ఈ ప్రపంచంలో ప్రతి ఒక్క మనిషి కనీసం ఒక్కరి దృష్టిలోనయినా మూర్ఖుడై ఉంటాడట. అలాగే ఇప్పుడు నా నిర్ణయం మీకు మూర్ఖత్వంగా అనిపించొచ్చు కాని మీరూ నా దృష్టితో ఆలోచించండి. నేను గమనించినంతవరకూ ఈ ప్రపంచంలో ఏ కొద్ది మందో తప్పించి అత్యధికంగా జనుల తపన డబ్బు సంపాదన. డబ్బు వెంటే వాళ్ల పరుగు. వాళ్ల గమ్యం కూడా డబ్బు... డబ్బు.. డబ్బు.. ఇక్కడ నేను డబ్బు సంపాదించడం తప్పని అనడం లేదు. కానీ ఆలోచించిచూస్తే డబ్బుకి మించి మనిషికి తృప్తినిచ్చే పదార్థం మరోటి లేదా? అంతకు మించిన ఆనందాన్ని కలిగించే మానసిక అనుబంధం మరేదీ లేదా? లేదనే అందరూ అనుకుంటారుగానీ ఆలోచించి చూస్తే అలాంటి గొప్ప అనుబంధాలు ఎన్నో వున్నాయి. కాని మనిషి వాటిని గుర్తించడానికి ఇష్టపడడు అంతే"

"అంటే నువ్వనేది? " ఆ డాక్టర్‌కి అతడు ఏం చెప్పదలచుకున్నాడో అర్థమయినట్టు లేదు.

"ప్రేమ, అభిమానం, ఆప్యాయత, బాధ్యత ఇవన్నీ మనిషికి నిజమైన తృప్తినిస్తాయి. అయితే మనిషి ఈ నిజమయిన తృప్తిని గుర్తించడు. ఆ తృప్తితో అతడు బతకాలనీ కోరుకోడు. మనిషికి సహజాల కన్నా అసహజాలే ఎక్కువ ఆకర్షణీయంగా కనిపిస్తాయి. ఒక వ్యక్తి యోగాసనాలతో నిద్ర, ఆహారపుటలవాట్లను కంట్రోల్ చేసుకోవచ్చు కాని మనిషి ఆ సహజసిద్ధమైన వరాన్ని సద్వినియోగం చేసుకోడు. అలా చేయడాన్ని వప్పుకోడు. సిగరెట్, మందు మత్తుల్లో తననుతాను మరచిపోయే ప్రయత్నం చేస్తాడు. పాడయిపోతున్న తన ఆరోగ్యం గురించి తగ్గిపోతున్న మానసిక శక్తి గురించి ఆలోచించలేని మనిషి ప్రేమ, అభిమానం, ఆప్యాయతలు ఇచ్చే అపురూపమైన తృప్తిని ఎలా గుర్తించగలడు? అయినా మీరన్నట్టు డబ్బు సంపాదన తృప్తినిచ్చేలా వుంటే ఒక గాంధీ, ఒక మధర్ థెరిసా డబ్బుకోసం ప్రయత్నించలేదుగదా! అయినా వాళ్లు తమ జీవితాన్ని చాలా తృప్తితో గడిపారు. నిజం చెప్పాలంటే జీవితంలో వాళ్లు పొందిన సంతృప్తిని మరెవరూ పొందలేరన్నది నిజం. మరి వాళ్లు సాధించుకున్న ఆ అపురూప ఆనందాన్ని, సంతృప్తిని మనం పొందాలనుకోవడంలో తప్పేం లేదుకదా? "

ఆ సీనియర్ డాక్టర్ రామ్మోహన్‌కేసి విభ్రమంగా చూశాడు. ఆ తర్వాత మరేం మాట్లాడాలో అతనికి అర్థం కాలేదు.

అతడి మాటలు విన్నాక మిగిలిన డాక్టర్లు కూడా మరేం మాట్లాడలేకపోయారు. ఎందుకంటే అప్పటివరకూ వాళ్లు అతడు అనాలోచితంగా ఏదో చేస్తున్నాడనే అనుకున్నారు.

రామ్మోహన్ తన నిర్ణయం గురించి అంత సాధికారంగా మాట్లాడేసరికి వాళ్లకు మరేం మాట్లాడాలో అర్థం కాలేదు. అతడు ఓ అనాలోచిత నిర్ణయం తీసుకుంటున్నాడనుకున్నారేగానీ ఆ నిర్ణయంపట్ల అతడి కమిట్‌మెంట్ అప్పుడే వాళ్లకు అర్థమయింది.

అయినా సరే ఒక మంచి పనిని ఎవ్వరూ అంత సులభంగా సమర్థించరు.




వాళ్లు ఇష్టాఇష్టంగానే "సరే నీ ఇష్టం" అన్నారు.

అతడూ వాళ్లకు తెలియపరచాలనే ఉద్దేశ్యంతోనే చెప్పాడు తప్ప వాళ్ల అభిప్రాయాన్ని పరిగణలోకి తీసుకోవాలనుకోలేదు. అతడు అప్పటికే ఒక నిర్ణయం తీసేసుకుని ఉన్నాడు.

తన నిర్ణయాన్ని ఆచరణలో చేసి చూపడం గురించే అతడిప్పుడు ఆలోచిస్తున్నాడు.



రేవతి సాయికృష్ణ పెళ్లికి వెళ్లింది.

ఆమె అక్కడికి వెళ్ళడానికి ఏమీ సంకోచించలేదు. ఎందుకంటే అతడు ఒకప్పుడు తనకు స్నేహితుడు. కష్టకాలంలో తన తల్లికి అండగా ఉన్నాడు. చివర్న చేసిన ఒక చిన్న తప్పు కారణంగా అంతకుముందు చేసిన సహాయాలన్నీ మరిచిపోవడం సబబు కాదనే అభిప్రాయం ఆమెను పెళ్లికి వెళ్లేలా చేసింది.

కల్యాణమండపంలో పీటలమీద కూర్చుని వున్న వధూవరులకేసి చూసింది. 'సాయికృష్ణ పెళ్లిబట్టలలో కొత్తకళతో కళకళలాడిపోతున్నాడు. అతడి పక్కనే వున్న వధువు చాలా అందంగా వుంది. నిజం చెప్పాలంటే ఆ అమ్మాయి తనకన్నా అందంగా వుంది. ఈడు జోడు సరిపోయింది. ఆమెకు ఈర్ష్య కలగలేదు. సంతృప్తిగా అనిపించింది. పోనీలే, సాయికృష్ణకు అందమైన భార్య దొరికింది. అందమైన భార్యతో సాయికృష్ణ జీవితం ఆనందంగా గడిచిపోవాలి' మనస్పూర్తిగా కోరుకుందామె.

అప్పుడే సాయికృష్ణ తలతిప్పి చుట్టూ చూస్తూవుంటే కనిపించిందామె. అతడు ఆమెమీదే చూపు నిలిపాడు. ఇద్దరి చూపులు కలుసుకున్నాయి.

కొద్దిసెకనులు అలా చూసుకున్నాక, పురోహితుడు ఏదో అడగడంతో అతడు తలతిప్పుకున్నాడు.

పెళ్లితంతు పూర్తయ్యేవరకూ అక్కడే నిలబడి, తర్వాత వధూవరుల దగ్గరకెళ్ళి తను తెచ్చిన ప్రజంటేషన్ సాయికృష్ణ చేతిలో పెట్టింది.

అతడు ఆమె ముఖంలోకి గిల్టీగా చూశాడు.

ఆమెమాత్రం ఎలాంటి ఫీలింగు లేకుండా చెప్పింది. "విష్ యూ హ్యాపీ మేరీడ్ లైఫ్ సాయి"

రేవతి ప్రజంటేషన్ అందించాక ఇక అక్కడ ఉండకుండా వెనుతిరిగింది. అక్కడ భోజనాల కార్యక్రమం జరుగుతోంది. అయినా ఆమెను భోంచేసి వెళ్లమని ఎవ్వరూ చెప్పలేదు.

ఆమె పెళ్లినుంచి తిన్నగా ఇంటికొచ్చేసరికి ఇంటిలో ఉత్తరం పడివుంది.

కల్పన నుంచి వచ్చిన ఆ ఉత్తరం చించి చదవసాగింది రేవతి.

చాలావరకూ విశేషాలు మామూలే. ఎలా ఉన్నావ్? అమ్మ ఎలా ఉంది? సాయికృష్ణ, రామ్మోహన్‌లు ఎలా వున్నారు? ఇవన్నీ రాశాక కల్పన ఓ సూచన చేసింది.

"రేవతీ! నువ్వింకా కుట్టుమిషన్‌మీదే ఆధారపడి బతుకుతున్నావనుకుంటాను. అయితే కుట్టుమిషన్‌ని నమ్ముకున్న నువ్వు

అక్కడే వుండవలసిన అవసరం ఏమైనా వుందా? ఒక వృత్తిని కొనసాగించడానికి అనువయిన ప్రదేశాలు ఎక్కడున్నా మనిషి అక్కడికి వెళ్ళడంలో తప్పులేదు. పుట్టిపెరిగిన గడ్డమీద, వారసత్వంగా అందిన ఇంటిమీదా కొంత మమకారం ఉండడం సహజం. అందుకే నేను నిన్నిప్పుడు మీ ఇంటిని శాశ్వతంగా వదిలివేయమని చెప్పడంలేదు. ఆ ఇల్లు అలాగే వుంచి, నువ్వు ఆంటీతో సహా హైదరాబాద్‌కి ఎందుకొచ్చేయకూడదూ? హైదరాబాద్ వచ్చేయడంవలన ఉపయోగం ఏమిటంటే ఆ ఊరికన్నా హైదరాబాద్‌లో కష్టపడేందుకు ఎక్కువ అవకాశాలున్నాయి. కష్టానికి తగిన ప్రతిఫలం దొరుకుతుంది. భవిష్యత్తులో అభివృద్ధి చెందేందుకు ఎన్నో మార్గాలూ వున్నాయి. అక్కడ మీ ఇల్లు అద్దెకు ఇచ్చెయ్యి. ఇక్కడ ఓ చిన్నగది అద్దెకు తీసుకో. కుట్టుమిషన్‌మీదే సంపాదించుకో. అయితే అక్కడికి ఇక్కడికి తేడా ఏమిటంటే ఇక్కడ సంపాదించుకున్నదాంట్లో కొంత మిగుల్చుకుంటే ఇంకో మిషను కొనుక్కుని పనివాళ్లను పెట్టుకుని ఎంతో డెవలప్ కావచ్చు ఆ అవకాశం మీ ఊళ్లో లేదనుకుంటాను. అంతేకాదు, స్థలం మార్పువల్ల ఆంటీ పరిస్థితి కొంత మెరుగుపడే అవకాశమూ ఉంది. ఇదంతా నా స్వార్థం కోసం చెపుతున్నానని అనుకోకు. నువ్వు లేకపోతే నాకిక్కడ ఏదో పోగొట్టుకున్నట్టుగా వున్న మాట నిజమే. నువ్వు ఇక్కడకు వచ్చేస్తే నేనూ మీ ఇంట్లో ఉండిపోవాలన్న ఆశ ఉన్నమాటా వాస్తవమే. కాని నేను నా వైపు నుంచి ఆలోచించి మాత్రమే ఈ మాటలు చెప్పడం లేధు. అన్నివైపులా ఆలోచించే చెపుతున్నాను. ఆలోచించు రేవతీ"

రేవతి ఆ ఉత్తరాన్ని పట్టుకుని చాలాసేపు అలాగే ఉండిపోయింది.

నిజమే! ఒకప్పుడయితే ఉద్యోగాన్ని నమ్ముకుని వెళ్ళాల్సివచ్చింది. కాని ఇప్పుడు తననుతాను నమ్ముకుని వెళ్ళాలి. వెళ్తే ఎన్నో అవకాశాలు, మరెంతో ఉజ్వల భవిష్యత్తు ఆచోట దొరకొచ్చు ఆలోచించగా కల్పన సలహా మంచిదేననిపించింది.

అయితే తను నిర్ణయం తీసుకోవడంకన్నా తల్లితో ఈ విషయం చర్చించడం సరయినదనిపించడంతో ఆరోజు ఆమె తల్లిపక్కన కూర్చుని ఆవిడకు చెప్పింది. "అమ్మా! మనం ఈ ఇల్లు వదిలి హైదరాబాద్ వెళ్ళిపోతే ఎలా ఉంటుంది? "

శారదమ్మ మొదట అయోమయంగా రేవతి ముఖంలోకి చూసింది.

ఆమె ముఖంలోని భావాల్ని గమనించాక రేవతి, 'తనకు కల్పన ఉత్తరం రాయడం, అందులోని సలహా, ఆ సలహా గురించి గత కొద్దిరోజులుగా తను ఆలోచించడం, తనకూ అదే మేలని అనిపించడం...' అంతా చెప్పుకొచ్చింది. చెప్పడం పూర్తయ్యాక ఆమె కొద్దిక్షణాలు ఆగి అంది. "అమ్మా! నా అభిప్రాయం చెప్పాను. ఇంటి పెద్దగా నిర్ణయం నీదే. నువ్వెలా చెపితే అలాగే చేస్తాను"

శారదమ్మ కొద్దిక్షణాలు మౌనంగా ఉంది.

"ఏమ్మా! నీకు హైదరాబాద్‌కి వెళ్ళడం ఇష్టంలేదా? "

ఆవిడ అర్థం కాకుండా ఏదో అంది. కాని ఆవిడ మాటకాని ఆ మాటలను రేవతి అర్థం చేసుకుంది. తల్లి తన నిర్ణయాన్ని మెచ్చుకుంది. హైదరాబాద్‌కి కుటుంబం తరలిపోవడానికి అంగీకరించింది.

రేవతికి చాలా సంతోషం కలిగింది. ఆరోజే ఆమె కల్పనకు ఉత్తరం రాసింది. తాము త్వరలో హైదరాబాద్ రాబోతున్నామనీ, ఎప్పుడొచ్చేది ముందుగా తెలియచేస్తాననీ అప్పటికి తమకో ఇల్లు చూసిపెట్టవలసి ఉంటుందనీ ఆ ఉత్తరంలో తెలియచేసింది.

ఇక ఆ ఊరు వదిలేయాలని నిర్ణయించుకున్నాక తనిప్పుడు ఏం చేయాలా అని ఆలోచించసాగింది. ఆ క్రమంలో ఎవరెవ

రికి చెప్పాలో గుర్తు చేసుకుంది.

ఆమెకు ముందుగా గుర్తుకొచ్చిన పేరు- రామ్మోహన్. 'తమకెంతో సహాయం చేసిన ఆ వ్యక్తికి తాము ఊరు విడిచి వెళ్తున్న విషయం చెప్పడం ఎంతయినా అవసరం' ఆమె మనసులోనే అనుకుంది.

మర్నాడు సాయంత్రం రేవతి రామ్మోహన్ ఇంటికి ఫోన్ చేసింది. తను అతడితో కాసేపు మాట్లాడాలనుకుంటున్నట్టు చెప్పింది.

అతడు చాలా సంతోషంగా వెంటనే రమ్మని లేదా తనే వాళ్ళింటికి రాగలనని అన్నాడు.

అది ఇంచుమించు వీడ్కోలు లాంటిది కాబట్టి 'తనే వస్తున్నట్టుగా' చెప్పిందామె.

మరో అర్థగంట తర్వాత రేవతి రామ్మోహన్ ఇంట్లో ఉంది.

అతడు ఆమెను సాదరంగా ఆహ్వానించాడు. రాజమ్మ ఆమెను పలకరించి వెళ్లి కాఫీ తెచ్చి అందించింది.

ఆమె కాసేపు కూర్చుని స్థిమితపడ్డాక అతడు అడిగాడు. "చెప్పండి! ఏమిటి నాతో మాట్లాడాలని అన్నారు? ఏ విషయం గురించి"

"మాట్లాడడమంటే మరేదో విషయం కాదు. మేము ఈ ఊరు విడిచి హైదరాబాద్‌కి వెళ్తున్నాం. ఆ విషయం మీకు చెప్పి వెళ్ళాలని వచ్చాను"

"వాట్? మీరు... మీరు ఈ ఊరు విడిచి వెళ్తున్నారా? "

"అవునండి"

"ఎందుకు? "

"కష్టపడి కడుపు నింపుకునే వాళ్ళకు ఏ ఊరయితేనేం అన్న ఉద్దేశం. పైగా ఇక్కడి కన్నా అక్కడయితే డెవలప్‌మెంట్‌కి ఎక్కువ అవకాశాలుంటాయన్న ఆశ. అంతే!"

అతడో కొద్దిక్షణాలు ఏమీ తోచనివాడులా మౌనంగా ఉండిపోయాడు. తర్వాత తేరుకుని అడిగాడు. "మీరు హైదరాబాద్‌కి ఎప్పుడు వెళ్లాలనుకుంటున్నారు? "

"మరో వారం పదిరోజులలో"

"తప్పదా? " అతడు ఆశగా అడిగాడు.

"నిర్ణయం జరిగిపోయింది"

చాలా సేపటి తర్వాత అతడో నిర్ణయానికి వచ్చిన వాడిలా చెప్పాడు. "అయితే నేను మరోవారం పదిరోజులలోపే మిమ్మల్ని కలుసుకుంటాను"

'ఎందుకు? ' అని ఆమె అడగలేదు తలాడించింది.

తను వెళ్ళినపని పూర్తయినట్టు ఆమె అక్కడినుండి లేచి వచ్చేసింది.

వారంరోజులు తర్వాత ఆ ఇంటిముందు కారాగింది.

రామ్మోహన్ కారుదిగి లోపలికి నడిచాడు.

ఆ సమయంలో రేవతి తల్లికి 'స్పీచ్ థెరపీ' నేర్పుతోంది "అ... అ... అమ్మ అను"

శాదరమ్మ నోరు తెరచి "అ... అ...అ..." అని మాత్రమే అనగలుగుతోంది.

"వెరీగుడ్! పేషెంట్‌పట్ల ఇలాంటి ఓపిక ప్రదర్శిస్తే, వాళ్లు చాలా త్వరగా కోలుకునే అవకాశం ఉంది"

రేవతి తలతిప్పి చూసింది. అతడిని చూసి నవ్వుతూ "రండి... రండి" అంది.

అతడు లోపలికి నడిచాడు. ఆమె చూపించిన కుర్చీలో కూర్చున్నాడు.

"చెప్పండి. ఏమిటి విశేషాలు? "

అతడు జవాబుగా నవ్వాడు.

"ఈ టైమ్‌లో వచ్చారు, హాస్పిటల్‌కి వెళ్ళలేదా? "

అతడు జవాబుగా నవ్వాడు.

"లేదు. ఈరోజు హాస్పిటల్‌కి వెళ్ళలేదు. ఈరోజే కాదు, ఇకముందు ఆ హాస్పిటల్‌కి వెళ్ళడంలేదు"

"ఎందుకని? "

"గవర్నమెంట్ డాక్టర్ పోస్ట్‌కి రిజైన్ చేశాను"

"రిజైన్ చేశారా? " రేవతి ఆశ్చర్యంగా చూసింది. "రిజైన్ చేసి...? !"

"ఏం చెయ్యబోతున్నానన్నది చెప్పను. మీరొస్తే చూపిస్తాను"

ఈసారి ఆమె అయోమయంగా చూసి, మెల్లగా "చూపిస్తారా? " అంది.

"అవును. మీకు చూపించాలనే నా కోరిక. రాగలరా? "

ఆమె అప్రయత్నంగానే తల్లి కేసి చూసింది. శారదమ్మ వెళ్ళిరమ్మన్నట్టుగా సైగచేసి చెప్పింది.

రేవతి లేస్తూ "పదండి" అంది.

వాళ్ళిద్దరూ ఇంట్లోంచి బయటకు నడిచారు.

అతడు డ్రైవింగ్ సీట్లో కూర్చుంటే, ఆమె కారు బ్యాక్‌డోర్ తెరుచుకుని కూర్చుంది.

కారు ముందుకు కదిలింది.

పదినిముషాల తర్వాత అతడు తన ఇంటిముందు కారాపాడు.

కారు దిగాక అతడు లోపలికెళ్ళే ప్రయత్నం చేయలేదు. అతడు అక్కడే నిలబడి తలెత్తి ఒకచోట దృష్టిని కేంద్రీకరించాడు. అటు చూస్తున్నప్పుడు అతడి కళ్లల్లో మెరుపు కదలాడసాగింది.

పెదవులు నెమ్మదిగా కదిలాయి. "రేవతీ! నేను ఒకప్పుడు మీ అమ్మగారిని ఈ ఇంటికి తీసుకుని రమ్మంటే 'ఇది ఇల్లు. ఈ ఇంటిని హాస్పిటల్‌లా భావించమంటారా? ఈ ఇంట్లో మా అమ్మ ఒక్కతే పేషెంట్‌గా ఉండి, ఆమెకు సేవలు చేస్తూ నేను ఇక్కడ ఉండడం నాకిష్టంలేదు. మా అమ్మ మీ ఇంట్లో ఉంటే మీ ప్రశాంతత ఎగిరిపోతుంది. నేనిక్కడ ఉండడమూ భావ్యం కాదు అన్నావ్. కాని ఇప్పుడు నేను నా ఇంటిని ఏంచేశానో చూడు! మరి ఇప్పుడు మీ అమ్మగారిని ఈ ఇంట్లో ఉంచడానికి, నువ్విక్కడ ఉండడానికి ఇబ్బందేం లేదు కదా? "

అప్పటికీ ఆమె తేరుకోలేదు. ఆమెకు ఎదురుగా ఆ బిల్డింగ్‌మీద కనిపిస్తుందో బోర్డు.

"వివేకానందా ప్రజావైద్యశాల"

ఆమె ఇంకా అటే చూస్తోంది. పక్కనుండి అతడి మాటలు వినిపించసాగాయి.

"వివేకానందుడు అంటే నాకెంతో ఇష్టం రేవతీ! ఆయన ఆత్మవిశ్వాసం, ప్రజలను సన్మార్గంలో పయనింపచేయాలనే ఆయన తపన, ప్రజలను ఆయన ఉత్తేజపరిచిన తీరు నేనెంతో అభిమానిస్తాను. అందుకే ఈ ప్రజా క్లినిక్‌కి ఆయన పేరే పెట్టాను. ప్రజలకు ఉచిత వైద్యసౌకర్యం ఇవ్వాలని అనుకున్నాను. అందుకోసమే నా ఇంటిలో కింద పోర్షన్‌ని పాతిక పడకలతో నింపాను. నా ఉద్యోగానికి నాజీనామా చేశాను. కూర్చుని తిన్నా తరగనంత ఆస్తి ఉంది. ఆ ఆస్తిని సద్వినియోగం చేయాలంటే ఇదే సరయిన మార్గంగా నాకు తోచింది. కాని ఒక్కటి మాత్రం నిజం రేవతీ! నా ఈ ఆలోచనకు ఇన్‌స్పిరేషన్ నువ్వే..." చివరివాక్యం మాత్రం చాలా చిన్నగానయినా స్పష్టంగా చెప్పాడు అతడు.

ఆమె మాటలురాని మూగదానిలా ఉండిపోయింది.

అంతలో అతడు అన్నాడు "ఇప్పుడు చెప్పు రేవతీ! మీ అమ్మగారిని ఈ ఇంటికి తీసుకువస్తే నా ప్రశాంతతకు భంగం వాటిల్లదు కదా? ఏమంటావ్? "

"నేను తీసుకురాలేను. నన్ను క్షమించండి డాక్టర్"

"ఎందుకని? " అతడు ఉలిక్కిపడి తల తిప్పి ఆమెకేసి చూశాడు.

"మీది ఉచితవైద్యశాల. నేటినుండి ఈ ఆసుపత్రికి ఎందరో నిర్భాగ్యులు, నిరాశ్రయులు వచ్చి మీ సేవలు పొందుతారు. డబ్బులేక రోగాలనుండి బయటపడలేని బాధితులు వయోభారం మీదపడినవేళ




దిక్కులేని వాళ్ళయిపోయిన శాపగ్రస్తులు, అనాథలు, అభాగ్యులు ఎందరో మీ దగ్గరకే చేరుతారు. వాళ్ళను ప్రేమగా పలకరించి, మంచి మనసుతో ఆదరించగలరు మీరు. అంతటి విశాల హృదయులు మీరు. ఇక మీరన్నారు- మీకు ఇన్‌స్పిరేషన్ నేనేనని. ఇన్‌స్పిరేషన్ ఎవరయినా కావచ్చుగాని, ఒక మంచిపని చేయడానికి నిర్ణయం తీసుకుని ముందడుగు వేయడం చాలా గొప్ప విషయం. అందుకు మిమ్మల్ని అభినందించితీరాలి. ఈ విషయంలో నేను మిమ్మల్ని అభినందించగలనేగానీ మా అమ్మను మాత్రం ఇక్కడికి తీసుకురాలేను. ఎందుకంటే మా అమ్మ అనాథ కాదు. అభాగ్యురాలు కాదు. శాపగ్రస్త అంతకన్నా కాదు. ఆమెకు నేను ఉన్నాను. నా తల్లికోసమే నా జీవితం అని నేననుకుంటున్నాను"

తన ఊహ తప్పయిందని నిరుత్సాహం కమ్మిన ఆ క్షణాలలో కూడా అతడు ఆమెను మనసులో అభినందించకుండా ఉండలేకపోయాడు.

చాలా సేపటి తర్వాత మాత్రం అడిగాడు. "పోనీ ఇదయినా చెప్పు. నేను ఒక మంచిపని చేయబోతున్నాను. ఈ కార్యంలో నాకు నీ సహాయం కావాలి"

"ఏవిధంగా? "

కన్నవాళ్ళకే సేవ చేయడానికి విముఖత చూపించే మనుషులున్న లోకం ఇది. అలాంటప్పుడు జీతం ఇచ్చినా, జనానికి ఒక తల్లిలా సేవచేసే మనుషులు అరుదుగా ఉంటారు. అయితే నీలో నేను అలాంటి మానవత్వాన్ని దర్శించాను. నేను జనానికి చేసే సేవలో నువ్వు పాలుపంచుకోవాలి"

"నాకు ఇష్టమేకాని..." ఆమె ఆగింది.

"అనుమానం ఏమిటో చెప్పండి"

"అనుమానం కాదు. అభిమానం. నా తల్లిని ఇంట్లో వదిలి రాలేని అభిమానం"

"అందుకేగా నేను చెప్పింది మీ అమ్మగారిని కూడా ఈ ఇంటికి తీసుకురండి"

ఆమెను ఇక్కడికి తీసుకురాలేననీ అందుకు కారణాలు కూడా వివరించి చెప్పాను"

"అయితే ఇదే మీ నిర్ణయమా? "

"అవును"

ఆమెకు ఇక అక్కడ నిలబడాలనిపించ లేదు. వెనుతిరిగి వీధి వెంబడి ముందుకు నడవసాగింది.

కదిలి ముందుకుపోతున్న ఆమె కనిపించేంతవరకూ అతడు అటే చూస్తుండిపోయాడు. ఆమె వీధిమలుపు తిరిగాక కొద్దిక్షణాలు కళ్లు మూసుకుని అలాగే ఉండిపోయి, కళ్లు తెరిచాక ఇంట్లోకి నడిచాడు.

రేవతి మాట్లాడే ప్రతి మాటా, ప్రతి నిర్ణయం ఆమెమీద తనకున్న అభిమానం రెట్టింపయ్యేలా చేస్తున్నాయి. మరేదో భావం మనసును కదిలిస్తోంది. కాని... కాని.

అతడు గాఢంగా నిశ్వసించి లోపలికి నడిచాడు.

హాలులోకెళ్లి సోఫాలో అలసటగా కూర్చున్నాడు.

"డాక్టర్ బాబూ!"

అతడు తలెత్తి చూస్తే ఎదురుగా రాజమ్మ కనిపించింది.

"ఏంటి రాజమ్మా? "

"ఇది ఇప్పుడు ఇల్లు కాదు బాబూ. మీరిప్పుడు రెస్ట్ తీసుకోవాలంటే ఫస్ట్ ఫ్లోర్‌లో కెళ్ళాలి" ఆమె నవ్వుతూ అంది.

అతడు తలాడించి చుట్టూ పరిశీలించి చూశాడు. ఆ హాలులో పన్నెండు బెడ్‌లు ఉన్నాయి. తను అంతవరకూ వాడుకుంటూ ఉండిన బెడ్‌రూమ్, డ్రాయింగ్ రూమ్ చివరికి కిచెన్ కూడా బెడ్‌లతో నిండిపోయాయి. బయట బోర్డు వెలిసింది. పబ్లిసిటీలు, ప్రారంభోత్సవంలాంటి తతంగాలేవీ లేవు. ఇకనుండి ఎవరైనా ఎప్పుడైనా ఆ హాస్పిటల్‌కి రావొచ్చు. అక్కడ ప్రతీదీ ఉచి

తమే.

అయితే ఇలాంటి కార్యంలో సహకరించేం దుకు ఒకతోడు అవసరమనిపిస్తోంది. ఆ తోడు రేవతి అయితే బాగుంటుందని మనసు కోరుకుంటోంది.

రామ్మోహన్ లేచి ముందుకు నడవ బోతూ ఆగి అన్నాడు.

"కాస్త కాఫీ తయారు చేయగలవా రాజమ్మా"

"అలాగే బాబూ" రాజమ్మ తలాడిం చింది.

అతడు మెట్లెక్కి మేడమీద కెళ్ళాడు. అక్కడ కొత్తగా తయారుచేసుకున్న బెడ్‌రూ మ్‌లోకెళ్ళి బెడ్‌మీద అడ్డంగా వాలిపో యాడు. కళ్ళు మూసుకుంటే కనురెప్పల పరదాల చాటున రేవతి ప్రత్యక్షమయింది. అతడిలో మధురమైన బాధ మొదల యింది.

రామ్మోహన్ అనుకున్నాడు? "అయినా నేనింత మథనపడాల్సిన అవసరమేమిటి? అసలు తన సమస్య ఏమిటి? " ప్రశ్నల పరంపర మొదలయింది.

రేవతి వ్యక్తిత్వం తనకు నచ్చింది. పెళ్లి అంటే ఇంట్రస్ట్ లేని తనకు ఇప్పుడిప్పుడే పెళ్ళిమీద ధ్యాస మళ్లుతోంది. అందుకు కారణం రేవతే! రేవతి వ్యక్తిత్వం తనకు బాగా నచ్చింది. అలాంటి మంచి మనసు, వ్యక్తిత్వం ఉన్న అమ్మాయి తోడు దొరికితే బాగుణ్ణని మనసు కోరుకుంటోంది. మరి మనసు అలా ఆశపడితే ఆ మనసులోని మాట ఆమెకు సూటిగా చెప్పేయొచ్చుకదా? ఇలా డొంకతిరుగుడు వ్యవహారాలెందుకు?

అలా అనుకుంటూ వుండగానే అతడికి ఆ క్షణం సంక్రాంతిరోజున రేవతి నోట తను విన్నమాటలు గుర్తుకొచ్చాయి. "జనమంతా నాకు దూరం కావచ్చు నా భవిష్యత్ శూన్యంగా మారిపోవచ్చు అయినా సరే నేను అమ్మను వదల్లేను. నా బాధ్యతను నేను వదిలించుకుని, సుఖాల ఎండమావుల వెంట పరుగెత్తలేను"

అప్పుడే తనకి రేవతి తన తల్లిని ఎంతగా ప్రేమిస్తుందో అర్థమయింది. అందుకే ఆ తల్లికి ముందుగా ఆశ్రయం కలిపించాలనే ఉద్దేశ్యంతో ఈ హాస్పిటల్‌ని సృష్టించాడు. ఆ తర్వాత రేవతి బాధ్యతలను తన బాధ్య తగా మలచుకోవాలనే అనుకున్నాడు.

అయితే ఒక్కటి మాత్రం నిజం ఈ హాస్పిటల్ కేవలం శారదమ్మను ఈ ఇంటికి తీసుకు రావడానికి మాత్రమే సృష్టించలేదు. చాలా రోజులుగా తన మనసులో ఏదో తెలియని అసంతృప్తి పేరుకుపోతూ వస్తోంది. డబ్బుకి మించిన విలువయినది ఈ సృష్టిలో మరేదీ లేదా అన్న ప్రశ్న మన సును తొలిచేస్తూ వుంది. మనిషికి సంతృ ప్తితో కూడిన ప్రశాంతత ఎక్కడ దొరుకు తుంది? ఎలా దొరుకుతుంది?

ఆ ప్రశ్నలకు జవాబులు కూడా రేవతిని చూశాకే దొరికాయి. రేవతి తల్లికి చేసే సేవలో పొందుతున్న అనంతమైన ఆనం దాన్ని చూశాక తనకు ప్రశాంతత ఎక్కడ దొరుకుతుందో తెలిసింది. ఒక మనిషి నిస్వార్థంగా సాటి మనిషికి సహాయం చేయడంలో పొందే తృప్తికి సాటి రాగలది ఈ సృష్టిలో మరోటి లేదు. అంతకుమించిన ప్రశాంతత కూడా మరేదీ లేదు. గాంధీ, మదర్‌థెరిసా, లాల్‌బహదూర్‌శాస్త్రిలాంటి గొప్పవాళ్ల ముఖాలను పరిశీలించి చూస్తే వాళ్ల ముఖాలలో ఒక విధమయిన ప్రశాం తత కనిపిస్తూ వుంటుంది. ఆ ప్రశాంతత మరేదో కాదు సాటి మనుష్యులపట్ల వాళ్లు కనపరచే ప్రేమాభిమానాలకు ప్రతిరూపమే.

అంతటి అపురూపమైన తృప్తిని తను మాత్రం ఎందుకు పొందకూడదు?

ఏదేమయినా తనలోని అసంతృప్తిని పోగొట్టడానికి మార్గం చూపించి సంతృప్తి శిఖరాన్ని చేరుకునేలా ఉత్తేజపరిచిన స్త్రీ రేవతి.

అయితే ఆ భావన మెల్లమెల్లగా ఆమెపట్ల




అభిమానంగా మారింది. ఆ అభిమానం ప్రేమగా రూపాంతరం చెందిందేమో. రేవతి తన జీవితంలో ప్రవేశిస్తే బాగుణ్ణని మనసు కోరుకుంటోంది కాని...

తన సమస్యల్లా ఒక్కటే ఆమెకు తన మనసులోని మాట సూటిగా చెప్పలేకపోవడం.

ఒకవేళ ధైర్యం తెచ్చుకుని ఆమెకు చెప్పినా ఆమె నో అనేస్తుందని ఆ రోజే అర్ధమయిపోయింది. అందుకు ఆమెకున్న బాధ్యత తల్లి! ఆ బాధ్యత ఆమెకు తప్పించాలనే తన ప్రయత్నం అందులో హాస్పిటల్ కూడా ఓ భాగం.

"బాబూ! కాఫీ"

అతడు ఆలోచనలు ఆపి తలెత్తి చూస్తే కాఫీ కప్పుతో రాజమ్మ చాలా దగ్గరగా నిలబడి వుంది.

కాఫీ కప్పు అందించాక అక్కడినుండి వెళ్ళిపోలేదు.

ఆమె అక్కడే నిలబడి ఉండడం చూసి అతడు ప్రశ్నార్థకంగా చూశాడు.

"రేవతమ్మ ఇంటి వాకిలి వరకూ వచ్చి అటు నుండి అటే వెళ్ళిపోయిందేం బాబూ! లోపలికి రాలేదేం"

అతడికి ఆ క్షణం మనసులో అనీజీనెస్ కదలాడుతోంది. మనసులోని ఆ బాధ బయట పెట్టుకోవాలనే అనిపిస్తోంది. అందువల్లే అతడు చాలా మామూలుగా అన్నాడు "తనకి ఈ ఇంటికొచ్చే ఉద్దేశ్యం లేదు రాజమ్మా"

"తను ఈ రోజు కొత్తగా ఇంటికి రావడం లేదు కదా బాబూ! అప్పుడప్పుడూ వస్తూనే ఉందికదా?" ఆవిడ ఆశ్చర్యంగా అడిగింది.

"కానీ నేను తనను శాశ్వతంగా ఈ ఇంటికి రమ్మంటున్నాను"

ఆవిడ కనుబొమలు ముడివేసింది. "శాశ్వతంగా అంటే?" అర్థోక్తిగా ఆగింది.

"అదే రాజమ్మా తనను తన తల్లితో సహా వచ్చి ఇక్కడే ఉండమన్నాను"

"పెళ్ళికాని ఆడపిల్ల మరో మగాడి ఇంటికొచ్చి ఎలా ఉండగలదు బాబూ"

రాజమ్మ ఆ మాట ఆలోచించి అన్నదో అనాలోచితంగా అన్నదో తెలియదు. ఒక్కోసారి మనిషి ఎన్నో రకాలుగా ఆలోచిస్తాడు. కాని ఎంత ఆలోచించినా సరయిన కోణంలో ఆలోచించలేకపోతాడు. ముఖ్యంగా మనసుకు సంబంధించిన విషయాలలో ఇలాంటి పరిస్థితి సర్వసామాన్యం. అందుకే కాబోలు చాలామంది ఇతరుల సలహా అడిగి తీసుకుంటారు.

"అంటే... అంటే నేను తప్పుగా మాట్లాడానా రాజమ్మా?"

"మీరు తప్పుగా మాట్లాడారని అనుకోలేదుకదా? కాని అవతలివాళ్లు అర్థం చేసుకోలేకపోతే అది తప్పుగానే తోస్తుంది"

"కాని నేను ఒప్పుగా మాట్లాడినా తనిక ఈ ఇంటికి రాలేదుకదా రాజమ్మా?"

"అలా ఎందుకని అనుకుంటున్నారు బాబూ?"

"తనకి ఓ బాధ్యత ఉంది. ఆ బాధ్యత నుండి ఆమె తప్పించుకోలేదు"

"పోనీ ఆ బాధ్యత మీరే తీసుకోండి"

"అదెలా సాధ్యం?"

"మనసుంటే మార్గాలు ఉండకపోవు"

ఎక్కడో... ఎక్కడో విన్నాడు ఇదే మాట. ఎక్కడబ్బా? కొద్దిక్షణాలలోనే గుర్తుకొచ్చింది. కరెక్టే సాయికృష్ణ రేవతిని తల్లిని వదిలించుకోమని సలహాఇచ్చేప్పుడు ఇదే మాట ఉపయోగించాడని ఆమె తనతో చెప్పింది. ఇప్పుడు అదేమాట, ఓ ఆడపిల్లకు మేలు చేయమనే ఉద్దేశ్యంతో రాజమ్మ తనకు చెపుతోంది.

నిజానికి ఆవిడ పెద్దగా చదువుకోలేదు. తనకో క్లూ వదిలి మరీ వెళ్లింది.

రేవతి బాధ్యతను తన బాధ్యతగా మలచుకోవాలంటే తనేం చెయ్యాలి?

అతడు తీవ్రంగా ఆలోచించాడు. ఓ కొత్త

కోణంలో యోచించాడు.

ఏదో తోచింది.

అతడు తలెత్తి చూశాడు. ఎదురుగా రాజమ్మ కనిపించలేదు.

ఆమెను వెతుక్కుంటూ కిందకు వెళ్తే తను హాలు చిమ్ముతూ కనిపించింది.

అతడు ఆమెకు చాలా దగ్గరగా వెళ్లి నిలబడి చెప్పాడు "చాలా థాంక్స్ రాజమ్మా"

ఆవిడ తలతిప్పి అతడికేసి చూసి నవ్వుతూ అడిగింది. "ఎందుకు బాబూ"

"చాలా రోజులుగా నాకు పరిష్కారం దొరకకుండా ఉన్న ఓ సమస్యకు పరిష్కార మార్గం చెప్పినందుకు"

రామ్మోహన్ ఇక అక్కడ ఆగలేదు. వేగంగా బయటకు నడిచాడు.

మరు నిముషమే ఆ ఇంటి పోర్టికోలో ఆగి ఉన్న కారు చిన్న శబ్దంతో ముందుకు దూసుకుపోయింది.

★ ★ ★

"ఆంటీ! ఇలా అడగడం సాంప్రదాయం కానప్పటికీ నాకు అడగక తప్పడంలేదు. ఎందుకంటే నా తరపున మీతో మాట్లాడేందుకు వేరెవ్వరూ లేరు. అందుకే మీతో మాట్లాడేందుకు నేనే వచ్చాను"

తన పక్కనే స్టూల్ మీద కూర్చుని ఉన్న రామ్మోహన్‌కేసి శారదమ్మ కళ్లు చికిలించి చిత్రంగా చూస్తోంది. అతడు తనతో ఏం మాట్లాడబోతున్నాడో అర్థం కావడంలేదు.

రేవతి పెరటివైపు తలుపు దగ్గర నిలబడి అతడి మాటలు వింటోంది. ఆమెకూడా రామ్మోహన్ ఏం చెప్పబోతున్నాడో ఊహించలేకుండా ఉంది.

"ఇంతకీ నేను ఇక్కడికి వచ్చిన విషయం ఏమిటంటే నాకు మీ అమ్మాయి రేవతి నచ్చింది. అదీ మీరు అనుమతిస్తే"

శారదమ్మ అతడు చెప్పేది అర్థం కావడం

తోనే ముఖంలో మెరుపులాంటి కాంతి మెరిసింది. ఆ కాంతి అలాగే ఆమె ముఖంలో స్థిరపడిపోయింది. ఆవిడ తల తిప్పి కూతురి ముఖంలోకి చూసింది. ఎంత గొప్ప అదృష్టమే నీది అన్న భావం ఆవిడ చూపుల్లో కదలాడసాగింది.

ఆవిడ చప్పున తన చెయ్యి కదిలించి అతడి చేతిని పట్టుకుంది. ఆ స్పర్శలోనే ఆవిడ ఎంతగా కదిలి పోతోందో అతడికి అర్థమయింది.

"అయితే నేను మీ అమ్మాయిని పెళ్లి చేసుకోవడానికి మీరు అంగీకరిస్తున్నారన్న మాట" ఆవిడతో అన్నాడు అతడు.

ఆమె నిలువుగా తలాడించింది.

అప్పటివరకూ ప్రేక్షకురాలిలా నిలబడినట్టుగా ఉన్న రేవతికి అక్కడేం జరుగుతోందో అప్పుడే తెలిసి వచ్చినట్టుంది. ఆమె అక్కడనుండి కదలకుండానే కాస్త సీరియస్‌గా చూస్తూ పలికింది. "ఏమిటమ్మా ఏమిటా హామీలు. వెనకా ముందు ఆలోచించక్కర్లేదా?" అప్పుడే అతడు తల తిప్పి రేవతి మీద చూపు నిలిపాడు. స్టూల్ మీద నుండి లేచి ఆమె దగ్గరగా వచ్చాడు. "వెనకా ముందూ ఆలోచించుకోవడానికే ముందో చెప్పండి. మీరు పెళ్లికాని అమ్మాయి. నేను పెళ్లికావలసిన కుర్రాడిని. నేను మిమ్మల్ని పెళ్లి చేసుకోవాలని అనుకోవడం తప్పుకాదు. అందుకు ఆంటీ పర్మిషన్ కూడా ఇచ్చింది"

అతడి గొంతులో చిలిపితనం కదలాడుతోందా? లేక సీరియస్‌గానే అంటున్నాడో అర్థం కాకపోయినా ఆమె మాత్రం సీరియస్‌గానే అంది. "నేను పెళ్లికాని అమ్మాయినే. కాని నాకు కొన్ని బాధ్యతలున్నాయి. ఆ బాధ్యతలు నుండి తప్పుకోవడం నాకు చేతకాదు"

"తప్పుకోమని ఎవరన్నారు? మీ బాధ్య

తను మీరు నిర్వర్తించండి"

ఆమె అతడి ముఖంలోకి అర్థం కానట్టుగా చూసింది. అతడు నవ్వుతూ చెప్పాడు. "ఒక అమ్మాయిని భార్యగా స్వీకరించినప్పుడు ఆమె బాధ్యతలను కూడా అతడు స్వీకరించాలి. అలా స్వీకరించలేనప్పుడు కనీసం ఆమె బాధ్యతలను ఆమెను నిర్వర్తించుకునేలా చేయగలగాలి. నేను మాత్రం నీ బాధ్యతను నా బాధ్యతగా స్వీకరించదలచుకున్నాను"

"కాని నాకున్నది మామూలు బాధ్యత కాదు"

"తెలుసు" అతడు చాలా క్లుప్తంగా జవాబిచ్చాడు.

ఏమిటితడు మాట్లాడేది? అంతా తెలుసు. అయినా ఇలా మాట్లాడడమేమిటి? కొంపదీసి ఈ రోజు ఏప్రిల్ ఫస్ట్ కాదుకదా? ఇతడు తనతో జోక్ చేయడం లేదు కదా? రేవతి అతడి ముఖంలోకి తదేకంగా చూసింది.

ఆమె చూపు గమనించినట్టు అతడు చెప్పాడు. "చూడు రేవతీ! నీ గురించి నాకు అంతా తెలుసు. నీ కష్టాలు, కన్నీళ్లు, నీకున్న బాధ్యతలు అన్నీ నాకు తెలుసు. ఒక ఇల్లాలికి ఉండవలసిన ముఖ్యమైన లక్షణం ఏమిటో తెలుసా? వ్యక్తిత్వం. ఆ వ్యక్తిలోనే అర్థం చేసుకునే గుణం, ఓర్పు, ప్రేమాభిమానాల ప్రదర్శన ఇవన్నీ వస్తాయి. నువ్వు గొప్ప వ్యక్తిత్వం వున్న ఆడపిల్లవు రేవతీ"

రేవతి కనుబొమలు ముడివడ్డాయి. అప్పటికి ఆమెకు అతడు తనతో జోక్ చేయడం లేదని చాలా సీరియస్‌గా మాట్లాడుతున్నాడని అర్థమయింది.

అతడు ఆమె మీద నుంచి చూపుమరల్చి శారదమ్మ మీద చూపు నిలిపి చెప్పాడు. "బాధ్యత గలిగిన కొడుకు ఒక మంచి భర్త కాగలడు అని అంటారు పెద్దలు. నాకు తెలిసినంతలో తల్లితండ్రుల మీద ప్రేమాభిమానాలు కలిగిన కూతురు ఒక మంచి ఇల్లాలు కాగలదు. ఎందుకంటే ఆమెకు ప్రేమాభిమానాలంటే ఏమిటో తెలుసు. బాధ్యతలు గుర్తించడమూ ఆమెకు తెలుసు. నీలో ఆ కూతురు లక్షణాలే నన్ను ఆకర్షించాయి. తల్లిపట్ల నువ్వు చూపిస్తున్న ఆ బాధ్యత నన్ను ఉత్తేజితుడిని చేసింది. తల్లి దండ్రులంటే మనలను పెంచి పోషించడానికి, వాళ్ల సంపదను వారసత్వంగా అందించడానికి మాత్రమే పనికొచ్చే మనుష్యుల్లా భావించుకుంటున్న నేటితరం యువతకు నీలాంటి వాళ్లు ఆదర్శం రేవతీ. ఎవరికెవరు ఈ లోకంలో అనుకుంటూ అనుబంధాల మీదా ఆప్యాయతలమీదా అపనమ్మకం పెంచుకుంటున్న ఈ తరుణంలో ఆ బంధాలకోసం జీవితాన్ని త్యాగం చేయడానికి కూడా వెనుకాడని నీ మనస్తత్వం మంచి మనసు చూసి కొంత సేదతీరుతారు. వాళ్లకు మానవ సంబంధాలమీద కొట్టుకుపోతున్న ఆశ తిరిగి జీవం పోసుకుంటుంది. అందుకే నేటి యువతకు ఆదర్శంగా నిన్నటితరం ఆశలకు ఆధారంగా నిలచిన నిన్ను నా ఇల్లాలిని చేసుకోవాలని మనస్ఫూర్తిగా కోరుకుంటున్నాను. నా ఇంట నువ్వు అడుగుపెడితే కనీసం ఒక తరం వరకయినా తల్లీబిడ్డల మధ్య ఉన్న బంధం ఎలా ఉండాలో చెప్పుకునేందుకు ప్రతీకగా నిన్ను చూపించేందుకు వీలుంటుంది. అది నా ఆశ. ఇక పోతే నీ బాధ్యత నాకు తెలుసు. మీ అమ్మగారు నేను నిన్ను పెళ్లి చేసుకోవాలని నిర్ణయం తీసుకోగానే ఆ విషయంలో కూడా ఒక నిర్ణయానికి వచ్చేశాను. నాకాబోయే భార్య తన తల్లికి తల్లి. తల్లి వెంట బిడ్డ ఉండడం సహజం. ఈ తల్లి వెంట ఆ బిడ్డ కూడా నా ఇంటికి రావడానికి నేనెంతో సంతోషంతో ఒప్పుకుంటున్నాను. నీ బిడ్డతో సహా నా ఇంట్లోకి అడుగుపెట్టు రేవతీ"




ఆమె గత కొద్దికాలంగా ఎన్నో ఒడిదుడుకులు ఎదుర్కొంది. కాని అప్పుడు ఆమె తనసుతాను కంట్రోల్ చేసుకుంటూ వుండేది. కాని ఇప్పుడు అతడి మాటలు ఆమెను ఎంతగా కదిలించాయంటే ఒక్క అంగలో అతడిని చేరుకుని అతడి ఛాతీమీద తలదాచుకుని ఏడవాలనిపించింది. కాని ఆ పని చేయలేకపోయింది. ఆ సమయంలో కన్నీళ్లను మాత్రం ఆపుకోలేకపోయింది. ఆపుకునే ప్రయత్నం కూడా చేయలేదు.

రేవతి ముఖంలోని భావాలు గుర్తించిన అతడు అన్నాడు. "ఇప్పుడు చెప్పు రేవతీ! నా ఇంటికి ఇల్లాలిగా రావడం నీకిష్టమేనా? "

ఆమె తన సిగ్గును దాచుకునే ప్రయత్నం చేయలేదు. ఆమె ముఖంలో కదలాడుతున్న సిగ్గు అతడికి జవాబు చెప్పకనే చెప్పింది.



రేవతికి ఓ డాక్టర్‌తో పెళ్లి నిశ్చయమైందని తెలియగానే ఆ వీధిలోని వారంతా ఆశ్చర్యపడ్డారు. ఎవరో ఒకరిద్దరు అసూయపడి ఉండొచ్చేమోగానీ ఎక్కువమంది మన స్ఫూర్తిగా సంతోషించారు. పోనీలే కనుచూపుమేరలో భవిష్యత్తు లేదనుకున్న ఆ అమ్మాయికి ఎంతో త్వరగా ఓ అండ దొరికింది. ఏదేమయినా ఆమె అదృష్టవంతురాలు అనుకున్నారు వాళ్లు.

రేవతి ఆనందానికి అవధులు లేవు. తను కలలో కూడా ఇంతటి అదృష్టాన్ని వూహించలేదు. అమ్మతోటే జీవితం, అమ్మకోసమే జీవితం అనుకుందేగానీ అమ్మతోపాటే ఇంతటి అపురూపమైన ఆనందాన్ని తన చుట్టూ సృష్టించుకోగలదని ఏనాడూ అనుకోలేదు. ఊహించనివి జరగడమే జీవితం.

పెళ్లి చాలా సింపుల్‌గా జరిగిపోవాలనే నిర్ణయం జరిగింది. ఇరువైపులా కలిసి ఓ యాభైమంది బంధుమిత్రులను మించి పిలవకూడదని అనుకున్నారు.

రేవతికి రామ్మోహన్ వైపు ఎవరొస్తున్నారో తెలియదుగానీ తనవైపు ఎవరున్నారా అని ఆలోచించింది. ఒకరిద్దరు ఇరుగుపొరుగుతోపాటు కల్పన, సాయికృష్ణలు గుర్తుకొచ్చారు.

ఆమె ముందుగా కల్పనకు ఉత్తరం రాయసాగింది.

"కల్పనా!

నీకో ఆనందకరమైన విషయం. ఈ ఉత్తరంతో పాటు అందే వెడ్డింగ్ కార్డు చూడగానే నీకు విషయం అర్థమయిపోయి వుంటుంది. నీ మనసులోని ఆలోచన నిజం కాబోతోంది.

అప్పుడప్పుడు కలలు కూడా నిజాలవుతూ వుంటాయని నాకిప్పుడే తెలిసింది. అయితే మరోవైపు ఇది కలా నిజమా అన్న అనుమానమూ నాలో వుంది. లేకపోతే ఆకాశంలోవున్న రామ్మోహన్‌కి నేల మీద శాపగ్రస్తురాలిలా పడివున్న నాకు పెళ్లి జరగబోవడం ఏమిటి? అతడు ఎన్ని మాటలయినా చెప్పి ఒప్పించి వుండొచ్చు నేను చాలా గొప్పదాన్నని పొగిడి ఉండొచ్చు కాని నాకు మాత్రం అతడి మాటలు నమ్మాలని అనిపించడంలేదు. నాకు అనిపిస్తున్నదొక్కటే ఒకవేళ ఇది కలకాకుండా నిజమైవుంటే ఆ దేవుడే రామ్మోహన్ రూపంలో వచ్చి నాకీ

వరమిచ్చాడు. అంతే.

నా ఈ ఆనందంలో పాలుపంచుకోవడానికి ఎప్పుడొస్తున్నావ్? నువ్వు ఓ వారం రోజులముందు గానే రావాలి. ఎందుకంటే నాకీ ప్రపంచంలో మిత్రులంటూ చెప్పుకోగలిగిన వాళ్లు ఇద్దరే. ఒకరు సాయికృష్ణ, రెండు నువ్వు.

సాయికృష్ణ ఈమధ్య ఇంటికి రావడమూ తగ్గించేశాడు. రేపు నా పెళ్లికీ అతడు వస్తాడో రాడో? అలాంటి పరిస్థితుల్లో నాకంటూ నా వెనుక వుండేవాళ్లు ఎవరున్నారు? నాకు కనిపిస్తున్నది నీవొక్కత్తెవే. అందుకే నిన్ను ఓ వారం రోజులు ముందుగా రమ్మంటున్నాను.

నువ్వొస్తేనే ఇక్కడ పెళ్లిసందడి మొదలవుతుంది. మరి త్వరగా వస్తావుకదూ"

నీ
రేవతి

ఉత్తరం రాయడం పూర్తి చేశాక రేవతి శారదమ్మతో చెప్పింది "అమ్మా కల్పనకు వెడ్డింగ్ కార్డు, ఉత్తరం పోస్టు చేసి వస్తాను"

శారదమ్మ కళ్లతోనే వెళ్లిరమ్మన్నట్టు జవాబిచ్చింది.

"అలాగే సాయికృష్ణ ఆఫీసుకు వెళ్లి పెళ్లికి రమ్మని చెప్పివస్తాను"

శారదమ్మ కళ్లు దించుకుంది.

సాయికృష్ణ మాట వినిపిస్తే ఆమెకు కోపం వస్తుందని తెలిసిపోతూనే వుంది. కాని తనకు మాత్రం అతడి మీద ఎలాంటి కోపమూ లేదు. మనిషన్నాక కొంత స్వార్థం వుండితీరుతుంది. తప్పులు చేస్తారు. అయితే ఎదుటి మనిషిని అర్థం చేసుకుంటే బాధపడే ప్రసక్తే లేదు.

ఆమెకు ఇష్టం లేకపోయినా చెప్పడం తన ధర్మం అని తెలిసి రేవతి వెడ్డింగ్ కార్డ్తోసహా ఇంట్లోంచి బయటకు నడిచింది.

అతడికి కార్డ్ అందించి చెప్పింది. "సాయి! నా తరపున బంధువులంటూ పెద్దగా ఎవ్వరూ లేరు. నాకు కనిపిస్తున్న బంధుమిత్రులు, నువ్వు, కల్పన మాత్రమే. కాబట్టి నా వైపు బంధువుగా ఈ పెళ్ళి బాధ్యత నువ్వూ కొంత మోయాలి"

సాయికృష్ణ మనసు పొరల్లో ఎక్కడో చిన్నపాటి బాధ మొదలయినట్టుంది. అతడు జీరవోయిన గొంతుతో అడిగాడు. "రేవతీ! నీకు... నీకు నా మీద కోపంగా లేదా? "

"ఎందుకు? " ఎదురు ప్రశ్నించింది.

"అది నా నోటితో చెప్పక్కర్లేదు. నీకూ తెలుసు"

"ఓహో! మన పెళ్ళి గురించా? " రేవతి నవ్వింది. వెంటనే చెప్పింది. "చూడుసాయి! జీవితం అంటే మనం అనుకున్నట్టు జరిగేది కాదు. మన ఊహలకు చాలా వరకూ భిన్నంగా జరిగేదే జీవితం. ఊహలకి భిన్నంగా జరిగితే 'జీవితం ఇంతే' అని సరిపెట్టుకోవచ్చుగానీ, వాస్తవాలను మరచిపోవడం మనిషి చేయకూడని పని 'పెళ్ళి' ఒక ఊహ! కాని అమ్మానాన్నలు వాస్తవం. నేను వాస్తవాన్ని మరిచిపోదలచుకోలేదు. అలా అని నా ఊహకు భిన్నంగా జరిగిందని, నా జీవితాన్ని తిట్టుకుంటూ, నీ మీద కోపం పెంచుకోలేను. స్త్రీ, పురుషులు జంటగా కలవాలనుకున్నప్పుడు అభిప్రాయాలు కలవడమే కాదు, బాధ్యతలూ పంచుకోగలిగిన విశాల హృదయమూ ఉండాలి. ఇలా జరగాలని కోరుకోవడం లేదుగానీ, నేను కోడలిగా మీ ఇంట్లో అడుగుపెట్టాక మీ అమ్మానాన్నలకే అనారోగ్యం వస్తే వాళ్ళను చూడడం నా బాధ్యతకాదని నేనంటే ఎలా ఉంటుంది? ... ఇలా ప్రతి ఒక్కరూ తమ బాధ్యతల నుండి తప్పుకోబట్టే ఇన్నేసి అనాథ ఆశ్రమాలు, ఓల్డేజ్ హోమ్‌లు, హాస్టల్స్ వెలుస్తున్నాయి. ఇలాంటి స్థితిలో నేను చేసింది నువ్వు తప్పని అనగలవా చెప్పు"

అతడు విరక్తిగా అన్నాడు. "నువ్వు




చేసింది తప్పని చెప్పలేకపోవడమేకాదు. నా తప్పు కూడా తెలుసుకున్నాను. కాని ఏం చెయ్యను? చేతులు కాలాయి. కాని ఇప్పుడు ఆకులు పట్టుకుని లాభంలేదు"

సాయికృష్ణ మాటలలోని నైరాశ్యం గమనించిందామె. అంతవరకూ అతడి ముఖంలోకి పరీక్షగా చూడలేదు. అప్పుడే చూసిన ఆమె ఉలిక్కిపడింది. అతడి కళ్లలో దిగులు గూడుకట్టుకుని ఉంది. ముఖంలో విషాదం కదలాడుతోంది. జీవితంలో సంతోషాన్ని, సంతృప్తిని దూరం చేసుకున్న మనిషిలా ఉన్నాడు అతడు.

ఆమె కాస్త కంగారుగానే అడిగింది. "సాయి! ఏమయింది? ... ఎందుకలా ఉన్నావ్? "

అతడు బలవంతంగా నవ్వాడు "నేను చెపితే నువ్వు నమ్మలేకపోవచ్చేమోగానీ, జీవితంలో కూడా మెలో డ్రామా ఉంటుంది. ఆ విషయం పెళ్ళయ్యాకే నాకు అర్థమయింది"

"వివరంగా చెప్పు సాయి"

"నిన్ను తిట్టిన పాప ఫలితమేమో తెలియదు. నా పెళ్ళయిన నెల రోజులకే అమ్మ పక్షవాతంతో మంచానపడింది. అప్పటి నుండి ఇంట్లో సమస్యలు మొదలయ్యాయి. అమ్మకు సేవ చేయడానికి, ఇంట్లో ఉన్న ముగ్గురు కోడళ్లూ విముఖత చూపసాగారు. ఆవిడ దగ్గరకు వెళ్ళడానికే అసహ్యంగా ఫీలవసాగారు.

"ఇలాంటి స్థితిలో మా నాన్నగారు కోప్పడ్డారని నా భార్య ఒక్కరోజు నా తల్లికి బట్టలు మార్చింది. ఆ కొద్దిపనికే తట్టుకోలేక ఆవిడగారికి వాంతయిపోయిందట. వెంటనే ఆమె తన తండ్రికి ఫోన్ చేసింది. రాగానే అన్నీ చెప్పి తను ఆ పన్లు చేయలేనని చెప్పేసింది. తన ముద్దుల కూతురు మాట వినగానే ఆయన మా నాన్నమీదకు దండెత్తి వచ్చాడు. తమ కూతురు అల్లారు ముద్దుగా పెరిగిందట. అలాంటి ఆడపిల్లను లక్షల కట్నంతో ఇక్కడికి పంపింది సుఖపడుతుందనేగానీ, ఇలాంటి అడ్డమైన చాకిరీ చేయడానికి కాదని ఆయన నిర్మొహమాటంగా చెప్పాడు

"మా నాన్నగారికి, మామగారికి మధ్య మాటమాటా పెరిగింది. 'అడ్డమైన చాకిరి చేయడానికైతే నేను నా కూతుర్ని ఈ ఇంట ఉంచను' అంటూ మా మామగారు తన కూతుర్ని తీసుకెళ్ళిపోయారు. దాంతో మా వదినలిద్దరికీ కూడా బాధ పెరిగింది. వాళ్ళు 'నా భార్యను అడ్డం పెట్టుకుని వాళ్ళ భర్తలకు తమ కష్టం చెప్పుకున్నారు. ప్రస్తుతం మా కుటుంబంలోని ప్రతి ఒక్కరి మనసూ ఉడుకుతున్న అగ్నిపర్వతంలా ఉంది. ఆ అగ్నిపర్వతాలు ఎప్పుడయినా బద్దలవ్వచ్చు. అదే జరిగితే కుటుంబంతో ఇంతవరకూ కలిసి ఉన్న అన్నదమ్ములం ముగ్గురం విడిపోక తప్పదు..." అతడు చెప్పడం ఆపాడు.

"అయ్యో! ఇలా జరిగిందా? " అతడు చెప్పిందంతా విన్నాక ఆమె జాలిగా అంది.

"నువ్వు వాళ్ళమీద జాలిపడుతున్నావేమోగానీ, నాకు మాత్రం వాళ్ళకు తగిన శాస్తి జరిగిందనే అనిపిస్తోంది. మంచి మనసు, వ్యక్తిత్వం ఉన్న ఆడపిల్లను కాదని, ఐశ్వర్యం వెనుక పరుగెత్తి, నన్నూ పరుగెత్తించారు. కాబట్టి అలా జరగాల్సిందే. ఇప్పుడిప్పుడే వాళ్ళకు, తాము చేసిన తప్పేమిటో తెలిసివస్తోంది. ఇంకా పశ్చాత్తాపపడే స్థితి రాలేదనుకుంటాను"

అతడు అంత కసిగా మాట్లాడడంవిని, ఆమె అతడి ముఖంలోకి అదోలా చూసింది.

ఆమె చూపులు మరోలా అర్థంచేసుకున్న అతడు అన్నాడు. "ఏమిటలా చూస్తున్నావ్ రేవతీ? ఇతగాడేంటి తప్పంతా తన కుటుంబ సభ్యులమీద నెట్టేశాడని అనుకుంటున్నావా? వాళ్ళకన్నా ఎక్కువ తప్పు నేనే చేశాను. అందుకే శిక్ష అనుభవిస్తున్నాను. పెళ్ళయిన నెల రోజులకే భార్య పుట్టింటికి

వెళ్ళిపోయి, 'వేరుకాపురం పెడితేనే వస్తాను' అని అంటున్నా, ఆమెను ఎలా దారికి తెచ్చుకోవాలో తెలియక నిస్సహాయుడిలా ఉండిపోయాను. పెళ్ళయినా బ్రహ్మచారిలా బతుకుతున్నాను. మగాడికి ఇంతకు మించిన శిక్ష మరేముంటుందో చెప్పు"

ఆమెకు అతడిమీద జాలి కలిగింది. కాని ఈ సృష్టిలో విలువలేనివి జాలి చూపులేనని తెలిసి తలొంచుకుంది.

అంతలో అతడే అన్నాడు. "రేవతీ! మనం అనుకుంటాం. జీవితం ఒక అందమైన కల. దేవుడు మనకిచ్చిన వరం. స్వప్నంలాంటి జీవితంలో ప్రతిక్షణాన్ని ఆనందంగా గడపాలి. మన చుట్టూ సుందర వాతావరణాన్ని సృష్టించుకోవాలి. నేను మొన్నటివరకూ అలాంటి భ్రమలోనే ఉండేవాడిని. ఆంటీకి నువ్వు చేస్తున్న సేవలు చూస్తున్నప్పుడు నాకు చాలా ఇబ్బందిగా అనిపించేది. నిన్ను ఊహల్లో మరోలా ఊహించుకోవడం వల్ల కాబోలు నువ్వు చేస్తున్న పని చూస్తే ఏదో అసహ్యమైన పని చేస్తున్నట్టు ఫీలయ్యేవాడిని. కాని జీవితం అంటే ఏమిటో ఇప్పుడే తెలిసింది. జీవితం ఒక అందమైన కలనే. కానీ కలల లోనయినా మనం మన బాధ్యతలు మరిచి పోకూడదు. అది దేవుడు మనకిచ్చినవరం. అందుకే ఆ వరాన్ని మనకు అనుగ్రహించేలా మధ్యవర్తుల్లా ఉండిన తల్లిదండ్రుల రుణం ఈ జన్మలోనే తీర్చుకోవాలి. స్వప్నంలాంటి జీవితంలో, అభిమానం, ఆప్యాయతలు పెంచుకుంటూ ప్రతిక్షణాన్ని ఆనందంతోపాటు, సంతృప్తిగా కూడా మార్చుకుని బతకొచ్చు అలా బతుకుతున్నప్పుడు ఆ ఇంట ఖచ్చితంగా సుందరవాతావరణం కదలాడుతుంటుంది. అయితే అది పురాణాల్లో చెప్పబడిన మయసభలా చూసేవాళ్ళ మనసులనుబట్టి అక్కడి వాతావరణం కనిపిస్తూ ఉంటుంది"

"జీవితం గురించి చాలా బాగా అర్థంచేసుకున్నావ్ సాయి"

వాతావరణాన్ని తేలిక పరచాలని ప్రయత్నిస్తున్నట్టు అతడు నవ్వేశాడు. "ఆస్తి పోతే పోయింది. సివిల్ లా మొత్తం తెలిసింది, అన్నట్టు తప్పుచేస్తే చేశాను జీవితమంటే ఏమిటో నాకర్థమయింది"

"కాని అర్థమయిన దాన్ని అమలుపరచడం లేదని మాత్రం తెలుస్తోంది"

"మళ్ళీ అదేంటి? "

"అవును మరి! అమ్మానాన్నల గురించి అంత చక్కగా నిర్వచించి, బిడ్డల బాధ్యతను గుర్తించిన నువ్వు వాళ్ళకు తగిన శాస్తి జరిగిందని సంతసించడం తప్పు కదూ? నాకు తెలిసినంతలో ఏ తల్లిదండ్రులూ బిడ్డలకు చెడు చేయాలని అనుకోరు. కాకపోతే ఒక్కోసారి వాళ్ళ అజ్ఞానం వాళ్ళకు తెలియకుండానే బిడ్డలకు కీడు చేస్తూ ఉంటుంది. అజ్ఞానం వాళ్ళతప్పు కాదు. వాళ్ళతప్పు కాని దానికి వాళ్ళను శిక్షించడం న్యాయం కాదు"

అతడు ఆమెకేసి కొద్దిక్షణాలు అదోలా చూస్తుండిపోయాడు. అతడి చూపులు గమనించిన రేవతి అడిగింది.

"ఏంటలా చూస్తున్నావ్ సాయి? "

"నీకు... నీకు ఎవ్వరిమీదా కోపం ఉండదా రేవతి? "

"నీకు ఎవరిమీదనైనా కోపం వచ్చినప్పుడు అవతలివాళ్ళ ఆలోచనా ధోరణిలో కాసేపు ఆలోచించు. అవతలివాళ్ళదీ తప్పు లేదనిపిస్తుంది. అవతలివాళ్ళమీద కోపం క్షణంలో ఎగిరిపోతుంది"

"మంచి విశ్లేషణ"

"నా సొంతం" ఆమె నవ్వింది.

కొద్దిసేపటి తర్వాత ఆమె అక్కడినుండి కదులుతూ చెప్పింది. "పెళ్ళి పనులు ఎక్కు

వగా లేకపోవచ్చు. కాని బాధ్యతగా ప్రతి రోజూ రావడం మరచిపోకు"

"రేపటినుండి నీ పెళ్ళయ్యేవరకూ ఆఫీసు వేళల్లో తప్ప మిగతా టైంలో ఎక్కువ భాగం మీ ఇంట్లోనే ఉంటాను. సరేనా? "

"థాంక్స్"

అతడు ఆమెను రిక్షా ఎక్కించాక "ఉంటాను" అంటూ ఆగిపోయాడు.

ఆమె ఎక్కిన రిక్షా ముందుకు సాగింది.



పెళ్ళికి వారం రోజులు ముందుగానే వచ్చింది కల్పన.

వచ్చీ రావడంతోనే సీరియస్‌గా అడిగింది. "ఏమే! ఆ రోజు నేను రామ్మోహన్ గురించి చెపితే ఏమని మాట్లాడావ్! ఇప్పుడెలా పెళ్ళి చేసుకుంటున్నావ్? "

"చెప్పక తప్పదా? " మాష్టారి ముందు స్టూడెంట్‌లా చేతులు కట్టుకుని నిలబడింది రేవతి.

"తప్పదు" సీరియస్‌గా అంది కల్పన.

"ఏం చేయనే! అత్తారింటికి ఆడపిల్ల వెళ్లడం లేదా అల్లుడినే ఇల్లరికం తెచ్చుకోవడం ఇంతవరకూ మనదేశంలో వున్న సాంప్రదాయం. కానీ నాకు కాబోయే భర్త తన భార్యతోపాటు అత్తగారిని కూడా తనింటికి ఆహ్వానించాడు. అంతగొప్ప మనసు వున్న అతడిని వదులుకోలేకపోయాను"

రేవతి సీరియస్‌గా అందో లేక తనకు జవాబు చెప్పడానికి అలా చెప్పిందోగానీ, జరుగుతున్న వాస్తవం అదే. ఏదేమయినా రామ్మోహన్ తీసుకున్న నిర్ణయం చాలా గొప్పది. ఈ దేశంలో కొంతమంది యువకులైనా ఈ విధంగా ఆలోచించగలిగితే కేవలం ఆడపిల్లల్ని మాత్రమే కని ఆఖరిదశలో కష్టాలు పడుతున్న చాలామంది ఆడపిల్లల తల్లిదండ్రులకు కష్టాలు తొలగిపోయే అవకాశం ఉంది... అనుకున్న కల్పన నెమ్మదిగా తలాడిస్తూ రేవతి భుజంమీద ఆప్యాయంగా చెయ్యివేసి చెప్పింది. "నువ్వు అదృష్టవంతురాలివే రేవతీ"

"నేనూ అదే అనుకుంటున్నాను. నేను నీకు ఉత్తరంలో రాసినట్టు ఇది కలో, నిజమో నాకింకా అర్థంకావడంలేదు"

కల్పన రేవతిని గట్టిగా గిల్లింది.

"అమ్మో" అరిచింది రేవతి.

"ఇప్పటికైనా అర్థమయింది కదా, నువ్వు కలగనడం లేదు, జరుగుతున్నదంతా వాస్తవమే" కల్పన నవ్వింది.

రేవతి కూడా ఆ ప్రాక్టికల్ జోక్‌కి నవ్వకుండా ఉండలేకపోయింది.

పెళ్ళి సింపుల్‌గా జరుగుతుంది కాబట్టి పెళ్ళి పనులంటూ పెద్దగా ఏమీలేవు. కాని ఎంతయినా పెళ్ళి కాబట్టి ఇంటిని అలంకరించడం, బట్టలు కొనుక్కోవడం, గోరింటాకులు పెట్టుకోవడం... అవీ, ఇవీ ఏవో కొన్ని ఉండక తప్పవు. ఆ పనుల్లో కల్పన సహాయపడసాగింది.

తను చేయదగిన పని ఏదయినా ఉందేమోనని అడగడానికి సాయికృష్ణ రోజూ ఆ ఇంటికొస్తున్నాడు.

శారదమ్మ, కల్పనలు మొదటిరోజు అతడిని చూసి తలలు తిప్పుకున్నారు. రెండో

రోజు కల్పన అతడితో అభిమానంగా మాట్లాడింది. శారదమ్మ పలకరింపుగా నవ్వింది. వాళ్ళకు అతడిమీద కోపంపో యింది.

చాలా కొద్దిమంది ఆహూతులమధ్య రేవతి, రామ్మోహన్‌ల పెళ్ళి జరిగిపోయింది.

ఆ పెళ్ళికి హాజరయిన చాలామంది రేవ తిది అదృష్టం అనుకుంటే ఒకే ఒక వ్యక్తి మాత్రం 'రేవతిని పెళ్ళిచేసుకున్న రామ్మో హన్ చాలా అదృష్టవంతుడు' అనుకు న్నాడు.

ఆ వ్యక్తి- సాయి కృష్ణ.

రామ్మోహన్ రేవతిని దగ్గరగా తీసుకుని అడిగాడు.

"రేవతీ! నేనోమాట అడగనా? "

"అడగండి"

"ఒకవేళ మన పెళ్ళి జరగకుండా వుండి వుంటే తల్లికి సేవలు చేసుకుంటున్న నువ్వు, ఆ తర్వాత ఏం చేసి వుండేదానివి? "

"ఇప్పుడు అమ్మకు అమ్మగా వున్న నేను, ఆ తర్వాత 'అమ్మలకు అమ్మగా మారాలని అనుకున్నాను"

అతడికి అర్థమయింది. అతడు ఆమెను మరింత గాఢంగా హత్తుకుని మంద్రస్థా యిలో పలికాడు.

"ఇప్పుడయినా నువ్వు' అమ్మకు అమ్మ' గానే కాదు. ఎందరో అమ్మా నాన్నలకు అమ్మగా మారొచ్చు రేవతీ"

"ఎలా? "

"మన హాస్పిటల్‌కి ఎందరో అభాగ్యులు, అనాథలు, బిడ్డలచేత తిరస్కృతులయిన వృద్ధులు వాళ్ళందరిలోనూ తరచి చూస్తే నీకో అమ్మ కనిపిస్తుంది. ఆ 'అమ్మ'లకు, నాన్నలకు సేవచేస్తే..."

అతడేం చెప్పదలచుకున్నాడో ఆమెకు అర్థ మయింది. ఆమె తలెత్తి అతడి కళ్ళల్లోకి కళ్ళు కలిపి చూడసాగింది. అప్పుడే పొంగి పొరలిన ఆనందంతో కళ్ళు చెమ్మగిల్లాయి.

"నిజం రేవతీ! నీలో గొప్ప సేవాగుణం ఉంది. అయితే ఆ సేవ ఒక్కరికే అంకితమ య్యింది. ఆ అద్భుత గుణాన్ని పరిమితంగా ఉపయోగించకు. విశ్వవ్యాపితం చెయ్యి. నిజం చెప్పాలంటే ఇప్పుడు ఈ ప్రపంచానికి కావలసింది నీలాంటి సేవాగుణం ఉన్న మనుషులే... ఆలోచించు. నీకు నా పూర్తి సహాయ సహకారాలుంటాయి"

ఆమె నిశ్శబ్దంగా తలాడించింది.

మర్నాటినుండే ఆమె తన తల్లితోపాటు, ఆ ఉచిత వైద్యశాలకు వచ్చిన పేషంట్లంద రిలో తన తల్లీనీ, తండ్రినీ, బంధుమిత్రులను చూసుకోసాగింది.

చాలా కొద్దిమంది మాత్రమే చేయగలిగిన పని అది.

అలా ఆ హాస్పిటల్‌లో కాలం గడుపు తుంటే, ఓరోజు ఓ బెడ్‌మీద నుండి పిలుపు వినిపించింది.

"అ... అ.. అమ్మా"

ఆ చిరపరిచితమైన గొంతునుండి వెలు వడే పిలుపుకోసమే ఎంతోకాలంగా ఎదురు చూస్తున్న రేవతి చప్పున తల తిప్పి చూసింది.

దగ్గరలో ఉన్న బెడ్‌మీద శారదమ్మ ఉంది. ఆవిడ తననే పిలుస్తోంది.

ఎప్పటినుండో తను ఇస్తూవస్తున్న 'స్పీచ్ థెరఫీ' ఇప్పటికి పనిచేసిందన్నమాట.

తన తల్లి తనను "అమ్మా" అని పిలి చింది.

"వృద్ధాప్యంలో ఉన్న 'అమ్మ'చేత 'అమ్మా' అని పిలిపించుకోగలిగిన అదృష్టం ఎంతమం దికి దక్కుతుంది? ' అనుకుంటూ రేవతి ఉద్వేగంతో తల్లివైపు అడుగులేసింది.

తనకు దగ్గరగా వచ్చిన కూతుర్ని శార దమ్మ 'అమ్మా' అంటూ, మంచినీళ్ళు ఇవ్వ మని సైగచేసింది.

తల్లి నోటినుండి మరోసారి విన్న ఆ పిలు పుకు రేవతి తనువు పులకరించిపోయింది.

జీవితం ధన్యమయిందనుకుంది.

రెండు ఆనందాశ్రువులు జారేయి. 

 

# 'పాణిగ్రహణం' పై సమీక్షలు

జూలై 'చతుర'లో ప్రచురితమైన ఎ.జయలక్ష్మిరాజు రచన "పాణిగ్రహణం" పై మాకందిన ఉత్తమ సమీక్షలను ఈ దిగువన ప్రచురిస్తున్నాం.



## చిరుజల్లు

(ప్రథమ బహుమతి రూ. 100/- పొందిన సమీక్ష)

ధర్మార్థ కామ మోక్షాలనే చతుర్విధ పురుషార్థాల సాధనలో 'నీతోనే కలిసి వుంటాన'ని ప్రమాణం చేసి స్త్రీ చేయందుకోవడమే 'పాణిగ్రహణం'. దాంపత్య జీవితాన్ని సులభతరం చేసుకోవడానికి సహాయపడే 'కులం' ఆచార వ్యవహారాలతో సహా వివాహాల్లో అత్యధిక ప్రాధాన్యాన్ని సంతరించుకుంది.

సమకాలీనాలైన కులతత్వాన్నీ, స్త్రీల వివాహ సమస్యల్నీ కలగలిపి జయలక్ష్మిరాజుగారు రచించిన 'పాణిగ్రహణం' నవల కాలక్షేపాత్మకంగా, ఆలోచనాత్మకంగా, వినోదాత్మకంగా వుంది. "నెసిసిటీ ఈజ్ ది మదర్ ఆఫ్ ఇన్వెన్షన్" అనే ఆంగ్ల జాతీయాన్ని గుర్తుచేస్తూ "నా పెళ్ళి నిశ్చితార్థం ఆగిపోయి, నాన్నతో పోట్లాడినపుడు పడిన టెన్షన్‌లోంచి పుట్టిందీ పాణిగ్రహణం ఆలోచన" అంటూ రాజేశ్వరి చందూతో అనటం యువతరాన్ని ఆలోచింపచేస్తుంది. అయితే అసలు సమస్య ప్రేమ వివాహాలా, అలాంటి వివాహితుల పిల్లల భవితవ్యమా అనేది సందిగ్ధంలోనే వదిలేశారు రచయిత్రి. నవల ఆద్యంతమూ సమస్యల వివరణతోనే సాగింది కానీ పరిష్కారదిశగా లేదు. పాణిగ్రహణ కార్యాలయావిర్భావ కారణం కులాంతర ప్రేమ వివాహాల్ని జరిపించడం. కానీ ఆ సంస్థ ఇతర వివాహాలూ జరిపి, సాధారణ మేరేజ్ బ్యూరోగానే మిగలడం నవలాదర్శానికి దెబ్బ. వివాహ వ్యవస్థా, కులం అనేవి భారతదేశమనే మహావృక్షానికి బాగా పాతుకుపోయి అల్లుకున్న వేర్లలాంటివి. వాటిని ఎక్కడికక్కడ సున్నితంగా పరిష్కరిస్తూ జీవితాన్ని సాగించాలి. క్రమంగా, కాలక్రమేణా బలీయమైన సమస్య అదే శైలిలో కనుమరుగు కావాలి. అది హటాత్తుగా సాధ్యంకాదు. పాణిగ్రహణంలాంటి సంస్థలకు సామాజిక స్పృహ కలిగిన వ్యక్తుల అండదండలుండి, వారు ప్రజల్లో అవగాహన కలిగించాలి. అందరి జీవి

తాలూ సమస్యలూ ఒకేలా వున్నా అందరూ రాజేశ్వర్లూ, విజయలూ కాలేరు. కథనం, సంభాషణాత్మకశైలి, చిరుజల్లులా హాస్యం నవలని చదివించేలా చేశాయని చెప్పవచ్చు

–జి.వి. మురళీమోహన్,
పలాస - 532 221

## పురుషాధిపత్యానికి గ్రహణం

*(ద్వితీయ బహుమతి రూ. 75/– పొందిన సమీక్ష)*

ఆదర్శ వివాహాలద్వారా కులమత భేదాలు సమసిపోవాలని, పురుషాధిపత్య సమాజం నశించి మాతృస్వామ్య వ్యవస్థ రావాలనే రెండు ప్రతిపాదనలకు హాస్యాన్ని రంగరించిన ప్రయోజనాత్మక నవల ఎ. జయలక్ష్మి రాజుగారి 'పాణిగ్రహణం'.

పురుషాధిపత్య భావజాలంతో పీడింపబడితే అది తల్లిదండ్రులనుంచైనా సరే అనివార్యంగా ఎదిరించి నిలవాలని నిరూపిస్తాయి రాజేశ్వరి, సుశీల, విజయ, రమ పాత్రలు. ప్రచ్ఛన్నంగా ఎస్.ఐ. గోవర్ధని, లాయర్ పాత్రలు సందేశం కూడా ఇదే.

నవలలోని స్త్రీ పాత్రలన్నీ తమ కాళ్ళమీద తాము నిలబడి తమ వ్యక్తిగత సమస్యలను అధిగమించి సమాజానికి సవాలుగా నిలిచిన సమస్యలను విజయవంతంగా పరిష్కరించాయి. వివాహం జరిపించుకోవాలని వచ్చిన రకరకాల స్త్రీపాత్రలు కూడా పురుషాధిపత్యాన్ని ప్రశ్నిస్తూనే నిరసిస్తూనే పురుషుల్ని అంగీకరించిన ఉదాత్త పాత్రలు.

కథలో ప్రాధాన్యం గల ఒక పురుషపాత్ర కూడాలేదు. చక్రవర్తి, చందు, నారాయణరావులతో పాటు అన్ని పురుష పాత్రలూ హాస్యం కోసమే సృష్టింపబడినట్లున్నాయి. పితృస్వామ్య సమాజం పోయి మాతృస్వామ్య సమాజం రావాలని రచయిత్రి రాజేశ్వరి పాత్రద్వారా తెలియచేశారు. కానీ ఒకప్పుడు సమాజంచే నిరాకరింపబడిన ఒక వ్యవస్థ చరిత్రలో పునరావృతం అవుతుందా?

అనేక రకాలుగా భ్రష్టులైన వారి వివాహాల్ని గురించి ఏకరువు పెట్టడంవల్ల అక్కడక్కడ విసుగు పుడుతుంది. సమస్యాత్మకమైన ఒకటి, రెండు వివాహాలను మాత్రమే తీసుకొని ఉంటే కథైక్యంతోపాటు, పఠనాసక్తి కలిగేది. 'పాణిగ్రహణం'లాంటి ఆఫీసును తమ అవసరానికి వాడుకొని తాము త్యాగం చేయవలసి వచ్చినప్పుడు తప్పుకునే డొల్ల పాత్రల విషయం కూడా ప్రస్తావించి ఉంటే వాస్తవికతకు దగ్గరగా ఉండేది.

పెళ్ళి విషయంలో బాధాసర్పద్రష్టులందరికీ 'పాణిగ్రహణం'లాంటి ఆఫీసూ, నవలలో ఉన్నలాంటి మనుషులూ ఎక్కడో ఒక చోట ఉండకపోతారా? మనకూ మంచిరోజులు రాకపోవులే అనే ఆశను, జీవితంపై ఆసక్తిని కల్గిస్తుందీ నవల. ఇలాంటి ఆఫీసును నడపాలనే స్ఫూర్తిని కూడా కలిగిస్తుంది. 'పెళ్ళిళ్ళ పేరమ్మలు'గా కూడా ఆడవాళ్ళదే పైచేయి అని నిరూపించారు రచయిత్రి.

నవలా ఇతివృత్తం, అందులోని పాత్రలు తీర్చిదిద్దబడినట్లుండి, పాఠకులకు స్ఫూర్తిని, ఆత్మవిశ్వాసాన్ని కలిగించే నవలను అందించిన 'చతుర'కు కృతజ్ఞతలు.

–వి. చంద్రశేఖర్,
అనంతపురం - 515 001

## విశ్వకల్యాణ వేదిక

*(మూడవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)*

ఆధునిక యుగంలోకి దూసుకుపోతున్నా, మానవుని పుట్టుకలోని వివిధ దశలను కంప్యూటరీకరించి కనులముందుంచుతున్నా, క్లోనింగ్ ప్రక్రియతో 'డిటో జీవులను' సృష్టిస్తున్న సైంటిఫిక్ యుగంలో పరిభ్రమిస్తూ కూడా మనం కులాతీత,




మతాతీత సమసమాజాన్ని సృష్టించుకోలేక పోతున్నామంటే, సంకుచితత్వమనే సనాతన భావాలను ఆధునికత 'మేకప్'తో కప్పి పుచ్చుకొని, ఆదర్శవాద ముసుగులతో మనల్ని మనం మభ్యపెట్టుకోవడమే కారణ మనేది కాదనలేని వాస్తవం.

ఆధునిక యువత ఆదర్శాల వెల్లువలో, వయసుజోరులో మునిగి తేలుతూ కుల, మతాంతర వివాహాలు చేసుకొని, జీవన ప్రవాహ ఉధృతి తగ్గాక సమాజం గడ్డిపోచలను అందుకొని బాధ్యతల ఒడ్డు చేరే ప్రయత్నంలో ఒడిదుడుకులను ఎదుర్కుంటూ, సంసారం సాగరంలో కలిసిపోయి సమస్యల ఆటుపోట్లను ఎదుర్కొనే వైనం 'పాణిగ్రహణం' నవలలో రచయిత్రి చక్కగా వివరించారు. కులాంతర వివాహ జీవన నేపథ్యాన్ని ఎంచుకున్నా, స్త్రీల సమస్యలు పలుకోణాలనుండి చూపించడానికి రచయిత్రి ప్రయత్నించారు. అయితే కథనమంతా ఆద్యంతం కులాంతర వివాహాలు సఫలం కాక విఫలమయిన బాధితుల పాత్రలే. అలాకాకుండా, తాత్కాలిక సమస్యలను అధిగమించి తమ వివాహ జీవితాలను సఫలం చేసుకునే ఆదర్శప్రాయమైన, సందేశాత్మక పాత్రల్ని కూడా ప్రవేశపెట్టి వుంటే బాధిత పాత్రలు తమను తాము 'పేరులేని కులమని' కించపరుచుకోకుండా అడ్డుపడి వుండేవి.

ఒకవైపు పురుషాధిక్య సమాజాన్ని, పితృస్వామ్య పాలనను వ్యతిరేకిస్తూనే, పురుషుని అండ లేకపోతే మనగలగడం కష్టమని వచ్చే వధువులకు తగిన పురుషుని చూసి వివాహబంధంతో ముడిపెట్టి పంపండంవల్ల పురుషుని ప్రాధాన్యతను గుర్తించి, పరోక్షంగా పురుషాధిక్యతను ఆమోదించే ద్వంద్వవైఖరితో రాజీ పాత్ర సాగిందని చెప్పకతప్పదు.

అనేక సంఘటనల సమాహారమైన ఈ నవలలో సమాజంలోని అనేక పాత్రల జీవిత గమనాలను వివిధ కోణాలలో చూపించి, పరిష్కార మార్గాలను కూడా సూచించిన రచయిత్రి అవగాహనకు, పరిశీలనాదృష్టికి అభినందనలు. రాజి, విజయ, గోవర్ధని, హాసినిలాంటి సబలల నేతృత్వ నిర్వహణలో సమాజమనే 'పాణిగ్రహణం' ఆఫీసు విశ్వకళ్యాణ వేదికగా మారి, కులం దాటి, మతం దాటి సమభోగం, సమభాగం, సమసంస్కృతి భారతావనిలో నిండాలని కోరుకొనే రచయిత్రి కృషి ఫలించాలని ఆశిద్దాం.

–బడబాగ్ని అరుణకుమారి,
గజపతినగరం - 535 270

## మార్గదర్శకత్వం

*(నాలుగవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

మనదేశంలో చాలా మతాలు, ఎన్నో కులాలు, మరెన్నో భాషలూ వున్నాయి. ఎవరికివారికి సాంప్రదాయబద్ధమైన వివాహ వ్యవస్థ, ఆచార వ్యవహారాలు, పద్ధతులు, అలవాట్లు వున్నాయి. ఎన్ని వైవిధ్యాలు వున్నా సహజంగా వయస్సుతో వచ్చే పరస్పరాకర్షణ యువతీయువకుల్లో వుంటుంది. దానివల్లగానీ, మరే ఇతర కారణాలవల్లగానీ మతాంతర, కులాంతర మరియు ఆదర్శ వివాహాలు జరుగుతూ వున్నాయి. గతకాలంలో కన్నా ప్రస్తుత కాలంలో యిట్లాంటివి ఎక్కువగా జరుగుతున్నాయి. రానున్న కాలంలో యివి యింకా ఎక్కువగా జరిగే అవకాశాలున్నాయి. దీనికి కారణం మారే వ్యవస్థే.

మారుతున్న కాలంలో అనేక సమస్యలు, సంఘర్షణలు వస్తాయి. వర్తమానకాలంలో సాంప్రదాయ సిద్ధంగా జరిగిన వివాహాల్లో కూడా అనేక సమస్యలు వస్తున్నాయి. అట్లాగే మతాంతర, కులాంతర, ఆదర్శ వివాహాల్లో కూడా సమస్యలు కనిపిస్తున్నాయి. 'పాణిగ్రహణం' నవలలో రచయిత్రి ఇలాంటి

సమస్యల్ని చాలావరకూ వివరించారు.

రచయిత్రి యీ నవలలోని పాత్రలద్వారా ప్రస్తుత సమాజంలో అందచందాలకు, ఆస్తి పాస్తులకు, కులమతాలకు ప్రాధాన్యం ఇవ్వకుండా మంచి మనసుతో, మానవత్వంతో జీవిత భాగస్వామిని ఎంచుకొని జీవితాంతం సుఖమయంగా గడుపుకోవాలని, అవసరం అయితే పరిస్థితుల్ని ధైర్యంగా ఎదుర్కొని వివాహానికి తొందరపడకుండా కాలం అనుకూలించేవరకు వేచి వుండాలని విశదపరిచారు.

అయినా సమస్యలు రావచ్చు పరిష్కార మార్గంగా 'పాణిగ్రహణం' వంటి సంస్థలు ఏర్పడి సమాజానికి మార్గదర్శకత్వం వహించాలని అన్యాపదేశంగా సూచించినట్లు అవగతం అవుతోంది.

'పాణిగ్రహణం' ఆఫీసులో ఒక్క రాజేశ్వరి తప్ప మిగిలిన సభ్యులందరి ప్రవర్తన జుగుప్సాకరంగా వుంది. బహుశా హాస్యాన్ని పోషించాలని తాపత్రయపడి ఎంతో ఆదర్శవంతంగా నడుపుతున్న సంస్థ సభ్యులు చాలా చవకబారు విమర్శలు, హావభావ చేష్టలు ప్రదర్శించి ఆఫీసుకు వచ్చిన వినియోగదారుల మీద అతిగా, క్రమశిక్షణా రాహిత్యంగా స్పందించారు. వారు కూడా హుందాగా ప్రవర్తించి వుంటే సంస్థకు, దాని ధ్యేయానికి సార్థకత చేకూరేది!

–కె.ఎస్. ప్రభ
పార్వతీపురం - 535 501

## కథల సమాహారం

*(అయిదవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

'పాణిగ్రహణం' నవలకు కందుకూరి వీరేశలింగం పంతులుగారి సంస్కరణలు రచయిత్రికి స్ఫూర్తినిచ్చి వుంటాయి. నవల ప్రథమాంకంలో ఇది 'కులవ్యవస్థపై సంధించిన బాణం' అనిపించింది గానీ, చాలా భాగం విధివంచితులైనవారి కథల సమాహారంగా, వారి పెళ్ళిళ్ళ సందడిగా సాగింది. అంతర్లీనంగా విజయ-చందూ, రాజేశ్వరి-మురళి, రమ-కిరణ్ అనే మూడు ప్రేమజంటల కథ ముచ్చట గొల్పింది.

నవలలోని కథానాయికలు రేప్‌కు గురికాబడ్డ ఝాన్సీకి కల్యాణ్‌తో, వితంతువైన శ్యామలమ్మకు శంకర్రావుతో, విధి వంచితురాలైన లచ్చిందేవికి రంగబాబుతో, గొడ్రాలిగా ముద్రపడ్డ గిరిజకు కుజదోషం కాటుకు బలయిన కుమార్‌తో, మూగపిల్ల వీణకు వికలాంగుడైన నవీన్‌తో జగన్‌కు ముస్లిం అమ్మాయి రజియాతో ఆదర్శ వివాహాలు జరిపించారు. ఆ విధంగా ఈ నవల ఒక ప్రయోజనాత్మక నవలగా మలచబడింది. భార్యాపిల్లలుండి కూడా పెళ్లికి సిద్ధపడ్డ సారధి, సినిమాల ప్రభావంతో చిన్న వయసులోనే ప్రేమలో పడ్డ రాణి, సౌందర్రాజన్‌ను సౌందర్య అనుకొని కలం స్నేహంతో భంగపడ్డ భక్తవత్సలం, అర్థంలేని సెంటిమెంట్లతో తాంబూలాలు పుచ్చుకున్న పెళ్లిని కూడా రద్దుచేసిన పరంధామయ్య, జాతకాల పిచ్చిలో కూతుళ్ళ పెళ్ళిళ్ళను అలక్ష్యం చేసిన కుటుంబరావు, తెలియని ప్రేమికురాలి గురించి ఆరాటపడ్డ ఎల్.ఎల్. రావులకు భంగపాటు కలిగింది. ఆ విధంగా ప్రేమ, పెళ్ళి, వివాహబంధం అనే పదాల పవిత్రతను గుర్తించని ఎందరికో ఈ నవల కనువిప్పు కలిగిస్తుంది.

–గుబ్బల సత్యనారాయణమూర్తి
ముమ్మిడివరం - 533 216



Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 3730328. Office Address: CHATURA, Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel: Hyderabad: 3318181, 3398787; Madras: 8270434, 8251044; Vijayawada: 476685; Visakhapatnam: 552211; Tirupati: 75757; Anantapur: 33777; Rajahmundry: 79170; Karimnagar: 23216; Suryapet: 21146; Guntur: 512149; Nellore: 338734; Kurnool: 52122; Srikakulam: 26060.

